# సాహిత్యతత్త్వవిమర్శనము



జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి, ఎమ్.ఎ., బి.ఎల్.

# సాహిత్యతత్త్వవిమర్శనము



పొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి, ఎం, ఏ., బి, ఎల్.

జయపురసార్వభౌము

సాహిత్యసమ్రాట్

డాక్టర్

శ్రీశ్రీశ్రీ విక్రమదేవవర్మమహారాజులుంగారికి

# FOREWORD.

---

*Sahityatattvavimarsanamu* is an interesting book. Mr. J. Satyanarayana Moorti, M.A., B.L., is a gifted critic and a prosewriter of distinction in Telugu. Literary appreciation requires, quite as much as literary creation, an eager sensibility, an insight into human motive, a sureness of thought and a fine feeling for words. These essays indicate that the author is not a mechanical critic repeating the traditional views. They are full of fresh and lively observation as they are of reflective wisdom. In reading them we do not feel any sense of strain or exaggerated effort.

I am particularly happy that he recognises the spiritual character of all true art. A work of art is the expression of the soul's vision. It is never wholly rational. It conveys a stillness, a remoteness, a sense of the beyond, the far away. Many of our modern works take shape in our wits, not in our souls. They have technical skill, intellectual power, but do not have that inspiration, that rare adequacy of mind which is essential for great art. The author has the perception which great literary artists and critics had, that if literature is to be soulful, if it is to express the movement of life, it must be inspired, express not so much the *Buddhi* as the *Pratibha* of the writer. *Pragna Navanavonmesasalini Pratibha*. I do hope that in the Andhra literary revival where new experiments are being tried, this ancient truth will not be ignored.

S. RADHAKRISHNAN.

# PREFACE.

The '*Sahithyathatvavimarsanamu*' of Mr. J. Satyanarayana Moorti M.A., B.L., is in many respects a remarkable production. It strives to examine the root principles of poetry and does so with considerable success. The gifted author's thoughts are fortified by well-chosen illustrations and appeals to standard authorities, Eastern as well as Western, which enhance the value and power of the presentation. I trust it will command wide audience.

Of course there can be no finality of view in Aesthetics, of which Poetry is a most important and specific part. As old Chaucer has it, "as many heads as many wits there been." The conclusions of one age or of one school are very often the data and steps for the next advance. I think Mr. J Satyanarayana Moorti has taken the thought on this theme to a new level, though the old directions remain unaltered.

The author is still a young man who is learning and growing every year with the charming characteristic of eager youth. With ripening wisdom and a mellowed style he is sure to be able to infuse into his wide and varied scholarship profounder unity of thought, and a greater beauty of form, animated by his originality. I wish him all success in his passionate pursuit of the difficult art of criticism.

C. R. REDDY.

# విషయసూచిక.



# ఉపోద్ఘాతము

"సాహిత్య తత్త్వ విమర్శనము"—అను నీసారస్వత గ్రంథము బ్రహ్మశ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి ఎం. ఎ; బి. ఎల్. గారు మిక్కిలి పరిశ్రమచేసి సారస్వత తత్త్వమెల్ల భావగతము చేసుకొని, చేసికొనినదంతయు నక్షరరూపము గావించిరనుట కెంతయు సంతసింప వలసియున్నది. భావనాగతమై, నవనవోన్మేషమగు ప్రతిభతో మనోऽతీత మహావిషయముల నిర్వ్యక్తీకరించుట కష్టతరము. మన విమర్శకుఁడు తన శాంతవిశాలహృదయమునను నాత్మసాక్షాత్కారముం గలిగించుకొని, నిజప్రజ్ఞాబలంబునఁ బ్రాచ్య పాశ్చాత్యపండితపరిష్కృతాభిప్రాయము లెల్లఁ బ్రోదీకరించి, సనాతనాధునాతన మతానుసారంబుగ నిది క్రొత్త మార్గమని తోఁచునట్లు సాహిత్యకళకుం గావలసిన సర్వ విషయము లిందు విద్వదాహ్లాదకరముగా నతిశయోక్తులకుం జోటీక నవకళం బత్రించెననుట స్వభావోక్తియగు. ఇతఁడు తన మనోగతాశయము లెల్ల వెల్లడించుటకు స్వతంత్రించియు, వానినెల్ల నితర మహావిమర్శకుల సారస్వతముం బ్రమాణీకరించి బలపఱచుచు నూత్నశక్తి, నూత్నసృష్టి, నూత్నాభిప్రాయ మనునట్లు గ్రంథము పేరెన్నిక కెక్కఁజేసె.

ఇతఁడు చిన్నఁదనమునుండియు పురాణవిద్యావ్యాసంగము చేసినవాఁడయ్యు, సంస్కృతాంధ్రసాహిత్యము సంపాదించి, వంగాది భాషలం జదివి, సువిమర్శకునకుఁ గావలసిన సర్వవిషయములను సేకరించి, కవి యనిపించుకొనుటకుం దగిన సాధన సామగ్రినంతయు నలవరించుకొనెనని త్రికరణశుద్ధిగాఁ జెప్పవచ్చును. లోకమున రెండు పద్య

ము లల్లఁగలిగినవారెల్లఁ గవులు నాఁబడరు. "నానృషిః కురుతే కావ్యం" అనుటంజేసి ఋష్యంశంబున జనించిన కవి భగవత్కళాకలితుండనియుఁ జెప్పవచ్చు. కవి నిజపరిజ్ఞానంబున సర్వప్రపంచముల నాత్మ దృష్టితోఁ బరిశీలించి విమర్శింప శక్తి గలవాఁడు కావలయు. మన యిక్కవి తనవిమర్శన గ్రంథములు లోకమున వెదఁజల్లి కవిపట్టము నొందఁగలవాఁడై సంకులకు నాయానాద మిందు మూలమున వ్యక్తీకరించుచున్నాను. మఱియు నితఁడు భాషా విషయముననే కాక నేదేశమున నేయద్భుత విషయము కానవచ్చుచున్నదని వినవచ్చినను ధన వ్యయము, కాయకష్టము నాఁక తత్తద్దేశముల కేగి తత్తద్విషయము లెఱింగి తత్త్వము లోకమునకు నివేదించు నాచారముగల మేధాశాలి యని నేనెఱుంగుదును. ఈనడుమ హస్తినాపురములో శాంతిదేవి పూర్వజన్మ కథనము చేయుచున్నదనివిని యటకుఁబోయి సర్వముఁ దెలిసికొనివచ్చి పూర్వజన్మము, పరజన్మము లేదనువారికి వాకట్టు మంత్రము వేసిన విజ్ఞాని. ఇతఁడు నవనాగరికుఁడై సదుఁ బూర్వాచారములను, పూర్వధర్మములను భూషించు పురుషమూర్తి. ఎం. ఏ. పట్టమును బి. ఎల్. పట్టము నొందియుఁబరాధీనవృత్తికిఁ బాల్పడక, "సుశీల", "శ్యామల", "లలిత", "మాధవి", "చంద్రగుప్త", "ప్రణయ ప్రతిమ", "పెండ్లిదండ", "మహారాష్ట్రజీవనప్రభాతము" లోనగు ననేకగ్రంథములను, వ్యాసములను తత్త్వదర్శియై రచించి ప్రఖ్యాతిఁ గాంచిన సుకవిశేఖరుఁడని లోక మెఱింగినదాని కేనిట మఱియు నెఱింగించుచున్నాను. ఇది యత్యాదరముగాని చర్వితచర్వణమన నొప్పదు.

ఈ గ్రంథమందు సాహితీహృది, సారస్వతంబు లోనగు 13 విషయములు చేర్పఁబడి యున్నవి. అందు సాహితీహృదిలో సాహిత్యము సనాతనమైనది. సృష్ట్యాదివలె నిరూపింప శక్యముగానిదని వ్రాసిరి. నా

మతమున సృష్టికంటె మొదటిది సాహిత్యమని. పరమేశ్వరుఁడు సృష్టి చేయనెంచి తలంచినంతలో సాహిత్యము (వేదము) ఉత్పన్నంబయ్యె. అనాదియని చెప్పఁబడు సృష్ట్యాది క్రైస్తవమతమున నాలువేలేండ్ల నచో, నామతమున నాలునూర్ల యేఁబదిసంవత్సరములు. సృష్ట్యాది నుండి పరమేశ్వరుని ముఖాదినుండి యార్గురుబ్రహ్మలుపుట్టిగిట్టిరి. ఇపు డే డవబ్రహ్మనాభినుండి పుట్టినవాఁడు. ఇతనికిప్పటికి నేఁబదియొకటవసంవత్స రమున మొదటిదినము నడచుచున్నది. ఒక్కొక్కనికి నూఱుసంవత్సర ములవంతున లెక్కవేసికొనిన నామానంబున 650 సం॥ లగును. ఏది యెట్లున్నను, ''సారస్వతోహృదయమునుండి సృష్టియుప్పొంగినది.'' అని మనకవి వెరుక వ్రాసిన వాక్యము సమంజసము. మఱియు సాహితీ విషయమం దెన్నోవిధములగు నుదాహరణములిచ్చి యున్నారు. "భావ మును కడుపున నిముడ్చుకొనిన భాషయే సాహిత్య"మని చెప్పియు న్నారు. దానికెన్నో ప్రమాణము లీప్రకరణమున సూచింపఁబడినవి.

"సారస్వతము—ముక్తిసాధనము" అనుప్రకరణమునఁ గవి తన విజ్ఞాన మంతయు వెదఁజల్లెను. కవి తల్లివంటివాఁడు. తల్లి తనబిడ్డకు జాబిల్లిపాటలు పాడి బువ్వ తినిపించినట్లు కవి విజ్ఞానడింభకులకు బోధించు టకు నెన్నేని వెరవులుపోయి. హృద్యములైన పద్యములు, అలంకార ములు, చిత్రకథలు చెప్పి మెప్పించును.

''సాహితీగోష్ఠి''—ఇందు సుకవికుకవులభేదము, భావకవుల భావ కవిత్వతత్త్వము, ఆదర్శగ్రంథములసృష్టి, గద్యపద్యకావ్యములసమప్రకా శము, కథావాఙ్మయప్రశంస, కావ్యసౌందర్యము, వ్యాసాది రచనము మొదలగు విషయములను గ్రంథకర్త హృదయంగమముగఁ జర్చించెను.

"శైలి'' అను ప్రకరణములో తన యభిప్రాయములు చక్కఁగ వ్యక్తీకరించును, గ్రామ్యగ్రాంథికవాదుల కలహమిట్టిదని వాకొనిరి;

భాషాచరణమున విభిన్న భావసంచలన మవసరమనియు, "శైలిభేదము ప్రకృతిభేదము ననుసరించియుండు"ననియు మొదలగు సంగతులు పేర్కొనఁబడి యనేకభాషల సారస్వతము తెలుపఁబడినది.

"భావనావేశము"—భావనవలన ఆవేశముబుకు ననుటకుఁ గొన్ని నిదర్శనములు చూపి, భావనావేశము కలవారికిఁగళలు పట్టపురాణులగునని పలికి, శిల్ప చిత్ర లేఖ నాములందును భావనావేశమున్నదని స్థిరపఱచి, భావనావేశము హృదయమహోహాదధియందుఁ బుట్టునది కాని మేధశ్శిఖరమునఁబుట్టునది కాదని కవిగారు స్పష్టపఱచిరి.

"భావనము— పరిశీలనము" అను ప్రకరణమందు సాహితికి జీవనము భావము. బ్రతుకు తెరువు పరిశీలనము. ఆనందామృతము భావనావీథియందుఁ బడయువచ్చునని చెప్పిరి. ఈసందర్భమున నెన్నో యుదాహరణములు యుక్తియుక్తములు గావింపఁబడినవి.

"మాతృభాష" అను ప్రకరణమున సాహితి కమరత్వమిచ్చునది సహజభావము. సహజమైన సాహిత్యము తల్లిమాటలయందే యవతరించియుండును గాని వేఱుమాటలయం దుండనేరదని చెప్పిరి.

"నేటి వాఙ్మయోద్యమము" — ఇందు ఆంధ్రభాషం గురించియు, నాంధ్ర పురుషులం గురించియు కొంత ముచ్చటించిరి. "విషాదయోగ మంతరించి, శంఖప్రకరణము గోచరించినంతన, కురుక్షేత్రవిజయమెంతో దూరమున నుండ"దనియు, "నేఁడు కురుక్షేత్రమైయున్న ఆంధ్రవాఙ్మయము అచిరములో ధర్మక్షేత్రము కాఁజాలకపో"దనియు వాకొనిరి.

"లలితకళలు—నవ్య కెరటాలు"—సృష్టి సాహితియందే కల దనియు, నవ్య సృష్టికి సొంపనియు, సుధయు, స్వర్గము, సౌందర్యము, కవితా సామ్రాజ్యమందును, కవిత్వసంపదలు గృహసామ్రాజ్యమందు నుండుననియు, అదియే భాగ్యలక్ష్మి యనియు, గృహలక్ష్మి యనియు, మనహృదయములందుమనము గుర్తింపఁజాలని యద్భుతశక్తు లెన్నియో కలవనియు చెప్పుచు లలితకలలనెల్ల విశదీకరించిరి.

" విమర్శనము—లలితకళాభ్యుదయము " అను నీప్రకరణ మున సాహితి కాయువు భావము. కవిభావ మొకప్పుడు తటిచ్ఛలము వలెఁ దళుకొత్తును. అది రసజ్ఞుని హృదయమునకే గోచరించును. సామాన్యునకు గోచరింపదు. నిశితబుద్ధి, విశాలహృదయము, భావ తత్త్వపరిశీలనము, శాస్త్రపరిజ్ఞానము సువిమర్శకునకు సొమ్ములైన గాని ముందంజ వేయుటకు సమర్థుఁడు కాఁడు. విమర్శనము మహత్తర మైనది. విమర్శకుఁడు తన కలమును విజ్ఞానమందుముంచి, విశాల దృష్టితో విషయపరిశీలనముచేయుట సమంజసము. ఇత్యాదు లెన్నో విధములఁ జెప్పఁబడినవి.

" నాట్యకళ—సంస్కరణము "—ఇందు నాటకములం గూర్చియు, నటకులంగూర్చియు, రచయితలంగూర్చియు, నాట్యకళం గూర్చియు ననేకవిధములం జెప్పి లలితకళలన్నిటికి నాటకమునఁ జోటు న్నది కావున వాని నెఱింగి గ్రంథకర్త ప్రపంచానుభవముఁ గలిగి, స్వర్గ నరకాదులఁ గనిపెట్టి, సంఘహృదయము హృదయంగమముగ నుంచు కొని, ప్రకృతినెఱింగి, నాటకరచనకుం గడంగవలయును. ప్రజల పురోభివృద్ధికి నాటకరచయిత తోడుపడినట్లు మఱియొక కళోపాస కుఁడు తోడ్పడలేఁడు. ఇత్యాదులచే నీవ్యాస మలంకరింపఁబడినది.

" నాటకరచనమున మేలుబంతి "— నాటకరచనమున నాంధ్రులు వెనుకఁబడి యున్నారనియు, నాటకరచనాకుశలులు

వంగాది భాషలందు ద్విజేంద్రాదులు పెక్కు రూడిరనియు లోనగు సంగతు లీ ప్రకరణమున నున్నవి.

ఇవి యన్నియు వ్యాసరూపములుగ నప్పుడప్పుడు పత్రికలలోఁ బ్రచురింపఁబడినవి. ఇప్పు డవి యన్నియుం గ్రంథరూపము గావింపఁ బడినవి. ఈ గ్రంథము 1938 సం॥ రము బి.ఏ., విద్వాన్ పరీక్షలకును, 1937 సం॥ రము బి.ఏ., ఆనర్సు, ఎం,ఏ. పరీక్షలకును పఠనీయముగా మదరాసు విశ్వవిద్యాలయము వారును, ఆంధ్రవిశ్వకళాపరిషత్తువారును నియమించిరి. ఇందలి విషయములన్నియు నతి గంభీరములు. భావగర్భిత ములు. నానావిధోదాహరణ సంకలితములు. నానావిధకథాకథితములు. నానావిధ భాషాభూషితములు. దీనినెల్ల విద్యార్థు లశ్రద్ధతో గురుముఖ మునుండి గ్రహించి, గ్రహణధారణాదులు గలిగి, మనోగతము చేసికొని కృతార్థులు కావలయును. ఉపాధ్యాయులో ఇతర గ్రంథములవలెఁ గాక పరిశీలించి దీనిఁ బాఠము చెప్పవలయును. అట్టి యుపాధ్యా యుఁడు సంస్కృతాంధ్రములే కాక, ఆంగ్లము, హిందీ, వంగము, పాళీ, కళింగము మున్నగు భాషలను, తత్త్వశాస్త్రమును నేర్చికొనియుండి నచో తన కర్తవ్యమును కడుంగడు చక్కఁగ నిర్వహింపఁగలఁడు. ఈ గ్రంథమును విద్యార్థులామూలాగ్రముగ చదివి మనోగతము చేసి కొనఁగలిగినచో, విశేష విజ్ఞానముకలవా రగుదురనుటకు సందేహము లేదు. గ్రంథకర్త మఱియు నిట్టి గ్రంథములు మఱికొన్ని రచించి లోకదారిద్ర్యముం బాపుదురుగాక యని కోరుచున్నాను. పరమేశ్వ రుఁడు వారి కాయురారోగ్యములు ప్రసాదించుఁగాక!

రాజమహేంద్రవరము, }
4—6—1936. }

శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి.

# పీ ఠి క

సాహిత్యతత్త్వవిచారణ మపారము, అనాహతము, అగాధము. సాహిత్య మవ్యక్తమునకు సువ్యక్తమైన పురుషార్థము. సాహిత్యము నిత్యమైనసచ్చిదానందానుభవమునకు, దేశకాలపాత్రవిలాసకల్పితమైన రసానందానుభవమునకు సాధనము. సాహిత్యరసానంద మువిశ్వధర్మము, విశ్వాధారము, విశ్వేశ్వరవిలాసము. పిపీలికాదిబ్రహ్మపర్యంతముగల జీవజాలము లాత్మానందానుభవమున కనవరతము విశ్వసాహిత్యోపాసనమును జేయుచున్నవి. సాహిత్యోపాసనమునకు సాధకసాధనములు వేరైనను సాధ్యము సమానము. సాహిత్యోపాసనమునందు భాషలు, భావములు, దేశములు, కాలములు, పాత్రలు, రసములు భిన్నములైనను ప్రయోజనముమాత్రము విశ్వాధారమైన రసానందము సమానము. సాహిత్యోపాసనమునకు సాధనములైన కర్మకళాయోగ శాస్త్రాద్యంగములందు సారస్వతము ప్రధానాంగము. అవ్యక్తమునకు ప్రథమవ్యక్తస్వరూపమైనశబ్దము సాహిత్యాంగములందు సారస్వతాంగమునకు ప్రధానస్థానమును గల్పించుచున్నది. అనంతమైన సాహిత్యతత్త్వవిచారము నొక చిన్న పుస్తకమునందు సంగ్రహించుటకు శ్రీయుత జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారుచేసిన ప్రయత్నము సకలజనాదరణమునకు పాత్రముగ నున్నది.

భారతీయసాహిత్యము వైదికయుగమునందువలెను వర్తమానకాలమునందును శాఖోపశాఖలుగను పరిణామమును పొందుచున్నవిధము సాహిత్యతత్త్వజ్ఞులవిచారాదరణములకు దగియున్నది. వైదికలౌకికసారస్వతములు భిన్నసాహిత్యరూపములను పురుషార్థమునకు

వినియోగపడగల విధమును ప్రాచ్య పాశ్చాత్యసాహిత్య పరిశోధనలును, ప్రాచీనాధునాతనసాహిత్యపరిశోధనలును బోధించుచున్నవి. జగన్మోహనమునకు ప్రకృతిపురుషుల సమాశ్రయము బీజము. పరమాణుపరబ్రహ్మముల లీలావిలాసములం దాత్మానందమునకు సాధనములను సరసముగను కల్పించుటకు సాహిత్యాచార్యులు సమర్థులు. సాహిత్యాచార్యులకు సంభావనాకల్పనలు ప్రతీచీసంస్కారసంజాతమైన ప్రవృత్తిపరమైనను, ప్రాచ్యసంస్కారసంభవమైన నివృత్తిపరమైనను పరమార్థ మాత్మానందానుభవము. అనిత్యములైన దేశకాల పాత్రావరణములందు నిత్యమైన సచ్చిదానందానుభవమును సాహిత్యము సాధ్యము చేయుచున్నది. యవన రోమక బ్రిటిషు భరతవర్షములు, వంగాంధ్రరాష్ట్రములు, త్రేతాద్వాపరకలియుగములు, సీతా సావిత్రి డెస్డిమోనాదులు, సీతారాములు, రాధామాధవులు, ఉమామహేశ్వరులు కాలమహాస్రవంతియందు రసతరంగములు. ప్రకృతిసంభవములైన దేశములు, యుగములు, భాషలు, భావములు, పాత్రలు, సంప్రదాయాచారశీలములు సాహిత్యోపాసకుల హస్తములందు రసానందమును గలుగజేయుచు పురుషార్థమునకు సాధనములగుచున్నవి.

సాహితీగోష్ఠి, శైలి :—సాహితీగోష్ఠి బ్రహ్మసంకల్పము వలెను బ్రహ్మాండవ్యాప్తము. మహాకవులు బ్రహ్మసంపన్నులు. బ్రహ్మసంపన్నులు సర్వత్ర కావ్యకళావిలాసములను సందర్శించుచు బ్రహ్మానందమును గలుగజేయగల విధమును కావ్యములు కవిత్వతత్త్వము వ్యక్తము చేయుచున్నవి. మానవసంకల్పమునకు బ్రహ్మత్వమువలెను సాహితీగోష్ఠికిని బ్రహ్మత్వము సాధ్యము. బ్రహ్మమయమైన ప్రకృతి రంగములందు సకల సాహిత్యకళావిలాసములందును బ్రహ్మానందము బ్రహ్మజ్ఞులకు సాధ్యము. బ్రహ్మానందమునకువలెను భావానందము నకును రసావరణనిర్ణయ మసాధ్యము. మహాకావ్యములవలెను భావ

కావ్యములును రసానందానుభవమునకు నియతసాధనములు. రసానందానుభవమునకు ప్రతిబంధకము సంకల్పముకాని భావము కాదు. దేశావృతమైన విషాదావస్థయందు కావ్యహృదయమునకు భావార్థనిర్ణయము నిరర్థకము. భావార్థపరిణామమునందు శైలియును సహజపరిణామమును పొందుచున్నది. ఆంధ్రసాహిత్యపరిణామమునందు భావశైలిపరిణామవిమర్శనము సాహిత్యోపాసకుల యాదరణపాత్రము గావలసినవిధమును శ్రీ సత్యనారాయణమూర్తిగారిభావములు విశదము చేయుచున్నవి.

"భావప్రకాశమునకు సముచితమైన భాష సాధనముకదా! భాషాగమనికకు వ్యాకరణసూత్రము లవసరములే. ఇవి కట్టుత్రాళ్లు కాక, పట్టుదారములట్లు మృదులములై, అనురాగసూత్రములట్లు అదృశ్యములై యుండవలెను. తెలుఁగక్షరములు ముత్తెములవంటివి. ముత్తెపుసరములోని దారము వెలుపలికి తోఁపనట్లు తెలుఁగులోని లక్షణసూత్రములు బట్టబయలుకానపుడే తెలుఁగుశైలి చక్కనిదై యుండును. పగ్గములను, ఉరిత్రాళ్లను తెలుఁగమ్మకంఠమునుండి పండితులు తొలఁగించుట పాడి. ఆంధ్రభాషాప్రపంచమున ద్వంద్వయుద్ధమునకు తొడరియున్న ఇరుపక్షములవారును తమదోషములు సవరించి ఉత్తమసారస్వతోద్దేశములకు తోడుపడుసూత్రములను శాసించుపట్ల నిరుపురు చేతులు కలుపుకొని, విశ్వవిద్యాలయముల సాహాయ్య మందవలెను. ఇట్లొనరించిరేని, ఎన్నో విబాధలు తొలఁగిపోవును. వాడుకమాట నంగీకరింపని విశ్వవిద్యాలయములును, వాడుకమాటలనే అంగీకరించు గ్రంథాలయములును, విఱుగుడుమాటలను త్రుంపుడుమాటలను కాంక్షించు భాషాసమితులును, వాడుకమాటలని చెప్పి వంకరమాటలను దెచ్చి సింహాసనముపైఁగూర్చుండఁబెట్టి చుట్టును రామభజనముచేయు అపూర్వభాషాభక్తులును పెడమొగములను పెట్టుకొనక, ఒకరిమొగములనొకరు పరికించుకొని, వెక్కిరింతలకును, పండ్లపటపటలకును, కారుమాటలకును, కన్నీళ్లకును స్వస్తి చెప్పి, సొమ్మసిల్లియున్న భాషాసతికి శాంతియు, నానందమును ప్రసాదించిరేని, దారితెన్ను లేక అల్లాడు పాఠకులును, విద్యార్థులును ధన్యు లగుదురు."

భావనావేశము:-సాహిత్యమునకు భావనాశక్తి కీలకము, హృదయము. పరమాణువునుండి పరబ్రహ్మమువరకును వ్యాప్తమైన విశ్వమునందు సాహిత్యోపాసకులకు దివ్యవిభూతులు సర్వకాలసర్వావస్థలందును ప్రస

న్నము లగుచున్నవి. శాంతశివసుందరవిలాసవిలసితమైన విశ్వము నందు సాహిత్యోపాసకులకు స్వీయభావనానురూపముగను దివ్యవిభూతులు గోచరంబగుచున్నవి. భావనాశక్తిప్రకృతివిలాసములకు షోడశ కళాన్యాసమును ప్రాణప్రతిష్ఠను కల్పించి విశ్వసాహిత్యస్వరూప మునను, ధర్మార్థకామమోక్షముల ననుగ్రహించుచున్నది. దైవాసుర యుద్ధము, క్షీరసాగరమథనము, హాలాహలామృతోద్భవములు, లక్ష్మీ సుదర్శనప్రభవములు, మోహినీవిలాసములు భావనాశక్తిఫలములైన సాహిత్యపరిణామములు. గౌరీశంకరకైలాసవిహారములు, రాధా మాధవబృందావనవిహారములు, గోపాలకృష్ణలీలలు, గోపాలనవిలాసములు, ఏసు బుద్ధ త్యాగవిలాసములు పరమార్థప్రదము లైన సాహిత్యేతిహాసముల పరిణామములు. సచ్చిదానందాత్మకమైన సాహిత్య పరిణామమున కాత్మపరిణామము ప్రమాణము. ఆత్మభావనాశక్తి విశ్వమునం దంతటను సత్యజ్ఞానానందమయమైన ఆత్మసందర్శనమును జేయుచు రసానందాత్మకములైన సాహిత్యకావ్యకళారూపమునను పురుషార్థపరిణామమును పొందుచున్నది. సాపేక్షమైన సాహిత్యరసానందానుభవము నిరపేక్షమైన ఆత్మానందానుభవమునం దైక్యమును పొందుచున్నది. సాహిత్యతత్త్వవిచార మీపరమార్థమును దృష్టాంత సిద్ధాంతరూపమునను విశదము చేయుచున్నది. సత్యనారాయణమూర్తి గారు 'భావనావేశము' 'భావనాపరిశీలనము' శీర్షికలక్రిందను జేసిన సాహిత్యతత్త్వమీమాంస విశాలమై సాహిత్యోపాసకుల సమాదరణీయముగ నున్నది. గ్రంథమునందలి యుదాత్తాశయము లీక్రిందివాక్యములు తెలుపుచున్నవి.

"కన్నున్నగాని శిల్పము నెరవేరదు, జీవమున్నగాని శిల్పము సార్థకముకాదు. ఈజీవమును ఆకన్నును భావనాపరిశీలనముల మేలుగీములు. అద్భుత సృష్టికిని, కళాపుష్టికిని, భావ్యదాశయతుష్టికిని సుధామయము, ఆనందమయము, ఆలోకమయము అనంత జీవనమునకు తలిదండ్రులైన భావనాపరిశీలనముల ప్రసన్నత చేకుఅట ఎట్టివారికి?"

మాతృభాష:- సాహిత్యమునకు సారస్వతము మకుటము. సాహిత్యాంగములైన లలితకళలు నృత్యగీతవాద్యాదులు సాహిత్యనిర్మాణవికాసములకు సాధనములైనను భావప్రకాశమునకు మూలాధారమైన భాష సాహిత్యతత్త్వమునకును, తత్త్వవిచారమునకును సాధనము. అవ్యక్తమైన ప్రణవనాదముతో నారంభమైనసాహిత్యము భావార్థకళాపరిణామమునను సువ్యక్తమగుచున్నది. అవ్యక్తమైన బ్రహ్మమునకు శబ్దము సువ్యక్తస్వరూపము. సాహిత్యమునకు కీలకమైన భావమునకు శబ్దమధురసుందరస్వరూపము. భావశబ్దార్థకళల యోగానుభవము సాహిత్యము. సారస్వతాభ్యుదయమునకు సహజమైన భావములువలెను సహజమైన భాషయును మూలాధారము. ప్రపంచమునందెచ్చటను సారస్వత తత్త్వవిచారమునందు హిందూస్థానమునందువలెను మాతృభాషాభిమానాక్రందనమును చేయవలసిన దురదృష్టము కనుపడదు. పారతంత్ర్యము ననుభవించెడి ప్రజలకు పరావలంబనమునందుగల యభిమానాదరణములు స్వావలంబన స్వయంసహాయములందు దుర్లభములు. శ్రీసత్యనారాయణమూర్తిగారీవిషయమై చేసిన విమర్శనము నాంధ్రభాషాభిమానులందరును గమనించుట వివేకము.

*వంగీయులహృదయశక్తిని, ద్రవిడుల మేధాశక్తిని మనయందిముడ్చుకొనియుండియు, మనలను మనము గుర్తించుకొనక స్వీయసముద్ధరణమును కాంక్షింపక, సాహిత్యవృద్ధి నందిరే జాతీయవృద్ధి గోచరించునని యెఱుఁగక ఆత్మవిస్మృతులమై పడియుంటిమి. మన భాషయో? ప్రాచ్యఇటాలియన్ అని ప్రసిద్ధివందిన భాష యయినది. అనేక శతాబ్దులకుమున్నే విజయనిశానముల నంబరవీథి నెగిరింపజాలిన భాష మనయది! సౌందర్యమాధుర్యములకు పెన్నిధానము కాఁజాలుదునని నిరూపించిన భాష మనయది! నేడు మూలఁబడియున్న భాషయు మనయదియే! ఏల? పగ్గములు చేతఁబుచ్చుకొని, సూత్రములు బిగించుకొని, భాషాసతిని విఱిచికట్టు పండిత ప్రకాండులే యుత్తర మీయవలెను. కాలానుసారమైన గమనికను జూపని భాషనుగుఱించి రవీంద్రుఁడనిన వాక్కు ఎల్లెడల వర్తించు సిద్ధాంతమేకద! రాతినగలందు నిలిచిన తెలుఁగు సర్వాంగ సుందరిరూపు ఎట్లు చూపట్టును? ఎట్లాంధ్రభాషాపోషణ ముందునకు జరుగును?

ఆంధ్రహృదయమందలి సహజశక్తి విజృంభింపవలెననిన, ఆంధ్రసాహిత్యము పునరుద్ధరణము నందవలెననిన, ఆంధ్రభాష స్వాతంత్ర్య మంది తీరవలెను. వంగసీమయందు వలెనే మనసీమయందును భాషావిప్లవము తలసూపవలెను. శతాబ్దులకుముందు శిలాగ్రంథములందు చెక్కఁబడిన లక్షణమాత్రములును, వ్యాకరణనియమములను నేటి కాగితములందు పునర్ముద్రణమందినంతనే తమరాతిరూపును, తమకటికిమనసును మాఱ్చుచేసికొనవా! భాషాస్రోతమునకు ఆనకట్టయగుటకై వ్యాకరణము నిర్మింపఁబడదు. అట్టిది నిలిచెనేని, దీనిని దెగఁగొట్టుటకు కాలవిలంబనము కారాదు."

మాతృభాష, వాడుకభాష, గ్రాంథికభాషల విషయమునను సాహిత్యగోష్ఠి, భావనావేశము నాటకలలితకళలవిషయమునను సత్యనారాయణమూర్తిగారుచేసిన విమర్శనలు సాహిత్య భాషా కళాభిమానుల యాదరణపాత్రములు. ఆంధ్రవాఙ్మయాభ్యుదయాభిమానులందరును శ్రీసత్యనారాయణమూర్తిగారు వారి సాహిత్యోపాసనానుభవ పూర్వకముగను రచించిన సాహిత్యతత్త్వవిచారము నాదరించి సాహిత్యోపాసనమును జేయుదురుగాత!

శ్రీ సత్యనారాయణమూర్తిగారాంగ్లాంధ్రవంగసారస్వతములందు పరిశ్రమచేసిన విద్యావంతులు, సాహిత్యోపాసకులు. సనాతనాధునాతనసారస్వతములును, ప్రాచ్యపాశ్చాత్యసారస్వతములును, సంస్కృతాంగ్లాంధ్ర సాహిత్యములును, ఆధ్యాత్మికాధిభౌతిక సాహిత్యములును ప్రకృతివిలసితములైన సత్య శివ సుందర విలాసములను మహాకవులు సంకల్పించి, సందర్శించి, వినిర్మించి రసానందమును గలుగ జేయుగలవిధమును పరిస్ఫుటము చేయుచున్నవి. వ్యాసవాల్మీకి కాళిదాసాది మహాకవుల కావ్యములవలెను, మిల్టన్, షేక్స్పియర్, హోమర్, డాంటె, గెటె, బైరన్ మొదలగు మహాకవుల కావ్యములును, శివాంత కావ్యములవలెను దుఃఖాంతకావ్యములును, మహాభారతమువలెను సామాన్యభావగీతములును, రసాత్మానందమునకు వినియోగపడిన వినియోగపడుచున్న విధమును శ్రీ సత్యనారాయణమూర్తిగారు గ్రంథము

నందు బాగుగ విమర్శించిరి. భారతీయసాహిత్యమునకు చతుర్విధపురుషార్థములందును నిత్యమైన మోక్షము పరమార్థమైన విధమునను, విశ్వసాహిత్యమునకును నిత్యమైన ఆత్మజ్ఞానానందము పరమార్థమైనవిధమును నవగతము చేయుటకు శ్రీ సత్యనారాయణమూర్తిగారు చేసిన ప్రయత్నము సాహిత్యమీమాంసకులకు విచారయోగ్యముగను నున్నది.

శ్రీధాతృ సం.
శ్రావణ శు. ౧౧ బుధవారము

కా. నాగేశ్వరరావు



# ఒకమాట

వివిధవిజ్ఞానాంశములను దృష్టి నిడికొని సమయసమయము లందు నేను వ్రాయుచువచ్చిన వ్యాసములు "ఆంధ్రపత్రిక", "భారతి", "ఉగాదిసంచిక", "ఉదయిని", "ఆంధ్రసాహిత్యపరిషత్ పత్రిక", "చంద్రిక", "నాట్యకళ", "గృహలక్ష్మి", "త్రిలిఙ్గ", "ప్రబుద్ధాంధ్ర", "హిందూసుందరి" మున్నగు పత్రికలందు వెలువడినవి. వీనిలో సాహిత్య తత్త్వ విమర్శనమునకు సంబంధించినవి చాల కలవు. నాకు మిగులఁగూరుచు సాహితీసీమంతినిని నారాధించుతఱి నామనసున తలసూపిన ఈతలఁపులు సహృదయుల చిత్తముల నాకర్షించినవి. వీరి ప్రోత్సాహము నూఁతకోలఁ జేసికొని కొన్నిటి నిపుడు క్రోడీకరించితిని. ఇది తొలి సంపుటము మాత్రమే. ఇట్టి గ్రంథముల నెన్నో ఆంధ్రభారతి కప్పన మొనరించుట నాయాశయము. ఆతల్లి కవెట్టియుడుగరలగునో!

జగద్విఖ్యాతి నందిన మహావిజ్ఞాని రాధాకృష్ణుఁడును, సాహిత్యావధూటి కనుంగుబిడ్డయైన యశస్తిలకుఁడు కట్టమంచిమనీషియును, అర్ధశతాబ్దినుండి ఆంధ్రసారస్వత సేవసలుపుచు వాసిఁగాంచి, కళాప్రపూర్ణ బిరుదమునందిన కవిసార్వభౌముఁడును, ఆంధ్ర మహాపురుషులలో నొక్కఁడై, భారతాంబను సేవించునట్లే భారతీదేవిని గొలుచు దేశోద్ధారకుఁడును నాగ్రంథమునకు తొలిపలుకులఁ వ్రాసి నాకెంతేని ఆనందమును గలిగించిరి. ఆంధ్రవిశ్వకళా పరిషత్తువారును, చెన్నపురి విశ్వవిద్యాలయాధికారులును దీని నున్నతపరీక్షలకు పఠనీయగ్రంథముఁ గావించిరి. పలువురు కవులును, పండితులును, పత్రికాధిపతు

లును, సంపాదకులును, విమర్శకులును దీనిపై శుభాశీతలు చల్లిరి సాహిత్య సమ్రాట్టులు శ్రీ జయపురాధీశులు దీని కృతినందిరి. ఎట్టి సాహితీవల్లికైనను మాఱాకుహత్తించునది సుహృద్భావమే కదా! కొదువసూపక దీనిని నాకు ప్రసాదించిన ఈ మహనీయుల్లకు కృతజ్ఞతాపూర్వకముగ నంజలిఘటించుచున్నాను. దీని సత్వరముద్రణమున నాకు చేదోడైన మిత్రులు విద్వాన్ తిరుమల వెంకట రంగాచార్యులుగారికిని, తమ పత్రికలనుండి తీసి నావ్యాసముల నీ తీఱున గ్రంథస్థమొనరించుటకు నన్ను ప్రోత్సహించిన సంపాదకమహాశయులకును కృతజ్ఞుఁడను.

చెన్నపురి,

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి.

# 1. సాహితీహృది

సారస్వతము సనాతన మైనది. సృష్ట్యాదిని నిరూపించు నట్లో దీని పుట్టువును నిరూపించుటయు నట్టిదియే. సుమారు రారు వేలేండ్ల వయసు గలదని సృష్టికి క్రైస్తవులు జాతకము చెప్పుదురు. వీరి సృష్టి యూహావలెనే వీరి సారస్వతమును చిరుతప్రాయము కలది. హిందువులపట్ల సనాతనధర్మ మెట్టిదో, హైందవ సారస్వతమును నట్టిదే. సృష్టిసారస్వతములను వేఱుచేయుట దుడుకుదనమును చూపుట. పాలవెల్లిపైఁ దేలియాడు సారస్వతహృదయమునుండి సృష్టి ఉప్పొంగినది. సృష్టి కసిన చిత్రము సారస్వతము. సాహితి లేనిసృష్టి దుమూహ్యము. సృష్టిలేని సాహితి సాహితియే కాదు.

సృష్టి సాహిత్యములు భావమయములు. భావమునకు భాష అవసరమట్లు సాహితీవ్యక్తీకరణమునకు మనుష్యజీవన మవసరము. సారస్వతము సృష్టియందే పుట్టినను, మనుష్యజీవనమున ప్రస్ఫుటించినది. వృంతముపై తోఁచుచున్నను, గులాబిపూవు వృంతముపైఁ బుట్ట లేదు. ప్రతిశాఖనుండియు గులాబి పుట్టునా? కరువుగొట్టు కొమ్మలును, గొడ్డాళ్లవంటి మ్రోడులును ఎన్ని లేవు? కొమ్మలోఁగల సుగంధమును, కొమ్మలోఁగల సౌందర్యమును భావసుధతోఁ దోలుకాడు పుష్పాధరమునుండి చిరునవ్వులై రాలి సాహితీహృదికి ముదముఁ గూర్పవా? ఎపుడో సృష్టిచిత్రములందు బుడుంగున మునింగియుండిన సారస్వతము మానవజీవనమున మధురదళములతో తలయెత్తి సుగంధబంధుర భావమును వసుమతీవాతూలమున విరఁజిమ్మును.

సృష్టికి మనుష్యజీవన మవసరము. మనుష్యజీవనమునకు సృష్టి అవసరము. బాహ్యావనికి అంతరంగ మావశ్యకము. అంతరంగావనికి బాహ్యభూమి అక్కఱలేనది. అవ్వలిపుడమి లేకున్న నవ్వలి నేలకు దిక్కేది? అవ్వలియవనిగాక, అద్భుతమగు కొంజాకశక్తి అంతస్సలిలమైన సరస్వతియట్లు అంతరంగమునం దుబికి సామాన్యుల నసామాన్యులఁ జేయునని తత్త్వశాస్త్రము తెలుపుచున్నది. అనవరతానుభవమున నీశక్తి (Intuition) అంతగా విజృంభింపదు. బాహ్యావనిసంపర్కము మూలముననే జ్ఞానసముపార్జనము సాధ్యమగు నని చెప్పుచువచ్చిన లాకే (Locke) యను పాశ్చాత్యతత్త్వవేదియే ఈ శక్తినిగుఱించి యిట్లు తెలిపెను:

"I say then, that we have the knowledge of our own existence by intuition, of the existence of God by demonstration, and of other things by sensation. Experience then convinces us that we have an intuitive knowledge of our own existence, and an internal, infalliable perception that 'we are.' In every act of sensation, reasoning or thinking we are conscious to ourselves of our own being, and in this matter, came not short of the highest degree of certainty........yet God having furnished us with these faculties our minds are endowed with, He has not left Himself without witness."

Green's resolution of the whole universe into an eternal intelligent conscious cosmos with man and his consciousness having an organic place in that cosmos and Kant's categories of understanding argue the existence of this ability in man.

అంతరంగమునందు అద్భుతముల నల్లు శక్తి యొకటి ఉన్నదని అందఱు ఎఱుఁగరు. ఎఱుఁగనివారిపట్ల—గుర్తింపనివారిపట్ల నిది

ప్రసన్న కాదు. అంతరంగరత్నాకరము నెఱుఁగక వీరి మనసు బాహ్యా వనికే కన్నుల నప్పన మొనరించును. కావున జ్ఞానసంపాదనకై వీరు కేవలము బాహ్యావనిపై నాధారపడుదురు. అవ్వలిలోకమే సృష్టి యని వీరు అనారతము యోజింతురు.

సృష్టియందలి సారస్వతము తల్లిరొమ్మునందలి మధుర దుగ్ధమువంటిది. తాను పుడుకు అనురాగమున నేమున్నదో పసిపాప యెఱుఁగదు.—తాను క్రోలునదేమో కనులఁ జూడదు. కాని, తన ప్రస్తుతభావిజీవనములను, తనభాగ్యోదయమును పసినిసుఁగు జనని యంతరంగమునుండి అల్లనల్లన క్రోలుటలేదా? సృష్టియందలి సారస్వతమును కవిడింభకుఁడు అట్లే క్రోలి మురియును. సాహితిఁ గ్రోలని కవి,—కవిగాని కవి నీరసవాక్కుల నుచ్చరించి (శరీర మందు రక్తమాంసముల నింపుచున్నను) చావుబ్రతుకులందు పోర లాడుచుండును.

పుస్తకములు పుట్టినది నిన్న.—అచ్చుయంత్రములు తోఁచినది నిన్న.—సృష్టి ఎన్నఁడో ఎవ్వరును నిరూపింపఁ జాలనికాలమున జగదీశుని మనసునుండి ఉబికినది.—నాఁటగోలె సారస్వతము తోఁచు చుండె ననుట అత్యుక్తికాదా యని కొందఱు సంశయంపడవచ్చును. యంత్రములు సారస్వతము కావు. అక్కరములు సాహిత్యము కావు. గుర్తులును, గుంజలును సారస్వత మగుచో, అక్షరమయములై తోఁచునోడలును, గొంసులును సారస్వతపంక్తు లనవలెను. భావము సారస్వతము—భావమును కడుపున నిముడ్చుకొనిన భాష సారస్వతము. కొందఱు పాశ్చాత్యులు భాషకు జే! జే!!

"The thought that sustains a book is but a small part of the book; a thought is but a common property.

but the words belong to the writer, and he cannot be dispossessed of his verbal beauty anymore than a sculptor and a painter can be robbed of their surfaces"—George Moore.

అనినను, భారతీయులు భావమునకే తొలిజోహారు సమర్పించిరి.

భావమే సారస్వత మనుట శరీరమే మనుజుఁ డనుట. 'నేను' అనునది కనులకు తోఁపకయే సృష్టియందు పరిభ్రమణ మొనరించుచున్నది. సారస్వతమునకు భావ రక్తమాంసముల గ్రథనమై యొప్పుచున్నది. "Style is the man" అని Newman ను, 'Style is psychological' అని Dequincey యును అనినపుడు మాటల ప్రోగును, వట్టిసొదెయు సాహిత్య మని ఊహించిరా? "Man" అనిన పైకి తోఁచు విగ్రహమా? "Psychological change" (ఆంతరంగిక పరివర్తనము) ప్రపంచహృదయమున అనివార్యమై యున్నదని ఇటీవల రాధాకృష్ణుఁడు జినీవాలో పెడబొబ్బ పెట్టినపుడును, "Inward renewal" అని (Vide: Hindu Thought and Christian Doctrine by Sir S. Radhakrishnan) విపులవిమర్శగావించినపుడును ఈతఁడు దృష్టియందిడికొనినది మనుష్యహృదయము కాదా? మనుష్యహృదయమందును, సృష్టిహృదయమందును, సారస్వతహృదయమందును వ్యత్యాసములును, పొరపొచ్చెములును ఉన్నవని మాటలు మిగులువా రెవరు ? షేక్స్పియరు ప్రకృతి కెదురుగ ముకురము నుంచెనని (' Shakespeare held up the mirror to Nature") విమర్శకు లందురు. ఇందు పేర్కొనఁబడిన దర్పణము అతని రచనయా, అతని మనసా, లేక అతఁడు చెరిగిపోసిన మాటల ప్రోగా? షేక్స్పియరు తెలిపిన ప్రకృతి షేక్స్పియరులో ప్రవే

శించినది. ప్రకృతియందు తీక్ష్ణలక్ష్యముంచిన షేక్స్పియరు ప్రకృతిలో ప్రవేశించినాఁడు. కవిసుందరుని హృదయమందు నిజసామ్రాజ్యమును పొడగాంచిన ప్రకృతిసీమంతిని అందుఁ బ్రవేశించెను. ప్రకృతికిని, షేక్స్పియరునకును అవినాభావసంబంధము చేకుఱుటకు కారణ మేమని ఊహింపనలయునా?

సృష్టిహృదయము బాహ్యసృష్టిలో నేగాక షేక్స్పియరుసృష్టి యందును, సృష్టియందునుగూడ కలదు. కవిని కవిబ్రహ్మయనుట వట్టి వాడుకమాటయా? భావ మెఱిఁగినపుడే భాష నెఱిఁగి, భాష నెఱిఁగినపుడే భావమందు ధ్యానముంచి, భాషాభావముల కలయిక జీవాత్మపరమాత్మల కలయికను పోలినదని యెఱిఁగి, కలమునుపూని నాఁడు కావున షేక్స్పియరురచనలు మహాద్భుత సృష్టిచిత్రములై క్రొత్తయు ప్రాఁతయు నెఱుఁగక శతాబ్దుల జోహారుల నందుచున్నవి. భావ మెఱిఁగియు భాష యెఱుఁగని మహాపురుషులు పరమహంసలై, తన్మయానందమున మునిఁగి తమ్ముఁ గుర్తింపఁ జాలు వివేకము గల వారి హృదయములందుఁ జొచ్చి ఆనందపూరితములైన వారి వాక్కు లనుండి వసుంధరయందు పునరవతార మందుదురు. పరమహంస మహత్త్వమును ప్రపంచమునకు తెలిపినది వివేకానందుని వాక్కని యెఱుఁగనివా రెవ్వరున్నారు?

వ్రాయను, చదువను ఎఱుఁగనపుడుకూడ అంతరంగమున సారస్వత ముప్పొంగినవేళలందు మానవుఁడు పరమానంద మందు వాఁడు. ఉదయభానుని చూచినపుడును, చంద్రికాపూరమునకు కనుల నొడ్డినపుడును, ఉత్తాలతరంగముల నుప్పొంగఁజిమ్ము జలధిని జేరి నపుడును, కుధరశిఖరముపై చూపులను రువ్వినపుడును, నక్షత్రఖచిత

నభమును అల్లన కనుకొలఁకులనుండి అంతరంగములోనికి లాగికొనిన పుడును, కోయిలకంఠమును చెవిఁజొనిపినపుడును, సుగంధమందుప్పొంగు పోయిని మనసార జుఱ్ఱినపుడును, ఏయక్కరము తెలియఁగని ఈతఁడు పరమపరితోషమున గంతులిడువాఁడు. ఈతని అంగప్రత్యంగములందు గణయతులు విరఁబోసి, ఈతనిహావభావములందు గీతికాకళలు వడబోసి, ఈతనిని హృద్యమైన పద్యమును జేసి, భావవాతూలమున నీపద్యమును నటరాజుగావించినశక్తి సారస్వతశక్తిగాక మఱేశక్తి? "శాకుంతలము"ను చదివి గెటేకవి (Goethe) తన్ను తాను మఱచి గంతులు వేసినాఁడఁట. గెటేగంతులో కాళిదాసున్నాఁడు. కాళిదాసు హృదయమందును, గెటేహృదయమందును, కాళిదాసు రచనయందును, గెటేనృత్యమందును దివ్యదీప్తులను వెడలించిన అద్భుతవిద్యుచ్ఛక్తి సారస్వతశక్తిగాక మఱేశక్తి? విద్యుత్తమునకు ఆలోకశక్తియు, చలనశక్తియుఁగూడ కలవని నేఁ డెవ రెఱుఁగరు? చెండువలె గెటేను ఆడించిన సారస్వతశక్తి ఈశక్తికి తీసిపోదని సారస్వతమును గుర్తించినవా రెఱుఁగుదురు. అక్షరజ్ఞాన మెఱుఁగని అడవిజాతివాని నృత్యపంక్తిపై నుఱ్ఱూఁత లూఁగించినదియు సారస్వతశక్తియనియే నొక్కి చెప్పుదును. గెటేకవిని చెండునుచేసినశక్తియే ఈ యడవిమానిసిని కందుకముచేసినశక్తియని ఒకమాఱుకాదు, పలుమాఱు తెలుపుదును. రెండు తెఱఁగులవా రట్లు చూపట్టినను, వీ రొక్కే తెఱఁగు వ్యక్తులు. కాలపథమున వేర్వేరు చోటులందు తోఁచి, వేర్వేరు రీతుల వీరు తమభావమును వ్యక్తీకరించిరి. అక్షరము తెలియఁగని అడవిజాతి కవియే, కాలక్రమమున అక్షరము తెలిసిఁగిన గెటే ఆయెనని ఋజువు చేయఁగలను. అద్భుతమైన ఆంగ్ల సారస్వతము ఏయూట నుండిఉబికినది? వెయిడ్ మన్, సైనెవ్రల్ ఫ్ల గుండెలం దుప్పొంగిన ఊటనుండికాదా?

ఈ యిరువురును చదువుసంధ్య లెఱుఁగని గొల్లలని ఆంగ్లసారస్వత
విద్యార్థు లెఱుఁగకపోరు. సహజసాహిత్యశక్తిగలవారు ఏ యే యుగ
ములందు, ఏయే దేశములందు పుట్టిననేమి ఒకే ఊయెలయం
దూఁగు బుడుతలు. అవతారపూరుషులకైన అవసానదశ యున్నదిగాని
ఈబుడుతలకు లేదు. కావుననే కృష్ణపరమాత్మకూడ ఒక సారస్వతా
చార్యునకు మ్రొక్కి, అతని కూఁడిగము చేసినాఁడు.

సారస్వతాచార్యుఁడనఁ బుస్తకములను దిగమ్రింగి, వడవడ
వాగువాఁడు కాఁడు. కృతయుగమున విజ్ఞానఖనియై వఱలిన దక్షిణా
మూర్తి పెదవులుమెదల్పక సనకాదులకు పాఠములు చెప్పువాఁడఁట.
సారస్వతశక్తిని హృదయమందు గూడియించుకొనినవాఁ డేరీతినైన
దానిని వ్యక్తీకరింపఁగలఁడు. ఈశక్తిని హృదయమందుఁ గలవాఁడే
అవ్వలఁ గల నిట్టిశక్తిని గుర్తింపఁగలఁడు. నృత్య మొనరించినది రాయి
గాని, రప్పగాని కాక కొండొక మానవుఁడగుటకు కారణము అతని
హృది సాహితీహృదియై అవ్వలి దృశ్యములందును, అవ్వలను, అంత
టనుగల కవిహృదయమందును తనకనురక్తమైన శక్తిని కాంచుటని
సాహిత్యతత్త్వవిశారదులకు తెలుపనక్కఱలేదు. నల్లరాళ్లుగాక
చంద్రకాంతశిలలు వెన్నెలకు కరఁగనేల? సవితృపాదములు సోఁకినంతన,
అచేతనమైనదట్లు తోఁచు అర్కకాంతము (భర్తృహరి 'సుభాషితము'
చూడుఁడు) ఆనందబాష్పమై స్రవించు నేల? సరోజమును చూచినంతన
మాలకాకికాక షట్పదము మధురఝంకృతిసలుపుచు కుసుమాధ
రమున ఆత్మవిస్మృతి నందు నేల? చెఱకుతీపిని మనుజుఁ డెఱిఁగినట్లు
పశువు గుర్తింపఁజాలదేమి? గానమందలి తేనియను గాయకుఁడేగాని
గార్ధభ మేల గుర్తింపకున్నది? మహాపురుషుని మహత్త్వమును అధ
మాధముఁడుగాక మఱొక మహాపురుషుఁడే గుర్తింపఁజాలు నేల? తాను

గాని ఒరుని తానెట్లుగుర్తింపఁజాలును? తనయందు లేనిశక్తిని ఎంత తన్ను కొన్నను, మానవుఁడన్యులందుఁగాని, ఆవలిజగతియందుఁగాని కనుగొనఁ గలుగునా? 'విద్' (భేదించుట) ధాతువునుండి పుట్టిన 'విద్య' (Education : E = Out, Ducere = To draw) అంతరంగమందలి శక్తిని విజృంభింపఁజేయు నవకాశ మొసఁగునదనికదా మన మెఱుఁగుదుము. ఈ శక్తిని చుట్టుముట్టిన మాలిన్యమును హరించునాచార్యుఁడు గీతాచార్యుఁడు కాఁడా? ఈ గీతాచార్యుఁడే నవనీతచోరుఁడు. నవనీత మనఁ గ్రొత్తగఁ జేరినదనియు, చోరుఁడన దానిని హరించునాతఁడనియు విజ్ఞాను లెఱుఁగుదురు. కావుననే ఉపనిషచ్ఛిఖరములనుండి ఋషు లీశ్వరుని చోరశిఖామణి యని కీర్తించిరి. ఆత్మశక్తి యుండుటకంటె ఆశక్తి ఉన్నదని గుర్తించుట మెచ్చఁదగిన విషయమేమో! తన్ను తాను గుర్తింపని మానవుఁడు ఎంత ప్రజ్ఞాధురీణుఁడైనను పనికిమాలిన బ్రదుకునే ఈడ్చుచుండును. ఆత్మశక్తిని గుర్తించుటను వలయు శిక్షణ మును ప్రాచీన విజ్ఞానులు తమంతఁ దాము పడయుచుండువారు. ఆత్మ శక్తి అంతరంగమందు విరజిల్లునదిగాని, అవ్వలినుండి దిగుమతియగు సరుకుకాదు. ప్రతిమను చెక్కునాతఁడు అవ్వలినుండి బొమ్మను గొని తెచ్చునా? బొమ్మనంటిన ఱాతిముక్కలను తీసివేయుటేకదా లోఁగల ప్రతిమను చూపుట. అంతరంగమున లేని విగ్రహము, అంతరంగమం దుండని శక్తి అవ్వలనుండి వచ్చునా? ఱాతినుండిగాక ఇసుకతిప్ప నుండిగాని, నీటిగుంటనుండిగాని ఎన్నఁడైన,ఎవ్వఁడైన ప్రతిమనుచేయఁ గలిగెనా? లోపలలేనిశక్తి తెచ్చిపెట్టుకొన్న రాదు. అంతరంగమందలి విగ్రహమును గుర్తించుటకే సగుణోపాసకుఁడు బాహ్యప్రతిమ నారా ధించును. అంతరంగమున సారస్వతము లేకున్న యెడల సృష్టియందలి సారస్వతమును, నిజజీవనమందు నిహితమైన కొండొకశక్తి లేకు

న్న చో అవ్వాలి జీవనమందలి శక్తిని మానవుఁడెట్లు గుర్తింపఁగలఁడు? ఆత్మశక్తిని గుర్తించినమానవుఁడు అన్యులందు పెంపారుశక్తినిగూడ నవలీలగ గుర్తింపఁగలఁడు. ఆంతరంగికపరిశీలనము (Introspection) నందు ఆఱితేఱినవ్యక్తి బాహ్యపరీక్షయందును సిద్ధహస్తుఁడగునని మనశ్శాస్త్రపరిజ్ఞాత లెఱుఁగుదురు. ఆత్మశక్తి ప్రస్ఫుటితమగుటకు కాలము పట్టినను పట్టును. ఒకనిహృదయమం దిది నిదురవోవుతఱి తమఃపీడితునివడువున నతఁడు పడియుండును. కాని, చెకుముకి వంటి తరుణము తాఁకినంతనే లోఁగలశక్తి నెరసులు విరఁజిమ్మి తమమును తఱిమి, కనులకు మిరుమిట్లు గొలుపును.

ఈ తరుణము ప్రియురాలివంటి దనినను అనవచ్చును. ప్రియురాలి స్పర్శయందలి భావమును, ప్రియుని అంతరంగమందలి భావమును నొక్కటికావుననే ఒకభావముయొక్క తాఁకుడున వేఱొక భావము తలయెత్తి పరస్పరసంశ్లేషముచే స్వర్గసుఖమునకు సిగ్గును, ఈసును గొలుపును. దిగ్వలయము వారాశిహృదయమును చుంబించు ననియు, దినకరుఁడు వసుంధరను కవుంగలించుకొను ననియు, పృథ్వియంతయు అనురాగమయమనియు షెల్లీకవీంద్రుఁడు (Vide "Love's Philosophy) పల్కుటకును, షెల్లీభావమును మానసికహృదయమున చొప్పించిన వంగకవి ద్విజేంద్రుఁడు ('మిాివారుపతనము' చూడుఁడు) అనురాగ మన్నియెడలందు నుండెనని వచించుటకును కారణము ఒకేతీఱు అదృశ్యభావప్రవంతి సృష్టియందును, వివిధప్రాణులందును, వివిధవ్యక్తులందును విరాజిల్లుటేకదా! ఒకే శక్తిసంపన్నములై యుండుటచేతనేకదా సృష్టియు, సారస్వతమును, మానవహృదయమును ఆదినుండియు సైదోడులట్లు ప్రవర్తించుచున్నవి! కళయు, ప్రకృతియు అక్కచెల్లెండ్రట్లు వెలయుచున్నవి! మనుష్యజీవనమును,

కళయు కవలలట్లు పెంపారుచున్నవి! సుప్రసిద్ధఫ్రెంచిగ్రంథకర్త ప్రౌస్ట్ ఏమనినాఁడో గమనింపుఁడు.

"It is impossible to understand nature otherwise than through the great artists......Life without art is nothing but time lost" (Vide: *Proust's Temps retrouve'*)

భారతసారస్వతముయొక్క తొలియక్షరము సూర్యతేజమందును, మలియక్షరము శశికాంతియందును, భారతవిజ్ఞానపంక్తులు కాసారమందును, సెలయేళ్ళయందును, పుష్పచయమందును, మందమారుతమందును మాత్రమే లేవు. నిన్నఁగాక మొన్నఁబుట్టిన ఆంగ్లసాహిత్యము తనజీవకళలను ప్రకృతినుండి కైకొనియెను. షేక్స్పియరు చదివినది ప్రకృతిపుస్తకమునుండియే.

"......Tongues in trees, books in the running brooks,
Sermons in stones and good in everything"

*As You Like It*, Act II, Scene 1

భారతసారస్వతమో, ప్రకృతి బృందావనమున మధురగీతికలనాలాపించినను, ఓం (అ+ఉ+మ్) కారమునుండియే తీయని తొలిసంగతి నందికొనినది. ప్రణవమందుఁ బుట్టినవేదముల విజ్ఞానప్రభ రవికైనను లేదు. నిగమములు నాలుగును స్వర్గమర్త్యములనంటి నిలచిన నాలుగు అద్భుతదేవాలయములు! కీనియందుండి ప్రతిధ్వనించు భావగాంభీర్యము మహోదధిగాంభీర్యమును లజ్జావనతవదనగావించును! వీనియందలి యద్భుతశక్తి శతాబ్దులచేతను, సహస్రాబ్దులచేతను జోహారులందినది. ఆమ్నాయములనుండియు, శ్రుతులనుండియు, స్మృతులనుండియు మీఁగడతఱకయై తేలిన భగవద్గీత నించుక చదివి

చూచి, కార్లైల్ ఎమర్సనులు తమరచనలందు తత్త్వబోధను గురిపించిరి. వ్రాతకోతలు దేవుఁడెఱుఁగును. వ్రాతలును, ముద్రణాయంత్రములును పుట్టకమునుపే వేదసూక్తులు మనుష్యకంఠములనుండి ప్రతిధ్వనింపఁ దొడఁగెను. ప్రాచీనభారతీయులు తమ మేధస్సులను తమకంఠములందే ఇముడ్చుకొనఁగలిగిరి. అదృశ్యములైన గ్రంథభాండాగారములు నాల్కనుండి నాలుకమీఁదికి దిగుచు, భారతవిజ్ఞానమునకు అపూర్వమైన ప్రచార మొసఁగినవి. అందుచే భారతసారస్వతము సనాతనధర్మసంబద్ధమై తనరియున్నది. వేదమందలి కవితాసౌందర్య మెందున్నది? ఋగ్వేదమందు రత్నసింహాసనవర్ణనము కలదు. రతనమును, కనకమును ప్రాచీనభారతీయుల యార్థికోన్నతిని తెలుపును. ఆర్థికోన్నతి అట్లుండ సారస్వతపట్టమహిషి కివి దివ్యాసనమైనవి! విభిన్నవస్తువుల నొక్కెడఁ జేరిచి మురియునది అలంకారము (Antithesis). హఱుడికిరతనముచుచేర్చిన భాషాభూషయందు అనంతమైన అర్థమున్నది. ప్రాచీనవిజ్ఞానశిఖరము నధిష్ఠింపఁజాలక పోయినను, దవ్వులనుండి దాని భావచ్ఛటలను విలోకించు కవికుమారులు భక్తిపూరితహృదయులై చేతులు జోడించుచున్నారు.

మనుష్యజీవనమందలి మిఱ్ఱుపల్లములును, సృష్టియందలి నవ్వుకిన్కలును (సృష్టియు, సారస్వతమును, మనుష్యజీవనమును పరస్పరసంబద్ధములై యుండును గావున) సారస్వతమునఁ దోలుకాడును. మహాకవుల కలములనుండి ఇట్టిసారస్వతము జాలువారుచుండును.

మనుష్యజీవనమందలి ఎగుడులును దిగుడులును, పొగలును సెగలును సారస్వతమును వీడిపోలేదు. సుఖమునకు దుఃఖము ప్రధాన సోపానమనియు, ఆనందమునకు ఆర్తి అవసరమనియు, ఉత్తమజీవనము

నకు నికృష్టానుభవ మనివార్యమనియు ప్రతియుగమందును మనుష్య జీవనము వక్కాణించుచున్నది. కన్నీటియందును, దురంత సంతాపమందును, హాహాకారములందును, దుస్సహావమానమందును మహత్తరాశయములును, మహాపురుషులును ఉద్భవించిరి. మహత్తరాశయములను, మహాపురుషులను నొక్కఁడుచేసి, తనయం దైక్యమొనరించుకొను మహితశక్తి సారస్వతము. సత్యనిష్ఠ మనుష్యజీవనమున కెంత యావశ్యకమో సాహిత్యమునకును నంతయావశ్యకమే. సత్యము పూలచెండుమాత్రమేకాక, అగ్నికణమనికూడ జీవనతత్త్వమును, సారస్వతతత్త్వమును గ్రహించినవా రెఱుఁగుదురు. సాహిత్యప్రపంచమున సత్యమెట్లు సంచరించినదో పరిశీలించుట మన ప్రస్తుతకర్తవ్యము.

జీవనమందలి సంఘటనములు సాధారణముగ మనుజుఁడు కాంక్షించునట్లుండవు. సత్యము వాకొనుట సారస్వతముయొక్క కర్తవ్యమని కొందఱు కవులు తలఁతురు. పరిస్థితులెట్లు పరిణమించుచున్నను, ఎట్లో యట్లు వాని నానందకూలమునఁ జేర్చుట తగు నని మఱికొందఱు కవు లూహింతురు. ఒరులు వలవల యేడ్చినను నేడ్చెదరుగాక, ప్రత్యక్షప్రపంచమున జరుగు దురంత సంఘటనములను ప్రజలకను లెదుటఁ బెట్టుట కఠినకార్యమయ్యు, కానిపనిగాక పునరుద్ధరణమునకు అనివార్యమైన కర్తవ్యమని తొలివర్గమువారు తలఁతురు. కట్టకడపు నిడుములకు లోకుల పురాడ్కులను సాధించినను, సేగులకు చేకూరెడిది విజయముగాక విధ్వంసమని చెప్పివేసి రెండవతెగవారు తృప్తిగాంచెదరు. పాశ్చాత్య సాహిత్యమందు తొలియుద్దేశమున కెక్కుడు ఆదరము కలదు. పూర్వసారస్వతము రెండవ యభిప్రాయమును విశేషముగ నాదరించుచున్నది. వేఱువేఱైన యీయుద్దేశములకు చోటొసఁగినవి వేఱువేఱు మతములు. మనుష్య ప్రవృత్తి

పాపము దెస సాగునని క్రైస్తవుల యభిప్రాయము. పాపమున కందని మనుజుండుండడనియు, ఏసుకరుణ నందకున్న మానవునకు గతిలేద నియు పాశ్చాత్యు లందురు. మానవుని చిత్తవృత్తులు కలుషము నాసింప వనియు, సచ్చిదానందములు సదా మనుష్యహృదయమున దివ్య మరీచులను చిమ్ముచుండుననియు, దుశ్చింతలు హృదయమందుఁగూడు కొనినను, అవి యం దిల్లుగట్టుకొని యుండవనియు సనాతన ధర్మ మును, హైందవ సారస్వతమును తెలుపుచున్నవి. ఈ రెండురీతుల మతవిశ్వాసములును రెండు తరంగిణులట్లు ప్రాచీ ప్రతీచీ సారస్వత ములందు గోచరించు చున్నవి. దుర్యోధనుఁడు దుర్మతియని భారతము వాకొనుచున్నది. అయినను, అతఁ డంతరాత్మ లేనివాఁడని భారతము తెలుపుటలేదు. ఎట్టి కట్టిడియైనను, తాఁజేయు క్రియయంతయు దైవ ప్రేరితమనియు, విష్ణువునుద్దేశమునకు తాను నిమిత్తమాత్రుఁ డాయె ననియు ఆతఁడు గుర్తించినట్లు మహాభారతమే తెలుపుచున్నది.

"అతఁడు (శ్రీకృష్ణుఁడు) పూజనీయుఁడగు నే నెఱుంగుదు ;
నైనధనము వీఁగి ననదతనము,
నచ్చుఁ బెచ్చువెఱిఁగి వైరులు గర్వింతు
రేల పగయడంగు నిట్టులైన?"

"వినుఁడు మహానుభావుఁడగు విష్ణునిచిత్త మెఱింగియే మిమ్ముఁ గా, గాని వెరపేది కాదె పగకుఁ దలకొంటి జయంబుఁగోరి మీ, రును బల శౌర్య సంపదను రూపముగాఁ బొగడొందు భంగులన్, బెనఁగితి రేమిచేయుదురు బెట్టిదుఁడై విధి తప్పఁజూచినన్."

గంధర్వుల బారినుండి రక్షించిన అర్జునునకు వర మొసంగెద నని మాటయిచ్చి, యుద్ధసమయమున కృష్ణప్రేరితుఁడై కిరీటి తనకిరీట

మును గోర వరదానము తనకు ఘోరానర్థము వాటిల( జేయునని యెఱి(గియు, తనమాట జరుపుటకు దుర్యోధను( డించుకైన సంశయింపలేదు. ("కాశీపురాణము" చూడుఁడు.) యుద్ధాంగణమున నాతఁడు సామరికప్రథకు తలయొగ్గెనని చదువుదుము. కలుషాత్ముఁడగు దుర్యోధనుని చరిత్రయందుఁగూడ భారతకవి యించుక సూర్యతేజమును చూపెను. సీతను కొంపోయిన దశకంఠుఁడు భగవతిని తాఁకఁజాలక పోయెననియు, నేలను పెల్లగించి ఆమెను గొంపోయెననియు మనమెఱిగిన యుదంతము తెలుపుచున్నది. దమయంతిని కిరాతుఁడు చేరగమకింప నామె క్రోధాగ్ని కాతఁ డింధనమాయెననియు, మృతుఁడైన లోహితుఁడు సజీవుఁడాయెననియు, మృత్యుంజయుఁడు వశిముడి బుజమెక్కి కురుక్షేత్రమున కదన మొనరించెననియు, సావిత్రి సమవర్తి నంటిచని, మగని ఆయువును దెచ్చుకొనెననియు, గౌరీశుఁడు గాధిపుత్రుని ముదలఁదలఁదాలిచి శైబ్యను దాసిఁ గావించుకొనెననియు, నవనవాటిక మనసనైఁ గోచరించెననియు, కృష్ణపరమాత్మ ద్రౌపదికి కోకలిచ్చి తన కారుణ్యముయొక్క ప్రత్యక్ష దృష్టాంతమును చూపెననియు, జయద్రథవధకుముందు జగచ్చక్షువు కడ్డముగ జగదీశుఁడు చక్రము నిలిపె ననియు సామాన్యులకు విశ్వసనీయములుకాని,—సత్యమునకు విరుద్ధములట్లుతోఁచు వృత్తాంతములు మనసారస్వతమందు నిండియున్నవి. ప్రాచీన హైందవ నాగరికతతో సంబంధముగల గ్రీకు రోమను సారస్వతములందును నిట్టి విడ్డూరములు తోఁచుచున్నవి. ఇఫిజీనియాకుత్తుకను తండ్రి ఉత్తరించినంతన (Vide: Greek History and Tennyson's 'Dream of Fair Women') సముద్రదేవత అగమెమ్నన్ నౌకను పోనిచ్చెననియు, ట్రోజను యుద్ధమున నదృశ్యులెవ్వరో పోరుసలిపిరనియు, బియాట్రిస్‌ను చూడ

నరిగిన కవి అన్యప్రపంచచిత్రములను విలోకించెననియు హోమరు డాంటేలు తెలిపిరి. విడ్డూరము లనునవి యన్నియు విడ్డూరములే కాక పోవచ్చును. సామాన్యదృష్టికి విరుద్ధములట్లు తోఁచు నిట్టి సంఘటనములు ఆంగ్లసారస్వతప్రపంచమున నంతగా గోచరింపవు. బైబిలునను సరించి లిఖింపఁబడిన గ్రంథములందును, షేక్‌స్పియరునకు ముందుగల రచనలందును విడ్డూరములు తోఁచినవి జగదీశునకును శనికిని ఘోరరణము పొసఁగెననియు, నిరయసీమయందు మహాసభ (Council in Pandemonium) కూడెననియు, అనుచరసహితముగ గాఢాంధకారమున గ్రుమ్మఁబడిన బెల్‌జీబబ్ ఆలోకమునకు పయనము (Travel through Chaos) ఆయెననియు మిల్టన్‌కవి వ్రాసినను, (Vide : Paradise Lost) ఇది బైబిలులోని ప్రాఁతకథయేగాని ప్యూరిటన్‌కవి కనుఁ తెరచుట (అతనికి కనులేలేవు) కాంచినకథకాదని యెఱుఁగుదుము. జాషుయా (Joshua) శక్తివలన సూర్యుఁడాకసమున నిలిచిపోయిన వింతబైబిలు కథ యొకను ఆంగ్లసారస్వతమునఁ బ్రవేశింపలేదు. భయదమైన పిశాచ మొకటి మహాయోధుల భోజనశాలఁ జొచ్చి, పల్వురను దిగ్రమింగెడి దనియు, బ్యూవుల్ఫ్ సముద్రమునఁజొచ్చి, పిశాచగృహమునఁ బ్రవేశించి దుష్టభూతమును, దానితల్లిని దునిమెననియు, సాగరోదకమంతయు రుధిరమాయెననియు షేక్‌స్పియరుమహాకవికి మున్నుగల ఆంగ్లసారస్వతము తెలుపుచున్నదిగాని తరువాతి రచనము తెలుపుటలేదు. రామాయణ భారతములను ఆంగ్లేయులు వ్రాసియుండినచో, హనుమంతునిచే చెంకులట్లు కొండలను రువ్వఁజేయ్యరు; ఇంద్రజిత్తును మేఘములపై నెక్కించి శరపరంపరలను నేలరాలఁజేయరు; కిరాతుని చేతుల నుండి దమయంతిని విడివడఁజేయరు; చంద్రమతిచే నగ్ని నార్పఁజేయరు; లోహితునకు తిరిగి ప్రాణము లీయరు. తాము వెనుక నిలిచి, జరుగు

చున్న దారుణములను కనులముందుఁ ద్రోసివైతురు. అట్లొనరించి వారు చంకలు కొట్టుకొందురని తలఁపకుఁడుసుఁడీ. కడవలకొలఁది కన్నీరోడ్చు చునే మనలను దుఃఖసముద్రమందు రువ్వుదురు. "అయ్యో! ఇదేమి దురంతము!!" అని కేవ్వమందుము. "దురంతమే! ఇది బూటకపు దురంతముకాదు! మానవుఁడు చేయిచేసుకొను దురంతమే!" అని వారందురు. మహత్తరాశయములు (ఇవి విశేషముగా జలదప్రపంచ మందే ప్రేలుచుండునని యూహింతుగు కావున) వాంఛించులీల సంఘ టనములను త్రిప్పరు. గుండెలను దడదడలాడించు పనులను తమపాత్ర లచే చేయించి, "ఇవి అనుదినము జరుగునవియే. వీనియం దపూర్వ మైన దేమియులేదు" అందురు. డెస్డెమోనా భారత పతివ్రతల కెవ్వ రికిని దీసిపోదు. కాని, భారత పతివ్రతల కెవ్వరికిని డెస్డెమోనాగతి పట్టలేదు. షేక్స్పియరుగాక, భారతీయుఁడొకఁడు "ఒథెల్లో" వ్రాసి యుండినచో, అశరీరవాణిచే నిజము చెప్పించియో, ఒథెల్లో ఘోర క్రియను పూలచెండుగ మార్చియో, మూర్తీభవించిన నరకలోకమగు అయాగోతలపై నాకస్మికముగ పిడుగును రాల్చియో పావనగుణ శోభితయగు నొక సుందరిని రక్షించువాఁడు. భారతీయుఁ డెవ్వఁడై నను కార్డీలియాకు కానిచావును, ఎనుబదేండ్లు కడచిన లియరురాజు నకు దురంతమైన ఉన్మాదమును తెచ్చిపెట్టఁడు; మేక్ బెత్ హేమ్లెట్ నాటకములను ఛిన్నమస్తకములతోను, రక్తప్రవాహములతోను, మాంసపుకండలతోను నింపువాఁడు కాఁడు; సోదరుని, సోదరపుత్రు లను స్వహస్తముచేతుల కర్పించువాఁడు కాఁడు. (Vide: Shakespeare's Richard III) షేక్స్పియరైనను నరపిశాచముల కాధిపత్య మీయ లేదు. పలుగాకులకు ముట్టవలయు శాస్తి వారికి ముట్టనే ముట్టినది. (The Work of Namesis) కాని, ఈ దుర్మతులు సన్మార్గవర్తు

లను పాతిపెట్టియే తమగోతిలో తాము దిగిరి! ప్రాచీ సారస్వత మీదారుణమునకు తావీయదు. సన్మార్గగాములను సిలుగులందు ముంచినను, భారతకవి వారిని కాలక్రమమున కొంటెక్కించి, దుర్మతులను లోంతుగోతిలో దింపును.

ఇందలి భేదము ప్రాచీ ప్రతీచీ సారస్వతదృక్పథముల భేదమని పాఠకులు గ్రహించియేయుందురు. షేక్స్పియరును కనిన సారస్వతము నిష్ఠురమని తలంపక నిజమును చెప్పివైచును. వాల్మీకి వ్యాసులను కనిన సారస్వతము అగ్నికణమువంటి సత్యమును పుష్పదళముగా మార్పందలంచును. రామాయణమును షేక్స్పియరుమహాకవి నాటకరూపమున వ్రాసియుండినచో, సీత నగ్నినుండి ఆతండు లేవనిచ్చువాండు కాండు. అగ్నికుండమున నిలిచినజానకిని చూచుపట్ల "పవడపురాశి" గాని, "నవభర్మశలాక" గాని, "చారుపల్లవముల కుప్ప" గాని షేక్స్పియరుకలము నాశ్రయించునవికావు. ఎదుటి యదిష్టము నకును, మీందికుఱుకు శత్రువునకును తలయొగ్గుట మహత్తరమైన క్రియయని క్రైస్తవతత్త్వము (Vide: Sermon on the Mount) తెలుపుచున్నది. ఏసుసంయమియుద్బోధనము ("Deny yourself") ఆదర్శ ఆంగ్ల సారస్వతమున 'చిలవలను, పలవలను' వ్యాపింపఁజేసినది. 'నిన్ను జయించుకొని, ఒరులను జయింపుము' అను హైందవబోధ హైందవ సారస్వతమున తెరలు తెరలై ప్రసవించినది! ఏసు 'ఒరులకులొంగి పొమ్ము' అనును. ఈ లొంగుబాటులోనే జయ మున్నదనును. చెప్పినట్లామహాపురుషుఁడు చేసిచూపెను. తన శరీరమును ముక్కలు ముక్కలు చేయనిచ్చెను. తాను చచ్చెను! చచ్చి లేచెనని క్రైస్తవు లందురు. చచ్చిలేచినక్రైస్తు పృథ్వియందు విజయశంఖము పూరించెనని పీరందురు. విశాలమైన నేఁటిక్రైస్తవ ప్రపంచమును పరిశీలించి, చదు

వర్ధులే వీరివాక్కును విమర్శింతురుగాక! ఏసునకు నేను చేతులు మొగుడ్చుటకు ఆతురంపడుదును. అయ్యో! సిక్కుమగు క్రైస్తవుం డాతఁ డొక్కఁడేమో అని సంశయింపడుచుందును. మనసారస్వతము కూడ త్యాగమునకు గురుపీఠ మిచ్చినను, 'ఎదుటి దుర్మతికి, నీకుఁగా కున్న పృథ్వికిని యుగయుగములకును విలువగల, నీకుత్తుక నప్పన మొనరింపక ఆతనిని జయింపుము' అని పలుకును. బుద్ధభగవానుని జీవనమును పరికింపుఁడు. దేవదత్తుని దాష్ట్యమునకు తల యొడ్డి, తథాగతుఁడు ఆత్మాహుతియందు తనమహత్త్వమును తేటపఱుచుట సముచిత మని క్రైస్తవమతము తలఁచును. కాని బుద్ధుఁడు ఆత్మాహుతిని కాంక్షింపలేదు. "తల తఱుగు" మని శత్రువుముం దీతఁడు నిలువలేదు. శాత్రవశక్తిని చేతిబొమ్మను చేయుట ఘనతరమని యెంచి, ఆతఁడట్లొనరించెను. ఉన్మత్తవేదండమును శాక్యముని పెంపుడుపిల్లిని చేసివైచెననియు, నిముసములో దేవదత్తుని జయించెననియు బౌద్ధవాఙ్మయపరిచితు లెఱుఁగుదురు. (Vide: "Devadatta's revenge"—Anderson's Pali Reader.)

మతమును, సారస్వతమును నొక్కపరి చిగిరించి, ఒక్కపరి మనుష్యజీవనమున ప్రస్ఫుటించినవి. ఉత్తమసారస్వతమును, ఉత్తమ జీవనమును, ఉత్తమమతమును వేఱుచేయుట అసాధ్యమని నా తలంపు. ఈమూఁడును మూఁడు శిరములుకల దత్తాత్రేయునివంటివి; అభిన్నము లైన మూఁడు ప్రధానాశయములు కలవి.

ముఖ్యాంశములందు ప్రాచీప్రతీచీ మతములందు భేదమే లేదు. సామాన్యాంశములందు వ్యక్తికిని వ్యక్తికిని భేదములున్నట్లే మతములందును, సారస్వతమునందును నవి కలవు.

సారస్వతము మనుష్యజీవనప్రతిఫల మైనపుడు పూర్వపశ్చిమ సాహిత్యములందు భేదమేల చూపట్టెనో విపులీకరించి తెలుపనక్కర

లేదు. ఆదర్శ జీవనములకు వలయు నిబంధనలందు ప్రాచీ ప్రతీచీభేద ములు లేకున్నను, జీవనములుకడపు తీరునందును, సాంఘికాచారము లందును, మానసికగ్రథనమందును, అచ్చటచట వ్యత్యాసములు తోఁచుచుండుటచే, ప్రజల నుద్దేశించి పలుకు సారస్వతోక్తిని కవి, ప్రత్యేకప్రజ కాంక్షించునట్లు, యుగధర్మమువలచునట్లు, జాతిధర్మము నిర్దేశించునట్లు, దేశధర్మము నిర్ణయించునట్లు తెలుపును. ఆదర్శమును చేరు తెరువునందును, సంప్రదాయమందును మాత్రము భేదము చూపట్టుచున్నది. పూర్వపశ్చిమ సాహిత్యము లొకేవిధమగు నాశయములను దృష్టియందిడికొనినవి. సాధనములు వేరైనను, సత్యం, శివం, సుందరం (Truth, Goodness a. Beauty) అను నాశయములకై ఈ సాహిత్యములు పరిపూర్ణత్వమును కాంక్షించు మహాపురుషునిలీల ప్రయత్నములు సలుపుచున్నవి.

సారస్వతాచార్యులు కొందఱు తమ యుద్దేశముల నుద్బోధన రూపమునఁ దెలిపినైతురు. మఱికొందరు జీవనకాఠిన్యమును, జీవన సౌందర్యమును ఉన్నదున్నట్లు తెలిపి ప్రజలకనులు తెఱతురు.

షేక్స్పియరు వ్రాఁతలందు చిన్నమెత్తు ప్రబోధము తోఁపదు (He is not didactic). మనుష్యప్రకృతియందలి స్వర్గ నరకములను కనులెదుటఁ బెట్టి, నిదురపోవుచు, తన్నుఁదాను మఱచిన మానవ ప్రపంచమున కెంతేని యుపకారమును షేక్స్పియరు చేసినాఁడు. పుష్పగుణమును ప్రబోధించుటకుమాఱు ముక్కుదాపున నాతఁడు పూలచెండు నుంచెను. వేడిమినిగుఱించి ఏమో యుద్బోధింపక, అగ్గి యందు ప్రమగ్గువారి హాహాకారములను చెవులఁ జొనిపెను. అయాగో, ఎడ్మండు, మూఁడవరిఛార్డు, లేడీ మేక్ బెత్, జెక్ట్రూడ్, క్లాడియస్,

గానరిల్, రీగాన్ లనుగుఱించి అతఁడేమియు వ్యాసములు వ్రాయలేదు; గురుగంభీరములైన ఉపన్యాసము లీయలేదు. వీరి నోటినుండి వెడలు వాడికోరలు చూపి "అమ్మో!" అనిపించినాఁడు. గ్రంథకర్త తన రచనలందు దూరియుండుననియు, గ్రంథములోనిపుట గ్రంథకర్త మానసపుత్రమనియు విమర్శకులు తెలుపుదురు. నాట్యకళయందు సిద్ధహస్తుఁడైన షేక్స్పియరుపట్ల నీసూత్రము చెల్లదు. బాహ్యావనిగుఱించియు, మనుష్యప్రకృతినిగుఱించియు తన తలంపు లిట్టివని ముందునకు వచ్చి తెలుపక, వానిని పాఠకులే గ్రహింపవలెనని అతఁ డుద్దేశించెను. కావ్యరచనయం దాఱితేఱిన కవులందరు నిట్లే యాచరింతురు. షేక్స్పియరుసమకాలికుఁడగు పింగళిసూరన్నయం దీప్రజ్ఞ కొంత కలదు. షేక్స్పియరుపాత్రలనుబట్టి షేక్స్పియరును గుర్తింపఁజూచుట పొరపాటు. * షేక్స్పియరుపాత్రలు ప్రపంచజీవనము! షేక్స్పియరుపాత్రలు విభిన్న మనుష్యప్రకృతులు !! షేక్స్పియరుపాత్రలు సత్యసంఘటనకథనము !!! షేక్స్పియరు పాత్రలు యథార్థ ఉచ్చారణము !!!! పరిపూర్ణత్వసిద్ధికై వలయు ప్రధానాశయములకు మార్గదర్శకములు !!!!

---

* Shakespeare's writings are objective, not subjective. విమర్శకు లొకపరి ఈతనిని హేమ్లెట్ నకు పోల్చిరి.

"How noble in reason! How infinite in faculty! in form and moving how express and admirable! in action how like an angel! in apprehension how like a god..." *Hamlet*, Act II, Scene II. హేమ్లెట్ నోటినుండి వెడలిన ఈనుడువులు షేక్స్పియరునకు చెల్లుననుట నిస్సంశయము. ప్రకృతి నిలిచి గరువముతో "నీతఁడు తనవాఁడే" యని పలికెననియు, షేక్స్పియరు పలికిన నుడువు లాతనికే తగియుండుననియు మనము నిస్సంకోచముగా తెలుపవచ్చును. కాని హేమ్లెట్ షేక్స్పియరని తెలుపఁజెల్లదు. కొందఱు విమర్శకులు షేక్స్పియరును ప్రాస్పెరోతో పోల్చిరి. (Shakespeare's

షేక్స్పియరు తెన్నునకును మన సారస్వతాచార్యుల తెన్నునకును ఎంతేని భేదమున్నది. మన సాహిత్యము వట్టి బాయిలాగుండె కలది. నిక్కముగ నొక్కఁడు గుండెలో గునపము గ్రుచ్చుచుండ, మన సాహితి మూఁది సహింపఁజాలదు; చూడనే చూడదు. 'తెరలో కలకల' మనియు, 'నేపథ్యమున' నేమో జరిగెననియు, వెనుకజరిగిన సంఘటనములను గుదిగ్రుచ్చి ఒకపాత్ర నోట నింత 'స్వాగతము'గాఁ గ్రుక్కియు, కనుటెదుటఁ జేరఁజాలనిదానిని 'తనలో' నడుమఁ జేర్చి వైచియు మన నాట్యకళ తులసితావళము చేతఁ బట్టినది! రెండు మాటలనడుమ నొక ''శ్రీకారమును'', ఉద్ధరణిగంగోదకమును, చక్కని చిన్ముద్రను, ఒకపట్టు నీతిబోధను, కొంత ప్రణవధ్వనిని చొప్పించును. అధునాతన భారత వాఙ్మయమున కంతకు మూలకందమైన మహాభారతమును తెఱచిచూడుఁడు. ఇది నీతిబోధకమును, విజ్ఞానఖనియు నగు నుద్గ్రంథము కాదా? భాగవతమును తెఱువుఁడు. ఇందలి ప్రత్యక్షరము భక్తిని బోధించు ఆచార్యుఁడు కాదా? రామాయణమందు వాల్మీకి వల్కలాజినములును, విభూతి రేఖలును తోఁచు

---

pen was identified with Prospero's magic wand. 'The relinquishment of the magic wand' is construed as 'the relinquishment of the pen'). ఇంకను కొందఱు విమర్శకులు షేక్స్పియరును ఫాల్‌స్టాఫ్‌తో పోల్చిరి. షేక్స్పియరే ఈతఁడనిరి. విమర్శకుల కసాధ్యమైనదేమి? వారికిఁ గల సూక్ష్మపరిశీలనము వారినిగనిన కవులను లేదేమోయని ఒక్కొక్కమాఱు తోఁచును. షేక్స్పియరునాటకములందు దూరి, అతఁడు ఎటర్నీక్లర్కు అనియు, ఓడనడపువాఁడనియు, రోమనుపురవాసి యనియు, అతఁడు ఆఁడుదనియు వారనవచ్చును. ఇట్లని నిరూపించుటకు వలసిన యాధారములు కొల్లలుగ నా మహాకవినాటకములందుఁ గలవు. అన్నిఁటియందును, అంతటియందును సర్వాంతర్యామివలె తన యద్భుతశక్తిని రేకెత్తించిన షేక్స్పియరు నెందఱితోఁ బోల్చినను బోల్పవచ్చును. కాని షేక్స్పియరు షేక్స్పియరే కాని వేఱుకాఁడు.

చుండవా? అనసూయ సీతిప్రబోధమును, సీత పాతివ్రత్యమును, మార్కండేయ ధౌమ్యాది మునిప్రకాండుల ఉద్బోధనలును, ద్రౌపది భక్తి గుణమును మన సారస్వతమందు భుజమృణాళసంబద్ధసఖులట్లు తోఁచుచుండును. మన నాటకములుకూడ మన పురాణములపక్కనే నడచుచున్నవి. మన మింకను పురాణయుగమందే ఈఁదులాడుచుంటిమి. మన నాటకములు మనవలెనే దారుణమున కోర్వవు.

"Take that, and that: if all this will not do" [Stabs him]
*Richard, III* Act I, Scene IV.

అను పదమొకటైనను,—అట్టిదృశ్య మొక్కటైనను మన నాటకములందుఁ గానరాదు. ఆఁడుదానివలువల నొకదుర్మతి, మగల ముందటఁ, నిండుకొలువున నిలువఁబెట్టి యూడఁదీయుచుండ, చూచి సహింపక వ్యాసభట్టారకుఁడు చివాలున శ్రీకృష్ణుని మహత్త్వమును బ్రకటించినాఁడు. ఇది శ్రీకృష్ణుని మహత్త్వమో, వ్యాసుని గడుసుఁదనమో తెలుపఁజాలను. ఈ దృశ్యమును షేక్స్పియరు చిత్రించువాఁడగుచో, మనుష్యుఁడు కనివిని యెఱుఁగని పరలోక చిత్రమునొండు సమ్ముఖమున ప్రదర్శింపఁడు. తానును కవియేకావున, దుర్యోధన సభాస్థలమందలి స్తంభములను చివాలున నుఱికించి దుశ్శాసనునితల బ్రద్దలుకొట్టించి పౌరుషమూర్తులగు పాండవులకు జడపదార్థములచే నా ముహూర్తమున కొంత పౌరుషమును బోధింపఁజేసియుండును! లేకున్నఁ దక్కుంగల పాండవు లెట్లున్నను, భీముని త్రుటిలో రేఁగఁగొట్టి, అతనిగదచే, ఉక్కుమీఁటి ప్రవర్తించు పలుగాకిబుఱ్ఱ నొక్కపెట్టున వేయిముక్కలు చేసియుండును! జరుగవలయు యుద్ధమునకు ఆ ముహూర్తమునుండి షేక్స్పియరు ఎప్పటికో వాయిదా వేసియుం

డఁడు. వ్యాసుఁడుమాత్రము ఎవ్వరిని మిగిల్చినాఁడు? వారును, వీరును, తుదకందఱును సున్నకాలేదా? ఉత్తరగర్భమందున్న కాఁబోవురాజు విషాదాంత మహాకావ్యమునకు ప్రసాదించిన పరితోషమెంత? అయ్యో! ఆ పరీక్షితుఁడుకూడ పాముకాటునుండి పరలోకమున కుఱుకలేదా? ఉరికంబము లేగతియైనవానికి వాయిదా లెందులకు? ఈ వాయిదా లాతనిమనసున చితిమంటలను రవుల్కొలుపవా? వ్యాసుఁడు భారతీయుఁడు; తల్లివంటి కడుపుకల కవి. ఉరియుచ్చునకు కబళము కావలయువాఁడైనను, ఆలస్యవ్యథనుగుర్తించి కొడుకుపైఁబడియేడ్వక తమకమున తల్లి, వానిని జైలరునకుఁగాని, దుర్విధికిఁగాని ఒప్ప గించునా? జీవనరంగమందలి దారుణములను తప్పించియో, దూర ముగఁ దొలఁగించియో వానితాపమునుండి తమ్మును, తమపాఠకులను భారతకవులు కొంతవఱకు కాపాడుకొనిరి. ఇందుల కెన్నేని దృష్టాంత ములున్నవి. ఆంగ్లకవుల ప్రకృతి వేఱు. కనికరపుహంసపాదులందు కాళ్లుముడువక, జరుగవలసినకథను సత్వరమే కానిచ్చివేతురు! ఆఁడు దానివలువల నొలువ నుపక్రమించుటకాదు; ఆఁడుదాని కనులకు గంతలుగట్టి ప్రత్యక్షముగ నామెతలను తఱుగుటకు ఆంగ్లకవి జంక లేదు. లేడీజేన్ ఏవిధముగఁజచ్చినదో ఆంగ్లసాహిత్యవిద్యార్థు లెఱుఁ గరా? ఇంగ్లీషుపద్ధతియందు కాలిడి, ఒక్కఉఱుకున కీర్తినభమును చేరఁగలిగిన నేఁటివంగీయులు, పాశ్చాత్యప్రజ్ఞను కొంత చూపు చున్నారు. వంగీయులచే భారతషేక్స్పియ రనిపించుకొనిన ద్విజేం ద్రుని నాటకములను తెఱచిచూడుఁడు. మనకనులెదుట—మనకను లెదుటేకాదు; అతనితనయుఁడు, పసిబాలుఁడు, సిఫర్‌కనులెదుట—దారాతలను ద్విజకవి తఱిగివేసెను! ("షాజహాన్" చూడుఁడు) చూచుచుండఁగ నందుని శిరమును యూపకాష్ఠమున కర్పించెను!

("చంద్రగుప్త"ను చూడుఁడు) ధిషణాధురంధరుఁ డగు ద్విజేంద్రుఁడు భారతసంప్రదాయమును అనుకరింపలేదు. మన సారస్వతమునకు మోమోట మెక్కువ; దుడుకుఁదనము తక్కువ. ఉలికిపడఁజేయు దృశ్యములను కనులెదుటఁబెట్టక ఉల్లము రంజిలఁజేయు నీతిబోధను, శృంగార కథనమును మనచెవులందు నింపును. హరిశ్చంద్ర చంద్రమతులను ఎన్ని కడగండ్లయందు ముంచినను, తుదిదృశ్యమున భారతకవి చంద్రమతిశిరమును నఱుకనిచ్చెనా? డెస్డిమోనా, కార్డీలియా మున్నగువారి గుండియలను కనులెదుట వెల్లగించుటకు షేక్స్పియరుకలము జంకెనా? సత్యము నారాధించునదైనను, మనసాహితి అప్రియమైన సత్యమునకు వంగి సలామొనరించి, వేఱుతెఱువు చూచుకొనును. భారతసారస్వతము భారతప్రకృతియట్లు కత్తిపోటునకును, కఠినోక్తికిని ఆదరమీయదు.

చిత్రమేమన, ప్రాచీన సారస్వతమందలి నిర్మలనీతిప్రబోధమును, ఆధ్యాత్మికశక్తివిజృంభణమును, ప్రతీచీసాహిత్యమందలి దారుణ సంఘటన ప్రదర్శనమును, సత్యకృత్య వివరణమును నొకే యుద్దేశసిద్ధికై నడుముగట్టినవి. ప్రపంచమహానాటకములందు ప్రథమగణ్యమైన ఒథెల్లోనాటకమును తెఱచిచూడుఁడు. ఇందుండి నీతివాతూలమేమియు మనచెవుల సోఁకదు. బుస్సుబుస్సున విషవాయువులుగ్రక్కుచు, ఫణమెత్తి అయాగో ఇందాడుచుండును. కొండొకవడి అయాగోను కొండెక్కించి ఒథెల్లో డెస్డిమోనాలను సుతలమున దింపినను, తుదకు షేక్స్పియరుకలము భాస్వచ్చారిత్రులగు నీదంపతుల నిరుపురను నక్షత్రమండలమున నాసీనులను జేసి మూర్తీభవించిన నరకలోకమగు నయాగోను చిరనరకమున కప్పనమొనరించెను. ఒథెల్లోచే నిర్మల చరిత్రయగుభార్యను చంపించినాఁడు. అట్లని యెవ్వరైన ఒథెల్లోను

హంతకుఁడనఁగలిగిరా ? ఈ దారుణహననమునకది స్వార్థత్యాగమని మనకుతట్టదా? హంతకుఁడు నిష్కళంకచరిత్రుఁడని నిరూపించుట సత్యవ్రతనిష్ఠాగరిష్ఠుఁడగు షేక్స్పియరునకు తగునాయని చదువరు లడుగవచ్చును. సత్యము నారాధించుమహాకవి కావున, మానస తత్త్వము నెఱిఁగిన మహాపురుషుఁడుకావున, సామాన్యమానవులట్లు ఒడంబడుకువిమర్శకు చేయిజేసికొనక అందఱకును నసత్యమట్లుతోఁచు సత్యమును ప్రపంచముమ్రోల నిలిపెను! డెస్డిమోనాను చంపిన వాఁడు ఒథెల్లోకాఁడు, అయాగో:—ఈపిశాచము తనచేతులతోఁ గాక ఒథెల్లోచేతులతో నాదారుణక్రియఁ గావించినాఁడు; పదపడి ఒథెల్లోచేతులచే ఆ మహాపురుషుని తానే చంపివేసినాఁడు. మనము పూర్వుచెందు ఒథెల్లోడెస్డిమోనాలపై వేతుము; అయాగోముఖమున నిప్పులు (ఇవిచాలునవి కావని దూపిల్లుచు) పోయుదుము. దంపతులలో నెవరికి తొలిజోహారందురా! ముగురమ్మలకు తీసిపోని డెస్డిమోనాకే! ప్రబోధమువలనఁగాక మిఱుమిట్లు గొలుపు తన కలము వలన షేక్స్పియరు డెస్డిమోనా మహత్తరచరిత్రము నెట్లు మన కనులకు కట్టినాఁడో చూతుఁడు. *దివ్యాంగనలకుఁగూడ నీసుఁగొలుపు నీ సీమంతినీచూడామణిపవిత్ర చరిత్రమును షేక్స్పియరుమహాకవి

---

* "Bra........a maid so tender, fair and happy,
So opposite to marriage that *she shunn'd*
*The wealthy curled darlings of our nation,*
Would ever have, to incur a general mock,
Run from her guardage to the sooty bosom
Of such a thing as thou, to fear, not to delight"

*Othello*, Act I, Scene ii.

  

యెట్లు చిత్రించెనో కనుగొనుఁడు..తక్కినపంక్తులను ఒథెల్లో నాటకము నుండి యూడ వెఱికినను,

*"Nobody! I myself. Farewell!*
*Commend me to my kind lord."*

అనువాక్కులందు డెస్డిమోనా అద్భుతచరిత్రము తేటపడు చున్నది. సిలువపైనిలిపి అల్లనల్లన రక్తమాంసముల నూడఁబెఱుకుచు,

---

Des.

"My noble father,
I do perceive here a divided duty!
To you I am bound for life and education;
My life and education both do learn me
How to respect you! you are the lord of duty;
I am hitherto your daughter: but here is my husband,
And so much duty as my mother show'd
To you, preferring you before her father,
So much I challenge that I may profess
Due to the Moor my lord."

Act I, Scene iii.

  

Des.

"That I did love the Moor to live with him,
My downright violence and storm of fortunes
May trumpet to the world. My heart's subdued
Even to the very quality of my lord!
*I saw Othello's visage in his mind,*
And to his honours and his valiant parts
Did I my soul and fortunes consecrate."

Act I, Scene iii.

  

వాడిమేకులుగొట్టి అంగుళంగుళమునొప్పిన దుర్మతులు ప్రాణములు దీయుచున్నను, వారిపైఁ గరుణాదృష్టిఁ బఱపి, జగదీశు నుద్దేశించి, "తండ్రీ! వారిని మన్నింపుము. తా మేమిచేయుచుండిరో వా రెఱుఁగరు."

---

Oth.

"Tis not to make me jealous
To say my wife is fair, feeds well, loves company,
Is free of speech, sings, plays and dances well;
Where virtue is, these are more virtuous:
Nor from my own weak merits will I draw
The smallest fear or doubt of her revolt;
For she had eyes, and chose me."

Act III, Scene iii.

⁘ ⁘ ⁘

Oth.

"Her name, that was as fresh as Dian's visage"

Act III, Scene iii.

⁘ ⁘ ⁘

Emil.

"I durst, my lord, to wager she is honest,
Lay down my soul at stake; if you think other.
Remove your thought: it doth abuse your bosom."

Act IV, Scene i.

⁘ ⁘ ⁘

Emil.

"A halter pardon him! and hell gnaw his bones
Why should he call her whore? Who keeps her company?
What place? What time? What form? What likelihood?"

Act. IV, Scene ii

అని మనుష్యప్రపంచమున నెన్నఁడో కాని తోఁపని మహాద్భుతచరిత్రమును వ్యక్తీకరించిన ఏసుమునివరునకును, నిష్ఠురమున కొడిగట్టి తన

---

Des.
"........ .my love doth so approve him,
That even his stubbornness, his checks, his frowns—
Prithee, unpin me,—have grace and favour in them."
Act IV, Scene iii.

Cas.
"Most fortunately: he hath achieved a maid
That paragons description and wild fame;
One that excels the quirks of blazoning pens,
And in the essential vesture of creation
Does tire the ingener."
Act II, Scene i.

⁘ ⁘ ⁘

"She that could dictate duties to monarchs."

⁘ ⁘ ⁘

Oth.
"......but once put out thy light,
Thou cunning'st pattern of excelling nature,
I know not where is that Promethean heat
That can thy light relume."
Act V, Scene ii.

Des. "A guiltless death I die.
Emil. O! who has done this deed?
Des. *Nobody; I myself.* Farewell.
*Commend me to my kind lord.*
O farewell!" (Dies.)

⁘ ⁘ ⁘

Emil.
"*O the more angel she,*
And you the blacker devil."
Act V, Scene ii.

యుసురులు దీయుటకు సంశయింపని పతిపై కరుణాదృక్కులు వర్షింపఁజేసిన డెస్డిమోనాకును భేద మేమున్నది? పాఠకులారా! మతమునకును, ప్రత్యక్షజీవనమునకును, సాహితికిని గల సంబంధము ఆదర్శకవివరుని కలము దెట్లు తేటపడుచున్నదో విలోకించితిరా! గెటేకవీంద్రుని మెఫిస్టఫిలీస్‌ను, పిల్లరుమహాకవి రాబర్‌ను చూచి వీరు ఊహాప్రపంచమందలివ్యక్తులే యని మీరు తెలుపవచ్చును. షేక్స్పియరు పాత్రము లెందో మొగయు గాలిపడగలుగాని మానవులుకారని ఋజువు చేయఁగలవారెవరు? డెస్డిమోనాయను నొక్తుక లేదందురా? అటులైన ఏసను నొకవ్యక్తియే లేఁడందురా? చరిత్రయే లేదందురా? ప్రత్యక్షప్రపంచమే లేదందురా? జీవములేని పాత్రమైయున్న మతలోకగ్రంథకారుని డెస్డిమోనాను దెచ్చి, షేక్స్పియరు ఆయువుపోసి ఆలోకముచే నింపవైచినాఁడు! ఆహా! షేక్స్పియరుకలమం దెట్టిశక్తియున్నదో! సూర్యతేజమునకుఁగాని, పంచభూతము లైదింటికిఁగాని యిట్టిశక్తి యున్నదా? సృష్టికర్తలేఖినికి షేక్స్పియరులేఖిని యొట్లుయినను తీసిపోయెనా? ఆచార్యుఁడై నిలువక, తనపాత్రల యాచరణములందే ఆ ప్రజ్ఞాశాలి మనకెంత విజ్ఞానభిక్ష పెట్టెనో తిలకించితిరా? నిర్మలచరిత్రమున డెస్డిమోనా సీతకుఁగాని, సావిత్రికిఁగాని తీసిపోయెనా? మన కవులు మెత్తనిమనసుకలవారేయయ్యు, గడుసువాండ్రు. పూజనీయులైన మన కావ్యవ్యక్తులు ఈలోకములోనివారు కారనియు, అవతారములెత్తఁ బరలోకమునుండి దిగివచ్చిన దేవులనియు ముందే తెలిపి, భక్తివిశ్వాసములచే మనమనసులను ముందే నింపివైచిరి. సీత లక్ష్మి; రాముఁడు దేవదేవుఁడు. రామాయణము యొక్క అట్టి దెలువఁగనే మన కీషయము ప్రత్యక్షమై తోఁచును. కావున సాగిలపడియే ఉపోద్ఘాతమును, తమపరికాండలను చదువుదుము. అనురాగ

ముచే నిండిన మనసునకెదుటిపాత్ర అనురాగమయమై యుండును. షేక్స్పియరును చూడుఁడు:—ఇతఁడు తనపాత్రలను గుఱించి తొలుతఁ గాని, పిదపఁగాని కిక్కురుమనఁడు. వీరు ఆలోకమునుండి అవతరించిన పాత్రలని గడుసుకబురులలోనికి దిగఁడు. ఈతని గ్రంథములను పరిశీలించుతఱి ఈతని పాత్రలయెడలనే దృష్టిని బిగించియుండుముగాని, 'ఈతఁడెవరో? ఈతనినుడువులేమో?' అని యిటునటు పరుగులెత్తము. గ్రంథముతొలుతను, గ్రంథాంతమందును చదువరు లొక్కతీఱుగనే ఉందురా? ఉండుచో, వీరు చదువరులుకారు, చట్టుబండలు. అయ్యో! వీరు పునర్జన్మ మెత్తినవారగుదురనే ఆశపడుచుంటిని. అద్భుతావేగముతో నీపాఠకులు తాండవనృత్యము చేతురని నిరీక్షించుచుందును. డెస్డిమోనాను సీతదాపున నుంచుఁడు. సీత తేజస్సునకు డెస్డిమోనా తేజస్సు ఇంచుకైన తీసిపోవునా? నన్నడిగితిరా, తొలుత డెస్డిమోనాకు ప్రణమిల్లియే, సీతముంగల సాగిలపడుదును. సీత నాహృదయమందు తొలినుండియు ఆసీనయయ్యేయున్నది. జగములను కనిన జనయిత్రి మానవియయ్యు, లోకమాతయట్లు గోచరించుట అబ్బురము కాదు. సామాన్యమానవియై పుట్టి ఒకర్తుక, జగద్ధాత్రియై చూపట్టుట అత్యద్భుతకరమైన విషయము కాదా! కృష్ణద్వైపాయనుఁడు విష్ణువు యొక్క అవతారమందురు. ఈ అవతారపూరుషున కెందును దీసిపోననిపించుకొనిన షేక్స్పియ రెట్టివాఁడో యూహింపుఁడు.

పైవాక్యలనుబట్టి షేక్స్పియరుచేయి భారతకవులచేయికి పైనఁగలదని తెలిపితినంచు చదువరు లూహింపకుందురుగాక. వీరును, ఆతఁడును వివిధదేశములందు, వివిధయుగములందు, వివిధభావవాతూలములందు, వివిధసంప్రదాయములందు మసినవారు. నికృష్టస్థితియందుఁబుట్టి, మహోత్కృష్టపదవి నందఁగలిగిన షేక్స్పియరు

భారతకవులవలెనే పూజనీయుఁడని తెలుపుట నాయుద్దేశము. దేశకాలములు కవులకు అడ్డుగోడలుకావు. మన కాళిదాసు జర్మనువాసుల కెట్లు పూజనీయుఁడాయెనో, షేక్స్పియరుగారేలు మనకును నట్లే ఆరాధ్యపూరుషులై యుండవలయును. మన ప్రాచీన సారస్వత మహత్త్వమును మనయది గావించుకొనుచు, ప్రతీచీసాహితియందు గ్రుంకులిడితిమేని, మనసీమకును సమస్తవసుంధరకును ఎనలేని సేవ సలుపఁజాలుదుము. మనమింకను పురాణయుగమందు మసలవలెనని మక్కువపడుచున్నాము. కాళులను ముందులకును, మొగములను వెన్కకును ద్రిప్పి కూలఁబడుచున్నాము. ప్రత్యక్ష ప్రపంచము నిప్పులుచెరుగుచుండ, మీఁన మేషములను లెక్కించుచు, మేఘవీథులందు నృత్తగీతములఁ దేలుచుంటిమి. యుగసంప్రదాయమును మన్నించి నేఁడును మన సాహిత్యమును దేవదానవుల యుద్ధాంగణ మొనరింపక, జటిలజీవనసమస్యల పోరాటమును జూపు రంగముగను, ఆ రాటము నుడుపఁజాలు ధర్మక్షేత్రముగను నొనరించుట మన ప్రస్తుత కర్తవ్యమని నొక్కి చెప్పుచుంటిని. ఈ కర్తవ్యనిర్వాహణమున షేక్స్పియరును, తరువాతి మహాకవులును మనకు కొంతదనుక దారిచూపి, పదపడి మనల సొంతతెరువులందు నిలుపఁజాలుదురని నాదృఢ విశ్వాసము.

మనమహాకవులు ఉత్తమచరిత్రములను మన సమక్షమందిడుట కేకదా తమకలములను చేఁబూనిరి! మేలిముసుఁగు వేసికొని విషముఁగ్రక్కు దౌష్ట్యమును వెలుపలికీడ్చి, నిజరూపున దాని నెదుట నిలువంబెట్టి, దాని మచ్చమాపుటయేగాక సహస్రమయూఖుల నీను దివ్యచరిత్రములను షేక్స్పియరు మున్నగు పాశ్చాత్యకవులు మనకు

చూపి మానవ ప్రపంచముయొక్క, శతాబ్దులయొక్క చేమోడ్పుల నందుచున్నారు.

వేఱురూపులందున్నను వ్యాస, వాల్మీకి, షేక్స్పియరులకు వ్యత్యాసము లేదు. వాల్మీకివ్యాసులు జడలు దాల్చిరి. షేక్స్పియరు జడ లెఱుఁగఁడు. వారి శరీరములు నల్లనివి; ఈతని శరీరము తెల్లనిది. బాహ్యరూపమునందు వారును, ఈతఁడును, ఈతనిసారస్వతమును, వారి సారస్వతమును వేఱుతీఱున తోఁచుచున్నను, వారిహృదయములును, ఈతని హృదయమును, ఈతని మేధాసంపదయు, వారి మేధాసంపదయు, వారియుద్దేశములును, ఈతనియుద్దేశములును భేదరహితములైనవి. రుచులును తెరువులును వేఱైనను, వీరిగమ్యస్థానమొక్కటియే! వీరి సారస్వతవిధానములందు వ్యత్యాసము తోఁచుచున్నను, వీరి సారస్వతసిద్ధియందు భేదమేమి చూపట్టుచున్నది?

వ్యాస వాల్మీకి షేక్స్పియరులు సత్యనిష్ఠాగరిష్ఠులు. మనుష్యజీవనమునకును, సృష్టిసంచలనమునకును సత్యనిష్ఠ అవసరమైనట్లే, సాహితికిని అది ఆవశ్యకమైనది. ఆదర్శసారస్వతమునకును, పరిపూర్ణత్వసిద్ధికిని వలయు మహత్తరాశయములు "సత్యం, శివం, సుందరమ్" అని వాకొనియుంటిమి. ప్రాచీప్రతీచీ సాహిత్యములందు ప్రస్ఫుటితమైన సత్యనిష్ఠను ప్రస్తుతమించుక పరిశోధించితిమి. సాహితీదృష్టియందలిసత్యమునకును, భౌతికశాస్త్రము నెమకు సత్యమునకును ఎంతేని ప్రభేదమున్నది. దీనినిగుఱించిన విపులవిమర్శనమునకును, సారస్వతవధూటి అందఁజూచు తక్కిన మహదాశయములపరిశీలనమునకును పదంపడి గడంగెదముగాక.

# 2. సారస్వతము - ముక్తిసాధనము

తొలినుండియు భారతీయునకు జపమాల యైనదిముక్తి! పుట్టువు నందే స్వేచ్ఛాజిజ్ఞాస శిశుమధురాక్రందనమై, గభీరభావపూరమై హృదయమునుండి యుబుకును. భవబంధమునుండి విడివడి, చరమాదర్శ మగుపరమాత్మను జేరుటకుమున్ను మానవుని ప్రతిఘటించు నిరయమును, అగ్రసరుఁజేయు నాకమును ముఖ్యఘట్టము లగుచున్నవి. ఆదర్శమునందుటకు వలయు శక్తిసామర్థ్యముల నలవఱిచికొనుట కవకాశములై, స్వయంయత్న, ఆత్మప్రజ్ఞావికాసముల కవశ్యమగు తరుణములై, జన్మపరంపరలు జీవాత్మ కైహికయానములై యుండు నని 'కర్మవాదము' వాకొనుచున్నది. కర్మాంతమున మనుజుఁడు కాలిడు బ్రహ్మలోక మెందో వ్రేలాడియుండలే దనియు, స్వర్గనరకము లను ప్రత్యేకమానసికావస్థల నతిక్రమించినంత నది యుండే యలవడు ననియు, నేఁడు తత్త్వశాస్త్రము ఘోషించుచున్నది. కర్మాంత జన్మాంతములందు మానవుఁడు సర్వోత్కృష్టమోక్షమునందును.

"ఏషా తేఽభిహితా సాంఖ్యే బుద్ధిర్యోగే త్విమాం శృణు,
బుద్ధ్యాయుక్తో యయా పార్థ కర్మబంధంప్రహాస్యసి"

శ్రీ భగవద్గీత, అ. 2 శ్లో 39;

"ప్రయత్నా ద్యతమానస్తు యోగీ సంశుద్ధకిల్బిషః,
అనేకజన్మసంసిద్ధ స్తతో యాతి పరాంగతిమ్."

శ్రీ భగవద్గీత, అ. 6 శ్లో 45;

ఈమోక్షమునందుట, పరమాత్మనందుట— బ్రహ్మలోకముఁ జేరుట. ఎందో ముక్తిని మూటఁగట్టుకొని, జీవునకై యందలిఫలము

లను జగదీశుఁడు దాఁచి యుంచెఁను. మనముక్తి మనచేతిలోని పని. భగవంతుఁడు మనహృదయమందే కలఁడు.

" Were not the eye itself a Sun
No Sun for it could ever shine
But nothing Godlike could the heart be won
Were not the heart itself divine "—Goethe.

" He is my soul within my heart smaller than a grain of rice or barley, smaller than a mustard-seed or a canary-seed, or a husked canary-seed. He is my soul within my heart, greater than the Heavens, greater than these worlds."

— *Chhand Upanishad*, Verse 3.

" He and I are two souls dwelling in one body." Al Hallaj, the Sufi martyr. " Thou wouldst not be seeking me if thou didst not possess me."—*Bible.*

కావున జగదీశునిసామ్రాజ్యము (The kingdom of God) మనుజుని యంతరంగమందే కలదు. దీనియందలి బ్రహ్మానందమునకు దారిచూపు స్వర్గద్వారము సద్భావము. ఈ సద్భావమే, ఆధ్యాత్మికాంతరంగోద్ధరణము ! (Vide: Tolstoy's Teachings and Radhakrisnan's Indian Philosophy) సద్భావముగాని, దుర్భావము గాని, ఉన్నతిగాని, పతనముగాని, స్వర్గముగాని, నరకముగాని మానవమానసముచే నిర్మాణ మగును.

" The mind is its own place, and in itself
Can make a Heav'n of Hell, a Hell of Heav'n "

సద్భావనిర్మాణమున నాటి తేటినమానసము సచ్చిదానందము నందును. ఈసచ్చిదానందము బ్రహ్మానందమునకు భిన్నముకాదు.

బ్రహ్మానందము మోక్షము! ముక్తి బ్రహ్మానందము! దీనిసందుటకు సూచింపఁబడిన పంథలలో సేవ నేఁడు మిన్నయై యున్నది. సేవలన్నిఁటిలో సాహిత్యసేవ తలమానికమని సహస్రాబ్దులకుమున్ను భారతీయులు గుర్తించిరి! ముక్తిగర్భితమైన సారస్వతమునకు వలయు ప్రశాంత వాతావరణము నొసఁగునది ప్రకృతి. కావుననే ముక్తికాంక్షులగు మునులు గిరికందరములందును, గహనసీమలందును సారస్వతవధూటి నారాధించిరి. పాశ్చాత్యసీమయందలి రచయితలుకూడఁ గైతనెలంతను శాంతియుతశైలములందును, శైవలినీకూలములందును, గాసారతీరములందును గాంచిరి. పశ్చిమఖండ సాహిత్యమందలి Parnassus కనులపండువొనరించు మనఋష్యాశ్రమములకు వేఱుగాదు. పాశ్చాత్యకవుల Olympic heights మనహిమాద్రి శిఖరములకు భిన్నములు కావు. వారువాకొను Mount Sion or Zion ను, Aonian Mount (i. e. Hilican in Boetia, sacred to the Muses) ను మన తుషారశిఖరములకు వేఱుకావు. పాశ్చాత్య సారస్వతమున గోచరించు Siloa's సరోవరము మన మానససరోవరమునకు వ్యతిరేకము కాదు.

"Or if Sion Hill
Delight thee more, and Siloa's Brook (it was really a pool) that flow'd
Fast by the Oracle of God" —Paradise Lost.

"Soar
Above the Aonian Mount." —Milton.

"The waters of Siloah, that go softly"—Isaiah VII.6.

"Sisters of the sacred well, that from beneath the seat of Jove doth spring." —Lycidas.

పాశ్చాత్యకవుల Muse తానమూడుకల్హారములు భారతకవుల కవితాకాంత గ్రుంకులిడు నిందిందిరావాసములు..

ప్రస్తుతప్రపంచమునఁ బ్రాచీనభావములు విశేషపరివర్తన మందినవి. ముక్తిసాధనమునకై నట్టడవులందు నడయాడుట యనుచిత మనియు, జనసంకులప్రదేశములందును, సంఘరంగమందును సాధింపఁ బడుముక్తియే మహత్తరమైన దనియు 'గెటే'నాఁటనుండియుఁ గర్మ యోగులును, గవులును విశేషముగ గుర్తించిరి. కావున సారస్వతము వనమునుండి ప్రజాకార్యరంగమునకుఁ దరలెను. వనవిరాజితమై, సంఘసేవ్యంబైన సాహిత్యలక్ష్మి జీవనయాత్ర, జీవాత్మయాత్రకు ముఖ్యమగు ముక్తిసాధన మాయెను. దైవసామ్రాజ్యమైన హృద యము పరంజ్యోతిచే వెలుఁగొందుచున్నది. పరమాద్భుత మగునీపరం జ్యోతిని గుఱుతింపఁజేయు దివ్యజ్యోతి సాహిత్యజ్యోతి.

సాహిత్యజ్యోతి వాతూలరహితవనమందును, దుఃఖోద్రేకము గానిమానసమందును, దొలుత వెలుఁగ దొరఁకొనెను. పవిత్ర ప్రశాంతవాతావరణమున కవిభావము ప్రస్ఫుటించినది. దాని సౌరభము జగజ్జీవనమున వెల్లివిరియుటకు సమయము పట్టినను, అందలి యానందవీచికలు తొలుత వనభూములందుఁ దొలుకాడెను. అక్కరము లెఱుఁగని యనాగరకుఁడు సహస్రాబ్దములకుమున్ను బాలభాస్కర తేజమును గాంచి మహోల్లాసమున గంతులిడువాఁడు; కౌముదీవర్ష మున నోడలుమఱచి యానందగీతముల నాలాపించువాఁడు; వీను దోసిళ్ళ విహగగానమును నింపి, పచ్చికపాన్పులఁజేరి, కడునాతురమున హాయికరల్లి జుట్టువాఁడు. నభఃకాంతులను గాంచి పరమహంసవలె పరుగులిడువాఁడు; నటరాజులీల సృష్టిమోహనన్రుత్య మొనరించు వాఁడు. ఈతనికిఁ దన్మయత్వము మెసఁగి, యీతని నాత్మవిస్మృతుఁ

జేసి, స్వర్గరమ్యత్వము నీతనిచేతులందలి పసినిమ్మను జేసినది యాంత్రపు టఱపుగాదు, అచ్చునేరుపురుగాదు; వీనినృత్యమునందలి విచిత్రవలయము, అక్షరరూపముదాల్చని భావగర్భితమైన పంక్తి. ఈతనికన్నుల యెదుట లేనవ్వ లొలికించినది ప్రకృతిజవ్వని. ఇంద్రియకవాటములను భేదించుకొని, ప్రకృతిమహిళ వీనిహృదయసామ్రాజ్యమునఁ బట్టమహిషియై వెలసెను. తెరలుతెరలై యుబుకు పరితోషమును బట్టఁజాలక, రక్తాభఁ జల్లు తూరుపుదిక్కున కీతఁడు నాగిలపడువాఁడు. సౌరభ సౌందర్యముల నిధానమైన నవరసము వీని కులవేలుపు. వీని జీవితమును చేమంతిచేబంతి చేసికొనినది సృష్టిచిత్రము. అనంతమైన సృష్టిచిత్రమును తనచిన్నిగుండెయం దిముడ్చుకొని పూలరంగఁడై పొంగువాఁడీతఁడు. ఈతఁడు లేకున్న సృష్టివైభవమునకు గతి లేదు. సృష్టివైభవము లేనిచో వీనికి దిక్కులేదు. వీఁడు లేనిసృష్టి సున్న. సృష్టి లేనివీఁడు హుళక్కి. ఇరువురను జిత్రసంబంధసూత్రమునఁ గలుపుశక్తి సారస్వతము. భక్తియనుఁడు, అనురాగమనుఁడు, వివిధమతము లేమనిన 'భళీ!' యనుఁడు, 'భళాభళీ!' యనుఁడు, నామభావవిభేదములు సారస్వతాంగములు కావని తెలుపు టేరితరము ?

మనుష్యజీవనము భావబంధుర మగుసాహిత్యము! భావము లేనిబ్రదుకు కట్టెమోపు! భావము వాతూలమువంటిది! అదృశ్యమయ్యు, సృష్టిబాహ్యాంతరంగికచలనముల కిది హేతువు! ఇది లేకుండుట యాయువు మూఁడుట! ప్రకృతిచిత్రములందు వెడలిన భావమారుతమునందే మహత్తరమగు సారస్వతము జనించినది! వేదోపనిషత్తులును, స్మృతిశ్రుత్యాదిశాస్త్రములును బురాణేతిహాసాద్యుద్గ్రంథములును వనలక్ష్మియింటఁ బుట్టిన డింభకులు! భారతము కురుక్షేత్రమునఁ బుట్టిన దనుట కల్ల! రామాయణ మయోధ్యయందు

జనించిన దని వాకొనుట బూటకము! పోయి కురుక్షేత్రమును వెల్లగించిచూడుము. అందు భారతము సున్న! అయోధ్యను దలక్రిందులు చేయుఁడు. రామాయణ మందు గగనకుసుమము! భారతాంబ కనిన రాముని, భీముని, సీతను, కుంతిని మన కప్పన మొనరించినవి వాల్మీకివ్యాసులకలములు. వేదయుగమందును, పురాణయుగమందును నీకవికంఠీరవముల కలములచే వనపద్మినియే మనకు సారస్వతమును ప్రసాదించినది! భావవైభవము వనరమయందు విరాజిల్లుటచే,— విశేషించి ప్రాచీన కాలమున మనుష్యజీవనమందలి జీవకళ ప్రకృతి రమ్యాంగణమందే ప్రకాశ మగుటచే దిక్కాంతలకు మిఱుమిట్లు గొలిపిన సారస్వతపంక్తులు భాస్వన్మరీచికలట్లు మహితమనోహర మహీధ్రధామములనుండి ప్రసరించినవి! మనుష్యప్రకృతియందును, సాహిత్యప్రకృతియందును ప్రకృతిసీమంతిని మొనలేని భావమౌక్తికములను వెదఁజల్లెనని కేవలము భారతచరిత్రయేగాక, పశ్చిమప్రపంచేతిహాసముకూడ ఉగ్గడించుచున్నది! షేక్స్పియరు మహాకవి తనయద్భుతవిజ్ఞానమును ఏవన్ (Avon) నదీవీచికలందును స్ట్రేఫర్డ్ (Strafford) పల్లెప్రాంతమందలి ప్రకృతియోషామణి క్రోడతలమందును బడసెను! వర్డ్స్‌వర్ మహాకవి కొండసింగారమందు మునింగియుండువాఁడు! మిల్టన్, షెల్లి, గోల్డుస్మిత్, కీట్సు లిటలీమాధుర్యసౌందర్యములందుఁ గ్రుంకులిడిరి! నేపిల్స్‌లోని యానందలహరియం దీఁదులాడని కవి పాశ్చాత్యసీమయందు లేఁడు! మేఘసందేశమందలి మహాద్భుత ప్రకృతిసౌందర్యమును, జర్మనీ షేక్స్పియరును తాండవనృత్యమునఁ దేల్చిన కురంగపలాయనసహజవర్ణనమును, లంకనుండి పుష్పకమున నయోధ్యకు మరలుతఱి వైదేహికి రాముఁడు చూపిన ప్రమోదబంధుర దృశ్యములను మనపాలుకావించిన కవిసార్వభౌముఁడు కాళిదాసును,

సంతతధారగా జ్ఞాన, విజ్ఞానములను వర్షించిన హోమరు, ఎయిస్కిలీస్, సోఫోకిల్సు, డాంటే, వర్జిల్, షేక్స్పియరు, గెటే, షిల్లరు లాది పాశ్చాత్యసాహిత్యాచార్యులును, ఉత్తరరామచరిత్ర, కిరాతార్జునీయ, రత్నావళీప్రభృత్యుత్కృష్టగ్రంథములకు తండ్రులైన భవభూతి, భారవి, హర్షుడు మున్నగు కవికుంజరములును, రజతతరంగిణి, మనుచరిత్రాది గ్రంథరాజములందు శీతనగశోభను కలువడించిన కవితల్లజులును గనులకుంపు వొనరించు 'శాంతి నికేతనమున' నంచలరాయడై మన కన్నులయెదుటఁ బ్రథుకవీంద్రుడైన రవీంద్రుడును, గోదాపులినతలమందలి కవిపుంగవులును, నీవును వారును ననవేల, కాలవిహాయసమున భాస్వరజ్యోతులట్లు వెలుఁగు సారస్వతపట్టభద్రులు ప్రకృతిజనయిత్రి మధురదుగ్ధము లానినవారేకదా !

వనమునుండి వెడలి సాహిత్యము సంఘసేవకు నహుముగనైను. షేక్స్పియరుమహాకవి యుపదేశము లెవ్వియుఁ గావింపలేదు. నీతులు కలుపుట వానియలవాటుగాదు. తనచిత్తమువచ్చినరీతిఁగూన నతఁడు తనపాత్రలను సృష్టించుకొనలేదు. వివిధ మానసికశక్తిసంపన్నుఁడైన యాకవిచక్రవర్తి యున్నదున్నట్లు వాకొనెను. గెటేకవీంద్రుని మెఫిస్టోఫలీస్ పృథ్వియందులేఁడు. షిల్లరుకవిచంద్రుని రాబర్ ఊహాప్రపంచమందుమాత్రము గోచరించును ! కాని షేక్స్పియరుకవిసమ్రాట్టు యొక్క ఎడ్మండులయాగోలును, మూఁడవరిచార్డు మేక్ బెత్ సతులును ప్రపంచమందు ప్రత్యక్షవిభీషికలైయున్నారు ! షేక్స్పియరు పాత్రలు వట్టికల్పనలు కావు. (Vide : Bradley's masterly criticism on the four Great Tragedies) సహజగుణగంభీరరచనలందాతఁడు సత్యము వాకొనెను ! షేక్స్పియరుచేతి కంకణమైన సత్యమాతనికలమందలి దివ్యసారస్వతమాయెను. ప్రవంచనమును, దా్ఘా

త్న్యమును, ఆతని నాటకములను గొన్నింటిని రుధిరస్రవంతియందు ముంచివైచినవి! నిరుపేదలను విచ్చుకత్తుల కర్పించినవి! నిరీహుల నగ్ని కుండమున మాడ్చివైచినవి! నిర్భాగ్యులను లోఁతుగోతులందుఁ బూడ్చిపెట్టినవి! హేంలెట్ ఒఫీలియాలను, లియరు కార్డీలియాలను, ఒథెల్లో డెస్డిమోనాలను, కండకండలందును, కటికినెత్తురునందును ముంచిముంచి విడచిన షేక్స్పియరుకల మెంతకన్నీరైన నోడ్చి యుండును! తొలుతఁ దనయెడఁదను గాల్చుకొనియే షేక్స్పియరు తనవిషాదాంత నాటకములచేఁ బ్రపంచహృదయమునందుఁ జిచ్చువె ట్టెను! పొంగుపొంగు దుఃఖపూరముచే నిండిన తనగుండియను గ్రుమ్మ రించియే యతఁడు పృథ్వీహృదయము నార్తిచే నింపివైచెను! ప్రపం చమందలి నెగులు, పొగులు, దిగులుల సీలకంపునట్లు నోటఁబోసికొ నియే జగతియం దాతఁడు హాహాకారములు పుట్టించెను. వడకుఁ బుట్టించు ఘోరక్రియలను బూలవానలకుఁ బోల్చుటకు షేక్స్పియరు రక్తపిపాసువైనపిశాచము కాదు! అగ్నికణము మల్లెచెండు కాఁజా లునా? కన్నులందు చిచ్చుఁగొలుపు పొగలు కమ్మతెమ్మెర లెట్లగును? కర్ణపుటములు భేదించుకఠోరాక్రందనము కర్ణరసాయనగాన మనుట కెంత తెగువకావలెను? బూటకములను మాటలు గట్టుట యన్య కవులకు మాటలలోనిపనియైనను షేక్స్పియరునకుఁ జేతులలోని పనికాదు! భీషణముగ నగ్నిశిఖ లెగయుతఱి ముచ్చటకు వీణవా యించుటకు నీరో తెగించెను గాని షేక్స్పియరు తెగింపలేదు! మయూఖమును మించినతనుకాంతియందు, కుసుమముకంటె కోమల మైనయొమ్మునందు, మంచుకంటెఁ బరిశుభ్రమైనమనసునందుఁ, గల్వ ఱేకుల కెనయగు వాలుఁగన్నులందుఁ గ్రూరమగు శాతాసి గ్రుచ్చుకొనుచుండ జిలిబిలిపలుకులును, జిరునగవులును, బుడిబుడి

నుడువులును, జోజోయూఁపులును, లాలిపాటలును, చిట్టిబొట్టిముచ్చటలును జెనఁటికిఁ గాని షేక్స్పియరునకు సరిపడు టెట్లు? ఎందరో మనుజులు తలక్రిందులై వ్రేలుచు ఆమవడపులిహోరలు మెక్కు-చున్నారనియు, రెండున్నరతలలమానిసి యొకఁ డాకస్మికముగఁ జెట్టుబొత్తొల్లిలోఁ బుట్టి అటూత్తుగ నాకసమునకు సముద్రమునుదాపట మొనరించి పుట్టెఁడుటెంకమును గందిగుండెతో దిగమ్రింగెననియు, మహాపర్వతములు మాయిమిడిపిందెలై గొంతుకలో నదృశ్యమాయెననియు, పంటారు నంటిన వెన్న సూర్యరశ్మిచేఁ గ్రాఁగిగ్రాఁగి కుంభవృష్టిగఁ గురియ రాజసూయయాగమందలి పెసరట్లమోపులు తడిసి తట్టెఁడై రుచిదేరెననియు నేమేమో వింతచెత్త వ్రాసి కుంచములతో డబ్బుఁగొలపోయుచుఁ బండ్లికిలించి 'కస్తూరిరంగరంగా!' యను కవికూటమునకును, సత్యనిష్ఠాగరిష్ఠుఁడగు షేక్స్పియరునకును బంక్తిభోజనముల మాటుండఁ.గను చూపు లైన లేవు! ఆబద్ధపుతొక్కుడు కొంత మూఢజనులపైఁ బాఅవైచి, తంత్రపుఁగొట్టుబ్రదుకీడ్చుటకు షేక్స్పియరుకర్మ మంత కాల లేదు! మహత్తరమైనదయ్యు, సత్య మశ్రాంతము నవనీతమై యుండదని యామహాకవి నిరూపించెను. అన్యులకు దురూహ్యమగు మానవప్రకృతి నాతఁడు మన కన్నులయెదుటఁ బెట్టి పున్నెము గట్టుకొనెను! షేక్స్పియరు షేక్స్పియరెట్లు కాఁజాలెను? ఈఘోష యాతని కేలయందురా? కన్నీరు జాలువార్చుచుఁ గఠోరములై భయదములైన సత్యముల నాతఁడు పేర్కొని మానవసంఘమందు పైశాచికనృత్య మొనరించు పలుగాకులను ముంగలఁ బెట్టి, కలమాన్నమును భుజించి కండలు పెంచి నిర్లక్ష్యనిర్లజ్జాజీవనములు గడపువారి కనుఁబొరల నామహానీయుఁడు చీల్చివైచెను! దౌష్ట్యముం దాటితేటిన

నరాధములు ముక్తులు కాఁజాల రని యాతఁడు నిరూపించెను (Work of Nemesis). సంసారమునందలి ఘోరారిష్టములనులోకులు నిరుత్సాహులు కాకుండుటకై మహోదార మహితత్త్వము నాతఁడు తన కడపటిరచనాజీవనమున(The fourth period of his dramatic career) జూపెను! సర్వస్వమును గోలుపడి, దుహితను గూడి నిర్మానుష్యద్వీపమునఁ బడియుండి భయంకరఝంఝానిలమున నల్లాడిన ప్రాస్పెరో, (Vide: "The Tempest") తుదకు జగదీశుకరుణాపెంపున హృదయశాంతి నంది జీవనరహస్యార్థము గుఱుతించి నిజముక్తిని బడసెను. ఈ ముదుసలి జీవనమున నొక యద్భుతసత్యమును జూపి, ప్రపంచమునందలి ప్రజలనందఱిని మంత్రముగ్ధులఁ గావించిన తనకలమునకు (Shakespeare's pen and Prospero's magic wand are one, critics say) విశ్రాంతినొసఁగి షేక్స్పియరు నిజపల్లెకుఁ దరలెను. షేక్స్పియరు నాటకములు నేఁటికిని గ్రొత్తవై గోచరించుటకు హేతువవి సత్యసంఘటనాభూయిష్ఠములై ప్రకృతిహృదయమును బ్రతిఫలించునవియై యుండుటే—(The myriad-minded Shakespeare held up the mirror to Nature.) మానవప్రకృతిని కనివినియెఱుఁగని మహోదాత్తప్రజ్ఞను జూపి కవిసార్వభౌములకు సార్వభౌముఁడై మనుష్యులం దనిమిషుఁడై వెలిగిన యీమహాత్ముఁడు చేసిన యనన్యసామాన్యభాషాసేవ, సంఘసేవలే యీతనికిని మానవులందుఁ బల్వురకును ముక్తి నొసఁగినవి.

ప్రజాకంటకుఁ డగు ఛార్లెసు కెదురుగ విపులచమూసమూహమును నిలువంబెట్టినది మిల్టనుకవికలము! క్రాంవెల్ ఖడ్గము క్రాంవెల్తోనే శిథిలమైనది! మిల్టనుకలము పంచభూతములను మించిన ప్రజ్ఞ కలిగి, చిరస్థాయియైయున్నది! దేశారిష్టము నెఱిఁగి, యిటలీనుండి పర్వెత్తి

సంఘసేవకును, దేశసేవకును నాతఁడు తోడ్పడెను! తనకంటె నొరుల కల్యాణము మహత్తరమైనదని యోజించి కనులను సేవాతత్పరత కప్పన మొనరించెను. తనక్రియ భగవత్ప్రీతమైనదనియు, జగదీశుని కింకరుఁడై తాను జగతి కంపఁబడెననియు, కనులు లేని కాల్చేతులను బరిచర్యకై ప్రయోగింపకున్నను నొకచో నిలిచి సారస్వతప్రజ్ఞను జూపుచు దాఁజేయుసేవయే భగవంతునకు ముదావహమైయుండు ననియు స్పష్టవాక్కుల నాకవిసింహుఁడు (Vide: "On His Blindness"; "Milton's sonnet to Syriack Skinner" and "On his arriving at the age of twenty-three") పల్కెను. పతితుఁడైన మానవుఁడు జగదీశునికరుణ పెంపునఁ బునరుద్ధారణముఁ గాంచునని (Vide: "Paradise Regained") తెలిపి, సారస్వతసేవయందే మహోన్నత స్థితినంది (Vide: Wordsworth's "London 1802") మిల్టన్ నిజ ముక్తినిబడసెను. ఫ్రాన్సుసీమస్థులకు స్వాతంత్ర్యపటుత్వమును బోధించి ఆత్మగౌరవమందిరము వెసవారిని బురికొల్పినవి వాల్టేర్ రూసోల మేటి కలములు. రష్యాయం దాధ్యాత్మిక భావప్రసరణమును దొలుకాడించినది టాల్‌స్టాయ్ కలము. మనుజుని సర్వతోముఖజీవనమున నద్భుతమగు నాధ్యాత్మిక శక్తి తేజరిల్లెనని తెలిపి ఆంగ్లసంఘమునకును, మానవ సంఘమునకును, సాహిత్యపథమున నెంతేని సేవసలిపి రస్కిన్ మహాశయుఁడు తరించెను.

భావశక్తి యద్భుతమైనది. అగ్నికంటెఁ దేజోవంతమై, యది యగ్నివలె బుగ్గి కాఁజాలదు. భావము లేకున్న భౌతికప్రపంచముగాని, ఆధ్యాత్మికప్రపంచము గాని లేదు. మానసమున నొక్కమాఱుత్పత్తిన తలఁపు నేఁడుగాకున్న ఱేపైనను మహాద్భుతమగు ప్రపంచమును బుట్టించును. భావము లేనిక్రియ, ఉద్దేశము లేని యుద్యమము,

మతిమాలినమాట నగుఁబాటును, నుపద్రవమును నాపాదించును. కవి భావమయము. ఆతని సూక్ష్మదృష్టినుండి సృష్టియం దెట్టిదృశ్యముగాని, సంఘజీవనమం దెట్టి సంఘటనముగాని తప్పఁజాలదు! ఆతనిగమనము నకుఁ గాలస్థలపరిమితులు లేవు! తుషారబిందువునందును, పుష్పకేస రమందును, ఉడుగర్భమందును, మరీచికాంతియందునుగల జగదీశుని సౌందర్యమును మోచుకొని, తనరచనలందు కవి గ్రుమ్మరించును! కవి చేయఁజాలుసేవ మఱేమానవమాత్రునకు సాధ్యముకాదు! సృష్టికర్త కాతఁ డెందును దీసిపోఁడు.



# 3. సాహిత్యము-ముక్తిసాధనము

సాహిత్యము, తత్త్వశాస్త్రము కవలలు. తత్త్వభావగర్భితము గానిసాహిత్యము చొప్పమోపునొప్పున నుండును.—సాహిత్య గంధము లేనితత్త్వశాస్త్రము తాళ్ళగుట్టయై, యడలు పుట్టించును. రెంటికిని గలసంబంధము ప్రాచీనకాలమునుండియు నవిచ్ఛిన్నమై యున్నది. నిన్నను గాక మొన్న (Vide: Report about the recent Andhra University Commission) మేధాసంపన్నుఁ డగురాధాకృష్ణుఁడును, ప్రిన్సిపాలు థామసును నీభావమున "కౌను" ననిరి. వర్డ్స్‌వర్తుకవీంద్రుని ప్రతిపంక్తియుఁ దత్త్వభావమునఁ దొలుకాడు చుండును (Wordsworth's Pantheism). ఎట్టి నిరుత్సాహులకైన నాశాలోకముఁ జూపు బ్రౌనింగుకవిత్వ మెందఱునిర్జీవులను సజీవులఁ జేయ లేదు? (Browning's Optimism) అతులసౌందర్యలహరి (Keat's Hellinism) దొలుకాడించు కీట్సుకల మెందఱచింతలఁ గడిగివేయ లేదు? బైరన్ కవిచూపిన స్వాతంత్ర్యకాంతును బ్రశంసింపలేని మాన

వు లెందుఁగలరు ? ఈకవులందఱు నున్న తాదర్శముఁ జూపి పున్నముఁ గట్టుకొనలేదా ?

గీతాంజలి వ్రాసినరవీంద్రుఁడు తనగోడేమో వెడలఁ గక్కికొని బ్రదుకఁ దలఁపలేదు. గీతాంజలిభావములు పాశ్చాత్యులకుఁ గూడ మిఱుమిట్లు గొలిపినవి!—సువర్ణ మట్లు పృథ్విని నింపివైచినవి!! మణిమయూఖముల ట్టులు వసుమతి నలంకరించినవి !!! భారతమాంత దెసఁ బశ్చిమఖండముల నొక్కమాఱు సాఁగిలపడఁ జేసినది గీతాంజలి ! స్వార్థచింతయందు మునిఁగి మనుష్యత్వమునుండి దిగజాఱి, గభీరకలుషమునఁ గూలఁబడువారి కింత తత్త్వబోధ చేసినది గీతాంజలి !! భారతహృదయమందలి యద్భుతభావపూరముచే నొక్కపరి పశ్చిమలోకమును బవిత్రవంత మొనరించినది గీతాంజలి !! జగదీశుని మహిమముఁ గీర్తించి, నూతనయుగభావములను దశదిశల వెదఁజల్లి, విజ్ఞానము నుగ్గుఁగఁ బోసి, పల్వురకు ముక్తిమంత్రము నుపదేశించినది గీతాంజలి !!!!

ఇఁక మన వసురాయని భక్తచింతామణి ! వసుకవి యాంధ్రుఁడు ! ఎట్టికల్పద్రుమ మైనను, ఆంధ్రునకుఁ బెరటి చెట్టగుచో, మందున కైన దాని నాతఁడు ముట్టఁడు ! ఆంధ్రుఁ డేలొకో తనప్రాచీన మహత్త్వమును, దనప్రస్తుతప్రజ్ఞను, దనభావికర్తవ్యమును దనయాంధ్రత్వమును మఱచి, తనచూడ్కి తీవల నన్ని దిక్కులకు బిగించివైచెను! వసుకవి యేవంగసీమయందో పుట్టియుండుచో, వంగవాతావరణమందలి యద్భుతాశయములను దిగమ్రింగి ఉత్సాహవంతు లగుస్వీయసీమస్థుల ప్రోత్సాహమునం గలము ముంచి, రవియట్లే తానుఁగూడ యనురాగంపుటందల నెక్కి దిగంతవిశ్రాంత వసుప్రథలను వెదచిమ్మువాఁడు! భావగాంభీర్యమందును, దత్త్వబోధనమందును, భక్తచింతామణిపద్య

ములు కొన్న ప్రపంచసాహిత్యమందలి యేకవితకును దీసిపో వని యుచ్చైస్స్థానము నలంకరించిన, 'కాదు కా'దనువారును, 'నెల్లెల్ల'ని యనికొల్పువారును, 'సిదివట్టినవాల'ని బాపురు మనువారును నుందురేమో, వసుభాషమందలి లోతులందు వారిని ముంచివేయుటకు చెనకీయను! స్వార్థ సంగతసముక్తికే, వసుకవి దేవులాడ లేదు! తలఁపుజపమాలను, చనగుంచియయందుఁ ద్రిప్పకొనక, మాలను స్వార్థమునకోఁ బుటుక్కునఁ ద్రెంపి, యందలిపూసలను దశదిశల నీ కవిశేఖరుఁడు వెదచల్లెను! గుచ్ఛితించినవానికే పూసయందలి యగాధమైన యుపనిషత్తును, సద్యోజాతమగుపురుషార్థమును, ననిర్వాచనీయమైన పరమార్థమును ద్యోతకమగును. రవివసుకవులు తమరచనలమూలమున నిహలోకమందే ముక్తినందిరి.

సాహిత్యము ముక్తిసాధనమని నిరూపించుటకెన్నేని దృష్టాంతములను జెప్పఁగలను. అల్పమగుపసమయమందు విపుల మగుచర్చ సలుపుట వాంఛనీయము కాదు.—సూచనమాత్రమున సంతసింప నెంచితిని. విజ్ఞనమందు ప్రపంచము తలక్రిందులగుతఱిఁ దా నుద్భవింతు నని గీతాచార్యుఁడు పల్కెను గదా! ఆత్మజ్యోతితో వెలుఁగు శరీరరూపమును దాల్చెఁకపుడును, భావప్రభతోఁ దేజరిల్లు శబ్దరూపమును దాల్చెఁకపుడును, వివిధ దేశములందు, వివిధ సమయములందు జగదీశుఁడు గోచరించుచుంట ప్రసిద్ధవిషయము! భగవత్ప్రేరిత మగు కవితయందు, భగవంతుని యవతారము గోచరించి మలీమసమై యున్న మానవమానసమును దివ్యమరీచికాపూరమున స్నానమొనరించి పృథ్వికి ముక్తి చేకూర్చును! శైలపార్శ్వమున నాకస్మికముగ నిద్దురనుండి లేచిన కెయిడుమన్ (Caedmon) నోటనుండి వెడలిన కవితాస్రవంతి యెవ్వరిది? కెయిడ్మన్ నిరక్షరకుక్షియైన పల్లెవాసి

కాదా? సైనవుల్ఫ్ నేర్పిన దేమి? ప్రజలమనసులం దియ్యనికైతచే నానందవార్ధిని ముంచిన బర్న్స్ (Burns) నేర్చిన దేమి? తండ్రి తల ఋణములందు మునుంగునందాకం దనపల్లెయందలి గ్రామరు స్కూలులో షేక్స్పియరు నేర్చినయక్షరము లెన్ని? నేటిరవీంద్ర, బెర్నార్డ్షాలును, హావెల్స్, గాల్స్వర్దీలును, ఎప్పుడిగ్రీలు సంపాదించిరి? వీరిపలుకులును వీరిగీతములును వీరివి కావు. వీని కాధారముగాం గొని కొండొకశక్తి తనమహత్తరోద్రేకసిద్ధికై జలదగంభీర వాక్కుల వీరిముఖములనుండి వాగొనుచున్నది. పలుకువాడు నానైనను, పలికించెడిది దైవత మని పోతనామహాత్ముండు వచింపలేదా? మిల్టనుకవిచంద్రుండు సంబోధించిన Heavenly Muse ఎవరు?

> "Of man's First Disobedience, and the Fruit
> Of that Forbidden Tree, whose mortal taste
> Brought Death into the world, and all our woe,
> With loss of Eden, till one greater Man
> Restore us, and regain the blissful Seat,
> Sing *Heavenly Muse*" —Paradise Lost.

"తద్రయశక్తికిఁ మణులట్లు నెల్లప ననంతా!" అనినసుకవి యెవరి నుద్దేశించి పలికెను? "త్వదంఘ్రిసంస్మరణభాస్వద్రోచి" అని యాతం డనుటేల? హోమరును వర్జిలు కవిచంద్రులు మహోత్తరము లగు తమపురాణములందలి తొలిపలుకుల నేశక్తి నుద్దేశించి పల్కిరి? కవులకుం గవియైన (The poets' poet) స్పెన్సర్ సంబోధించిన Muse ఎవరు? షెల్లీకవీంద్రుం డుల్లేఖించిన యుద్వేగ మెట్టిది? (Vide Shelly's "Defence of poetry") నాస్తికుండని విశ్వవిద్యాలయమునుండి తఱుమఁబడిన యాకవిచంద్రుని నోటినుండి యాధ్యాత్మిక వాక్కుల నుచ్చరింపఁజేసిన దేశక్తి? వెమటిగోడ్చ్, యుస్సునస్సుని

చిట్టాలు పుచ్చి వ్రాయునది కవిత యనిపించుకొనదని తెలుపుట యందు హేతువు లేదా? అప్పకవీయసులక్షణసారములను దిగమ్రింగి నూతన కైత యుబ్బునా? ఆదమఱపుననున్నపుడు, ఆకస్మికముగ మానసమునఁ దళ్కొత్తుభావస్ఫూర్తి ప్రసరించుట తర్కశాస్త్రమునుండి కాని, భౌతికశాస్త్రమునుండి కాని గణగుణకారమునుండి కాని, కాక యనంతమై, యస్ఫుతమై, యాధ్యాత్మిక మైన శక్తినుండి కాదా? ఇట్టిశక్తి కవిమానసమందును, గవికలమునందును ప్రభాకలితమై యుండుటం దెట్టియుద్దేశము లేదు? ఇది తుచ్ఛమై, స్వార్థమైన యుద్దేశమా? మహత్తరమై, మహిమోపేతమై, పరార్థమై ముక్తిప్రదమైనయుత్కృష్టోద్దేశము కాదా? ఈ యుద్దేశము నీ తన్మయోద్వేగమును మిల్టనుకవి యెన్నిమాఱులు గుర్తింపలేదు?

" And hears the Muses in a ring,
Ay, round about Jove's Altar Sing "

—*Il Penseroso.*

(These lines indicate the sanctity of Poetic inspiration).

గ్రీకు, లాటిను కవులు వాకొను "Vates," "Scriptural investiture " ఎట్టిది?

" I thence
Invoke thy aid to my adventurous Song,
That with no middle fight intends to soar
... ... ... ... ...
... ... ... ... ...
And chiefly Thou O Spirit !"

—Milton.

In the 'Christian Doctrine', Milton explains what he means by this Spirit. He says that it is 'that impulse or voice of God by which the prophets were inspired.'

(Milton was always filled with the sanctity of the poet's vocation).

"Devout prayer to that Eternal Spirit, who can enrich with all utterance and Knowledge" *(The Reason of Church Government,* Book ii.)

కవిత్వమందలి యాధ్యాత్మికశక్తిని, బవిత్రోద్దేశమును, ముక్తి పంథను బాశ్చాత్యులే గుర్తించియుండఁ దత్త్వజ్ఞానమున నీఁదియీఁది తమయపూర్వరచనాశైవలినులను బృథ్వియం దెల్లకడలందుఁ బ్రవహింపఁజేసిన భారతకవులు గుర్తించియుండ లేదా? కవియాక్రందనమందును, నానందగానమందును గూడ మహితభావము తొలుకాడుచునే యుండును! "In Memoriam" టెన్నిసన్ కవియొక్క సొంత గోలయా? వసుకవి "సుతస్మృతిసతీస్మృతు"లు కుటుంబఘోషయగుచోఁ, గాల్వలై పాఱినకన్నీరు ముద్రాయంత్రమును దడిపి తడిపి పాషండులను, బాషాణములను, బాషాణముపగిది హృదయములను గరఁగించివైచెనేల? కటికిరాతికిఁ గుసుమకోమలత్వము నొసఁగునది కవిత్వము కాదా? ముక్కడిని ముముక్షువుఁ జేయునది కవనము కాదా? ముష్కరుని మునిపుంగవుఁ జేయునది కైత కాదా? క్రూరకిరాతుని వాల్మీకిఋషిని గావించినది కవిత కాదా? రాముపదమందలి కవితాభావస్పర్శచేఁ గదా పాషాణ మొకటి పావనగుణశోభితయైనయహల్య కాఁగలిగెను! సామాన్యకీటకమును ద్విరేఫరాజ మొనరించి, మధురఝంకృతులఁ బుట్టించునది ప్రసవహృదయమునఁ దొలుకాడు కవితాసుధ కాదా? కారుమొగులును కాంతికవుంగిలిని బంధించి ధునీదర్పమునఁ జిఱునవ్వులు చల్లునది కైత కాదా? కోఁయిలగొంతున గణయుతులు నింపి, గీతికాకళలను జగతిపైఁ గురిపించునది కవిత కాదా? పతికరస్పర్శచేఁ బులకితయైన కమలకాంతకంధరమున శిశిరతార

హారము నిడి, హాసనరేఖలకు రవిద్యుతులు కలిపి, తన్ను వరించిన సుందరహృదయమునకుఁ దలఁబ్రాలు వోసి, వాని తలఁపుఁదలఁబ్రాలు తాఁ గొని యలరునది కైతనెలంత కాదా? కడు మొఱకు వాని గాళిదాసుఁ గావించినది కవిత కాదా? ఐహికపునర్జీవనమును, హృదయకోమలత్వమును, భావోన్నతియు, ననురాగప్రభావము, నాధ్యాత్మికశక్తియు, మానసికోద్ధరణమును ముక్తిగాక మఱేమి?

కవి తల్లివంటివాఁడు! కటువులగు సత్యములను విజ్ఞానడింభకులకుఁ గలుపుటకుఁ గవి యెన్నిసివెరపులు రోయును. గోరుముద్దలకుఁ దోడు జనని జాబిల్లిపాటలను గలుపును! వెన్నముద్దలకు వెన్నెలముద్దలను జేర్చును!! నెయ్యిబువ్వకుఁ దన నెయ్యముఁ గలుపును!! దొడ్డ వస్తువులకు దోబూచిఁ జేరుచును!! ఏడుచుకున్నని జోలపాటలం దుఱ్ఱింత లూపును!!...జనయిత్రి హృదయముఁగల కవి సూక్తిసుధానిధి! కవిశేఖరుని యెడఁద కసుగాయలకంటెఁ గోమలమై, పవిత్రమై యుండును! కవిశేఖరుఁడు హృద్యమైనపద్యము! అందంపుటలంకారములందును, మధురోక్తులందును, వింతదోబూచులందును, చిత్రకథలందును, లాలనపాలనలందును, జాబిలిపాటలందును గలిపి గంభీరసత్యముల నాతఁడు ప్రజలచేఁ దినిపించును; భాషాజాతీయములందేమి, స్వాతంత్ర్యరచనయందేమి యాంధ్రతేజీనతిక్కన యెట్టిసారస్వతరహస్యములను మనకుఁ దెలుపలేదు? తేనెసోనలు గురిపించిన వేంకటకవి యెట్టియానందలహరిని మనహృదయముపై వర్షింపలేదు? ఇక్షుఖండము గాని బెండు గాదని వసుకవి మెప్పొసఁగిన సూరనార్యుని కవిత్వమం దెట్టిమహత్త్వము లేదు? పసుపుఁగూటిని బడదన్ని, యాత్మగౌరవరక్షణార్థము, మనుష్యత్వరక్షణార్థము, కటికిదరిద్రుఁడై, కావిశాటువులే, గుడ్డపేలికలే తనవి గాని చీనిచీనాంబరములును బట్టు

పుట్టములును గావని, యనన్యసాధ్యప్రజ్ఞను జూపి, తనధైర్యమును, దనస్థైర్యమును, దనసత్యనిష్ఠను, దనపరాకాష్ఠను, దనపరార్థచింతను, దనభక్తిని, దనకరుణను, దనయనురాగమును దనయపూర్వరచనా విదగ్ధతయం దత్యద్భుతముగ గురిపించి, పోతన చేసినబోధన, పోతన చూపిన దృష్టాంతము, పోతన కావించినసేవ, పోతన చూపినముక్తి పథ్యాతలమున నేకవి చూపెను? పోతనయందలి యద్భుతశక్తిని గీర్తింపని యాంధ్రుం డెవఁడు? 'నన్నయకు రాజరాజు కామధేనువు! తిక్కనకు మనుమసిద్ధి మందారము!! శ్రీనాథునకు హేమరాసులు చేతిలోనిదాసులు!!! ఇఁకఁ బోతన కెవ్వికల' వని నసుకవి యబ్బుర పడలేదా? విమలధిషణాధురంధరుఁ డగు రాధాకృష్ణుఁడు పోతనను దలఁచి, పోతనభక్తిని మెచ్చి, పోతనపద్యములు చదువుట నే నెఱుఁ గుదును. తెలుఁగున భాగవతము వ్రాసి తరింపు మని భగవంతుఁడు ప్రత్యక్షమై తనతోఁ జెలిపెనని పోతన వాకొనెను! భాగవతము పఠించి, పరమభాగవతులై, ముక్తిఁ గనినవా రెందఱు లేరు? గీతకంటె భారతభాగవతములును, భారతభాగవతములకంటె గీతయుఁ దన కెక్కుడై, తనజీవనమున కేడుగడలాయె నని మాలవ్యాపండితుఁడు, ముంగల వాకొనుట నేను మఱువలేదు. గీతయందలి కర్మబోధను, గర్తవ్యతత్త్వమును హృదయంగమ మొనరించుకొని, విజయజీవు లగుటకు నేఁడు పాశ్చాత్యఖండములం దెంద ఱాతురపడుటలేదు? మనసాహిత్యమరందమును జుఱ్ఱిజుఱ్ఱి, మేక్సిములరాది పాశ్చాత్యపండితులు జీవన్ముక్తులు కాలేదా? నములి నమలి, దిగ్రమింగవలయుపొత్తములు కొన్ని కల వనియుఁ బఠనము మనుజుని పరిపూర్ణుఁ జేయు ననియు బేకనుమహాశయుఁడు వ్రాకుచ్చెను! మనసాహిత్యము వెనఁ జూచితిమేని యిట్లుజుఱ్ఱవలయు పంక్తులును, పద్యములును నెన్నేని

గలవు. ఇంచుమించుగఁ బ్రపంచ మంతయు నజ్ఞానధ్వాంతమున మునిఁగియుండఁ దన విజ్ఞానద్యుతులచే దిక్కామినులకు మిఱుమిట్లు గొలిపి, తనయామ్నాయధ్యానములచే బ్రహ్మాండమును బ్రతిధ్వనింపఁ జేసిన భారతసారస్వతము నాఁడు బర్కుమహాశయుని, నేఁడు మేక్డొనాల్డును (Vide: Edmund Burke's Speech on the Impeachment of Warren Hastings and Ramsay Macdonald's Speech at the First Round Table Conference.) నాఁడును నేఁడును బర్కు పాశ్చాత్యులనే పరమప్రమోదసంభరితస్వాంతులఁ జేసి యెందఱెందఱికి ముక్తిపంథను జూపలేదు? శంకర, రామానుజ, మాధవాచార్య, మధ్వాచార్యులు తమయద్భుతరచనలచే నెందఱి కాధ్యాత్మికశక్తి నొసంగలేదు? ఆంధ్రులం దవతారమూర్తియైన త్యాగరాయ లెందఱికి ముక్తి మార్గము చూపలేదు? పామరులు పాడుకొను పాటలు వట్టిగాలిపాటలు కావని చెప్పనేల?

సారస్వతము శైవలినివంటిది. ఒక్కతీరున నొక్కయెడనే నిలిచినచో, నది ప్రజాళి కెట్టి యుపకృతి నొసఁగఁజాలదు. కాలవాహినితో సారస్వతఝరి పాఱిననాఁడే యది పరిపూర్ణత్వపదవీథిని జేరఁజాలును! కాళులు ముందులకు జరుగుతఱిఁ దల వెనుకకు విఱుచుకొను టేటిపాడి? అన్నియుద్యమములందు ముందంజ వేయునాంధ్రులు సాహిత్యోద్యమమున నింకను వెనుకాడియే యుండుట విషాదకరము. వడివడిగ జరుగు కాలచరణచిహ్నము లింకను మనసారస్వతమున నంకితము కాలేదు; సంఘజీవము; నేఁడు సారస్వతమున నంకితము కాలేదు. సంఘజీవము, నేఁడు సారస్వతఝరీమతల్లికి జీవవేగమును, భావపూరమును నొసఁగు నాశిక యాయెను! జీవనమును సాహిత్యమును నవిచ్ఛిన్నమైనవి. సంఘమందు గోచరించు

సంస్కరణములును, వింతలును, సారస్వతదర్పణమునఁ బ్రతిఫలించిన నాఁడే యందుఁ గ్రొందళుక్కులు నృత్యమొనరించును. గమనిక లేని ధుని మాంద్యపంకిలమయమై, జుగుప్సాగర్భితమై యుండును! ప్రపంచ మందుఁ బ్రతీతి వడసిన సాహిత్యములు విశాలభావవీచికావిలసిత ములై గాంగనిర్ఝరసదృశధారావేగమున నొప్పుచున్నవి. ఆంగ్లసాహి త్యమును బరికింపుఁడు.—అన్ని దేశములు, నన్ని కాలములు, నిరువదా అక్షరములందు ఛాయాప్రతిమలట్లు గోచరించుచున్నవి! ఇతరభాష లందలి చిత్రములను, బదములను, భావములను తనవి చేసికొనుట కాంగ్లసారస్వతము సంశయింపలేదు! ఇతరచోటులనుండి దుమ్ము దెచ్చి షేక్స్పియరు దానిని రంగారు బంగారుపొడి చేసెను! గంభీర భావవిలసితమై, సర్వాంగసుందరమై సృష్టికర్తయట్లు నేఁడాంగ్లము సర్వాంతర్యామియై, సర్వశక్తిమంతమైయున్నది! తక్కొరులు చూడ రాదనియు, నంటఁగూడ దనియుఁబలికి, మకిలిమడియందు వెలివెట్టి కొనియుండుచో నేఁ డాంగ్లసారస్వతము, షేక్స్పియరును గనిన సారస్వతము, కవిరవులం గనిన సారస్వతము, ప్రపంచసాహిత్య ములం దగ్రగణ్యమై జగజ్జేగీయమానమై యెట్లు భాసిల్లఁగలదు? పేరు గాని, రూపు గాని, యూరు గాని లేక, మైమఱ సింగుపాట లలో నిఱుకుకొని యున్న వంగసాహిత్యము సుమారేఁబదివత్సర ములలో భారతభాషలందు మిన్నయనిపించుకొని, ఖండాంతర విశ్వవిద్యాలయములందుఁ బఠనీయ మగుటకును, ఏసు గాని బుద్ధుఁడు గాని పుట్టకమున్ను, ఇలియట్ గాని బ్యూవుల్ఫ్ గాని గోచ రింపకమున్ను, నేఁడుప్రజ్ఞానిధుల మని విఱ్ఱవీఁగు వారితాతముత్తాత లడవులందాకలములు మెక్కుచుండ, నద్భుతప్రభావిలసితమై రాజ సభలం దేమి, ఋష్యాశ్రమములం దేమి, మధురమంజులనిస్వనముల

నాలాపితమై, గంభీర భావణములఁ బ్రతిధ్వనితమై, చరిత్రాంశములును, నితిహాసవిషయములును నటుండ నవగ్రహముల జోజోపాటలను, బృథ్వీకాంతజాతకచక్రమును భారతభూమియం దంతటను శిలాశాసనములందుఁ జూపి శతాబ్దులకును, సహస్రాబ్దులకును మిఱుమిట్లు గొలిపి, యిటీవలఁ బాశ్చాత్యులచేఁ బ్రాచ్యలాటి నని ప్రసిద్ధినందిన ఆంధ్ర మాంధ్రావని కవ్వల నొక్కయంగుల మైనను జరుగకుండుటకుఁ గారణ మేమి? నాకుఁ దల్లిమాటగాని వంగభాషయందుఁ గలిసి పోయిన యాంగ్ల పదముల నన్యభాషాశబ్దముల నెన్నేని చూపఁ గలను, కాని, జనని స్తన్యముతో ననుఁ జొచ్చి యుగ్గుఁబాలయందును, గలమాన్నమందును గలిసి, నారక్తమై, నాపలలమై, నాప్రాణమై చెలికారమందును, మమకారమందును, జెండాటలందును, జెమగుడు లందును నుప్పొంగి, యన్యరాష్ట్రములయందుసహితము ప్రథమ పూజ్య మైన నాయాంధ్రసారస్వతమునఁ జూపుటకుఁ దడవులాడు చుంటిని. ననుఁ గన్నతల్లి నాకు ముత్తవ్వవలెఁ దోఁచి నన్ను సిగ్గిలఁ జేయుచున్నది! సంఘజీవన మట్లు, సారస్వత మెన్నఁడును గ్రొత్త సోయగమున నలరారు టొప్పుగాని ముప్పుగాదు! గ్రీకుసంఘమును, గ్రీకుభాషయును నవనవోన్మేషములై తనరుటకుఁ గారణ మేమి? (Vide. Plato's "Republic.") త్రుప్పుపట్టిన పద్ధతులందు తమబొందె లను బొండసీళ్ళతోఁ గొట్టి, మిాఁగడతో ముంతమజ్జిని గూడ దిగ మ్రింగి, పూలమోపులతోఁ గూడ తాలుగుట్టను పైఁ బడవైచికొని యడుగు వెట్టఁజాలక మూల్గుచు వగర్చుచుండు కవులును, జరా మరణములను "దూ! దూ!!"యను సాహిత్యములును నెంతకాలము జీవించును? జాతిమతభేదములును, నంటరానితనమును, స్వీయకాంక్ష పరద్వేషములును సాహిత్యపుఁగుత్తుకకు విచ్చుకత్తులు! యుక్తాయుక్త

ములను విమర్శించి, యన్యభాషలందలి చిత్రములను భ్రాతృభావమునఁ గొని, తనవి గావించుకొని, తనస్వాతంత్ర్యమును దాను వృద్ధిఁ జేసికొనుటకుఁ బ్రతిసారస్వతమునకును హక్కు కలదు. తనతనయుల చేతులందుఁ దనసేవకులకరములందుఁ దాను ముక్తిపడయుని సారస్వత మెరుల కెట్లు ముక్తిదాయిని కాఁజాలును?

దేశపరిస్థితులందలి మార్పులును, గాలపరిస్థితులందలి పరివర్తనములును ప్రతియుగమందును, బ్రతిఖండమందును గోచరించుచునే యుండును. ప్రకృతిసౌందర్యమును, కళానైపుణ్యమును, భావసౌష్ఠవమును, గానమాధుర్యమును, మహోన్నతాదర్శములును నొక్కరిసొమ్ములు కావు. కాళిదాస షేక్స్పియరులు కవితామాతకడుపునఁ బుట్టిసకవలలు; రవీంద్రరోలండు లన్నదమ్ములు. వీరి కేజాతియు లేదు-- వీరన్నిజాతులకుఁ జెందినవారు. మనసంస్కృతమును దమ సంస్కృతమొనరించుకొనిన జర్మను లెందఱు లేరు? మనపాళీప్రాకృతములను దమప్రాకృతపాళీలఁ గావించుకొనిన బర్మీయులును, సింహళవాసులును, టిబెటనులును, జపానీయులును, చైనీయులును నెందఱు లేరు? ఆంగ్లమును దమ సొమ్ముఁ జేసికొనిన (వీరియాంధ్రాభిమానము సుడిగుండమునఁ బడినదే యందురా?) ఆంధ్రు లెందఱు లేరు? బ్రౌనుదొరకుఁ దెలుఁగుగోలయేలనియు, రవీంద్రరాధాకృష్ణుల కింగ్లీషుఘోష యేలయనియు వాకొని దురభిమానము మూతిముడుచుచో, బ్రౌను తెల్గులమన్ననల నందుటకును, రవీంద్రరాధాకృష్ణులును, భారతజనయిత్రియు నేఁడు పశ్చిమఖండముల జోహారులనందుటకును నవకాశ మెట్లుండును? సర్వజనసౌహార్దమును, సకలరాష్ట్రభ్రాతృత్వమును, సర్వమానవసంఘీభావమును సారస్వతమువలననే చేకుఱును. ఈసంఘీభావ,

మీసౌహార్ద్య, మీభ్రాతృత్వము చేపడిననాఁడే నేఁటి విప్లవమును, నేఁటిదురంతమును, నేఁటిదౌరాత్మ్యమును, నేఁటి దుఃఖమును రవి కాంతులు తోఁచినంతఁ బలాయన మగుకారుచీఁకటులట్లు పటాపంచలై, ప్రపంచమును శాంతియుత, సౌఖ్యయుత, సత్యయుతానంద యుతధామముఁ గావించివైచును! సచ్చిదానందము (సత్ + చిత్ + ఆనందము) విరాజిల్లిననాఁడే మానవుఁడును, మానవలోకమును ముక్తి నందుదురని తొలుతనే వాకొనియుంటిని. ఆదర్శములం దాదర్శమైన యీయాదర్శమును, ఉన్నతాశయములందు మహోన్నతమైన యీయాశయమును నేఁడు గాకున్న ఱేపైనఁ గరస్థలామలకముఁ గావించునది సారస్వత మని నాయాశ.



# 4. సాహితీగోష్ఠి

ఆలస్యమైన నేమి? ఆంధ్రవాఙ్మయమున నేటికికొంత సంచలనము కలిగినది. తెలుఁగునకు సంజీవి కావలెనని ఎల్లరును గుర్తించిరి. ప్రాత పుంతలోని అడుగును మళ్లించుకొననివారు ఎందోకాని లేరు. మాట పోకడకు కొంతమార్పుకావలెనని మనపండితులును గుర్తించిరి. ఇట్లని కొందఱు తెరవెలుపల తెలుపకున్న నేమి?

స్వేచ్ఛావాతూలము ఎంతహాయినిచ్చును! ఇష్టాగోష్ఠికి తగిన సమయము కదా యిది! ఆనందమయమైన ఈ ముహూర్తమున ఇంచుకంత సాహితీగోష్ఠి అసంగత మగునా?

నేటివాతావరణము భావబంధురమైనది. భావవ్యక్తీకరణ మునకు ఎన్ని తెరువులు లేవు? కళ లీ తెరువులలోనివి కావా? చిత్ర లేఖనము, సంగీతము, నృత్యము భావముతో తొలుకాడు కళలు కావా? సాహిత్యము మాత్రము?

పద్యరచనమును, గద్యరచనమును సాహితికి భుజకీర్తులు. మన పద్యరచనమున కొన్ని క్రొత్తపోకడలు చూపట్టినవి.

ఇవి అంతరంగమునకు సంబంధించినవి కావు.—వ్యక్తీ కరణవిధానమునకు చేరినవి. భావకవులను ఒక తెగకవులు నేఁడు పుట్టి రను అపోహ కలదు. భావకవిత యనిన, ఈవఱలో లేక ఇఁక పెరుఁగ వలసిన కవితయని కాదు. మనుష్యహృదయమును, ప్రకృతియును దంపతులట్లు కలిసికొనినపుడు కైత తోఁచినది. ఇట్టి నేస్తమున ఆనంద మును క్రోలినవారు నాఁడును ఉండిరి; నేఁడును ఉన్నారు. రేపును ఉందురు. వసుంధరయందు, సమయసమయములందు వీరి సంఖ్యలో హెచ్చుతగ్గులుండును.—అంతియే! నిదురించుచున్న శక్తి ఘనసంఘ

టనములం దుబికిన భావోద్రేకమునుండి పైకి తేలును. కాని ప్రకృతి కందనిశక్తిని తెచ్చిపెట్టుకొన్న రాదు. గొడ్డుగేదె అన్నికాలములం దును గొడ్డుగేదెయే! చిట్టువంటి చెత్తమీఁద నేకన్నులుగల కుకవుల యెదుట భావమెంత చేయును? భావోద్రేక మెంత జేయును?—యీ కవుల తెగ జడివానయందలి గేదెవలె చలనములేక పడియుండును. భావసంకీర్తన మందఱికిని సాధ్యముకాదు. కవిత్వమందఱికిని అలవడదు. కవిహృదయము వేఱు. ఈ హృదయము అంగడియందు లభించునదికాదు. ఒక రీయఁగలవాయనమని యెనఁదలఁపరాదు.

కవితగాని, భావకవితగాని, అపూర్వమైనదికాదు. "భావకవిత" "అగ్గినిప్పు"వంటిది. కవిత భావముకలది. భావములేనిది కవితకాదు. భావకవిత వొకటీ, అభావకవిత వేఱొకటీ లేదు. కవిత భావముకలదని వెనుకనుండి ఒక విశేషణము తాళము వేసి చెప్పవలెనా? భావధారలను ధారవోయు నేఁటియువకులును, నాఁటి నుండి పెరిఁగివచ్చు భావగంభీరులగు వృద్ధులును ఓకేతొట్టియం దూఁగు లాడు కవితాడింభకులు. నేఁటి వాఙ్మయోద్యమము కూడనికట్టు బాట్లను తెగఁగొట్టుటకై ఏర్పడినదిగాని సహజభావమునకు దిద్దుబాట్లు తెచ్చుటకై కాదు. భావకవులనిన చట్టుమను కొందఱువృద్ధకవులు నేఁ డున్నారు. వృద్ధకవులనుచూచి వెక్కిరించు భావకవులును ఉన్నారు. కవులకు విరోధమేల? ఒకరి నొకరు గుర్తింపక బండపోరునకు డీకొనిన అభిమన్యు ఘటోత్కచులు వీరు.

నూతనయుగ భావోద్రేకమువలన ఆంధ్రపద్యరచనమున కొంత చక్కఁదనము తోఁచుచున్నను, గద్యరచనమున ఇది ఇంకను పొడసూపుటలేదు. కారణము:—గద్యము నెడ తెలుఁగునేలలోఁగల అను

కిందమూడేసి'' అను పదములను'' వాడువారనేకులు మనసీమయందున్నారు. సాలిపేటలను, చాకలిపేటలను, గమళ్ళగూడెములను, ఈడిగగుడిసెలను, మాలపల్లెలను తిరిగి చూచితిమేని ఎన్నెనిరీతుల నుడువులు చెవిఁబడును.

స్థానస్థానములందలి భాషాభేదములు ఆంధ్రసీమయందు మెండుగా నున్నవి. గంజాము విశాఖపట్టణజిల్లాలందు ''అన్నదమ్ముడు'' ''అక్కచెల్లెలు'' ''వెళ్లిపోయివచ్చేశాడు'' ''పుల్లలావు'' ''పొత్తుపంచి'' అనుమాటలు వాడుకయందున్నవి. భూతకాలమునకుమారు వర్తమానకాల మొకప్పుడు తలయెత్తును. 'రాలేదు' అనుటకుమారు 'రావడంలేదు' అని యచటివారందురు. బాగుగ నుత్తరపల్లెలందు ఒరియాగాలి సోకుచుండును. గోదావరిజిల్లావాసుల ఆంధ్రము పరిశుభ్రమైనది. అయినను, వీరు దీర్ఘములుదీసి మాట్లాడుదురని ఇతరమండలములందలి తెలుఁగు లందురు. వీరిమాటకును బందరుగుంటూరు ప్రాంతములందలివారి మాటకును కొంత తేడా యున్నది. 'ఆలా అనిరి' అని గోదావరితీరవాసు లందురు. 'అట్లా అన్నారు' అని పల్నాడు మున్నగుచోటులందలివారందురు. ''నాకు సరిపడదు'' అనుటకుమారు ''నాకు పట్టదు'' అనువారున్నారు. ఇఁక నెల్లూరు చిత్తూరు మండలములను గుఱించి తెలుపనక్కరలేదు. వీరు తెలుఁగు కూడునందు అరవసాంబారు కలుపుదురు! వీరి తెలుఁగున ఆంధ్రరసముగాక అరవరసము పొంగుచుండును! దత్తమండలములందలి తెలుఁగు వేఱుతీఱున నడచుచున్నది. బొంబాయిరాజధానియందును, ధార్వారుమున్నగుచోటులందును, కేరళమందును దెలుఁగులున్నారు. వీరి వాడుకమాట వేఱొకరీతియందున్నది. రంగము తెలుఁగు రంగు దేఱియుండును. అన్యదేశములకు వలసపోయిన తెలుఁగులమాట చిత్ర

రీతినుండును. ఆంధ్రసాహిత్యమున వాడుకమాటలు చేరవలెనన్న, నెన్నితీఱుల మాటలో ప్రథమసంభావనకై ముందులకు పర్వెత్తుకొని వచ్చును. వంగసీమయందు వాడుకమాటల ప్రయోగమున కష్టమే లేదు. ఆంధ్రభాషయందు ఇచ్చవచ్చినరీతిని వాడుకమాటలను ప్రయోగింపవలెననిన, తలకు బొప్పితగులుట తథ్యము.

పాకీపానినిగుఱించిన వంగపద్యమును రవీంద్రుఁ డింగ్లీషులోని కనువాద మొనరించెనని కొంతకాలమునకుమున్ను జరిగిన కవితాసమితి సభలో శ్రీ గిడుగురామమూర్తిగారనిరి. పాకీపని పాకీవానికి దైనిక క్రియయే యయ్యు, మహాభక్తుల కాదర్శమైన మహాత్క్రియయని నేఁటి మహాపురుషులు గుర్తించుచుండిరి. తలవెండ్రుకలు పాకీచీపురు కావలెనని రామకృష్ణపరమహంస పలికెను. ఒకప్పుడు చాకలిపనియందు గోఖలే మెప్పుఁబడసిన గాంధిమహాత్ముఁడు పాకీపనియందు పాకీవాండ్రు తనకు సాటిరారని యిటీవలఁ బలికెను. గాంధిగారి జర్మన్ శిష్యురాలు (స్పిజిల్) వీథులు తుడిచి, మద్రాసుపౌరులకు అబ్బురముఁగొలిపెను. పాకీచీపురునకు నేఁడు గల గౌరవము వింజామరకు లేదు. వింజామరనంటిన వెండికంటె చీపురునుగూర్చిన కూరిమిసూత్రమగు తడపయే నేఁ డెక్కుడాదరము నందుచున్నది. కావుననే, తళ్కులనీను శైలికంటె తడపవంటి శైలికే నేఁ డధికాదరము చేకుఱుచున్నది.

తడపపై రవీంద్రున కాదరమున్నను, రవీంద్రుఁడు తడపను తలఁదాలప లేదు. ఈతని శిరోజములు వింజామర కేశములట్లును; వెండితీవల కెనయై యుండును. గాంధిజీవలె నీతఁడు పురీషభాండమును తలపైఁ దాల్చి, శాంతినికేతనమున కవ్వలఁ బాతిపెట్ట లేదు. ఈమహాత్కార్యమునఁ దాను గాంధిమ్రోల నేమియుఁగానని పృథుకవీంద్రుఁ డొప్పు

కొనెను. తనపాదరేణువుల నొరుల కిచ్చు రవికవి, కాంతివంతమగు శైలి సులభశైలి కెరలినట్లు గాంధిమ్రోల పలుమాఱు సాగిల పడెను. గాంధి క్రియాకామి, రవి భావకామి. భావము క్రియకు తొలిపుట్టువు. మలిజన్మమునఁగాని రవికవి గాంధి కాఁజాలఁడు. రవీంద్రుని శైలియందు గాంధి యాదర్శములు ప్రతిబింబించిననాఁడే, యిది శుద్ధఖద్దరువలెనుండును. రవీంద్రుఁడు ఖద్దరుధారి కాఁడని ఆచార్య రాయ్ మొరపెట్టెనుకదా! భావపోషణ కనువగు శైలిని రవీంద్రుఁడుపయోగించును. పసిబాలుర కేడేండ్లు పాఠములు చెప్పుతటి మిల్టన్ కవి **Paradise Lost** శైలిని ప్రయోగించెనా ? సందర్భమునుబట్టి రవీంద్రుని హృదయ మవసరమగు శైలి నల్లుకొనును. రవీంద్రుఁడొక్క-వాడుకమాటలకే అంజలి ఘటించెనని తెలుపుట పొరపాటు. తనకు మిగులఁ బ్రియమైనకథ "గల్పసప్తక్" యందలి హైమంతికథయని ఈతఁ డొకప్పుడు వచించెను. ఇందలి గభీరభావ మందఱికిని ఒలిచిన అనటిపండని తెలుపరాదు. కొలఁదిమాత్రపుమాటలచే సంఘసాహిత్య వసుంధరలందలి బహుళాంశముల నీతఁడు సూచించుపట్ల (యిట్టిశక్తి యందు మెకాలే దిట్ట) సామాన్యపాఠకులు వానిని హృదయంగమ మొనరించుకొందురనుట కల్ల. 'చోకేర్ బాలి', 'నౌకాడుబి', 'గోరా' మున్నగు ఈతని నవలలను (నవలారచనమున రవీంద్రుఁడు విజయుఁడు కాలేదు) తెఱచిచూడుఁడు. వాడుకమాటలును, వాడుకమాటలు కాని మాటలును వీనియం దున్నవని చదువరు లెఱుఁగకపోరు. రవీంద్రుని **"Creative unity", "Personality", "The Fugitive" "King of the Dark Chamber", "Crescent Moon" "Stray Birds", "Lover's Gift", "Broken Ties", "Sadhana", "Garden", "Cycle of Spring", "Fruit Gathering", "Chitra", "Mashi", "The Home and**

**the World", "Red Oleanders", "Hungry Stones", "Post Office." "Sacrifice", "Reminiscences", "Gitanjali", "Letters addressed to C. F. Andrews", "Essay on Nationalism", "Religion", "Man", etc.** ప్రతివాని కిని అర్థమగునని పలుకుట దబ్బర. ఈతనిగీతాంజలిలో నేమియులేదని, వాసిగాంచిన కొందఱు ఆంధ్రకవులు—కవులని పేర్కొ నఁబడు కవులు పలికిరి. పృథ్వీతలమందలి అధునాతన మహాత్మకృష్ట గ్రంథములలో నొక్కటియని ప్రసిద్ధినందిన గీతాంజలియందేమున్నదో ఈయాశుకవు లెఱింగిరా? రవి వాడుకలోనేయున్నాఁడు. రవి అందఱిని చేరుచునేయుండును. రవిని చేరఁగలిగినవారెందరున్నారు? ముక్తికి రవి ద్వారమని మన తత్త్వశాస్త్రము తెలుపుచున్నది. రవి యందుఁ బ్రవేశించి, రవితత్త్వమునుగ్రహించి, సారస్వతమందలి ముక్తియానందము నెందఱు గోలిరి? వట్టిమాటల పెనగులాటతోఁ గాలముఁబుచ్చు నేఁటి శైలివాదులు, భావగభీరతలోనికి తొంగి చూడని నేఁటి శైలివాదులు, వాడుకయగుట, వాడుక కాకపోవుటే భాషాతత్త్వమని యపోహపడు నేఁటి శైలివాదులు, భాషాపున రుద్ధరణమున భావపునరుద్ధరణ మవసరమని గుర్తింపని నేఁటి శైలి వాదులు హుమ్మించు రవిచెన నెగిరి మూతులు కాల్చుకొననేల?

వాడుకమాటయందు పూర్వపశ్చిమ వంగ భాగములందు వేఱుతేఱు లున్నవని తోడి తెలుగులకు తెలుపుదును. ఈ వాడుకమాటలు రెండు భాషల వాడుకమాటలట్లుండునుగాని, తెలుఁగువాడుకమాటలవలె నొకేభాషయందలి వేఱుతేఱునుడువులవలె నుండవు. పడమరబంగాళ మందలి భాషకును, తూర్పుబంగాళమందలి భాషకును పోలికయు లేదు. తూరుపువంగవాసి మాటలాడుచుండఁ బడమటి వంగీయుఁడు,

బంగాళ మెఱుఁగనివానివలెనే నోరుతెఱచుకొని నిలువంబడును! తూరుపు వంగీయులు తాము వ్రాయు పొత్తములందు పడమరవంగీయులు వాడుమాటనే ఉపయోగింతురు. అందుచేతనే వాడుకమాట పెనగులాట వంగసాహిత్యమున నుండ నేరదని వాకొనియుంటిని. చిత్తరంజనదాసు తూర్పువంగీయుఁడని వింటిని. దాసు, కవనమల్లువాఁడు. పశ్చిమవంగమునే యాతఁడు వాడెను. తద్భవములందును, తత్సమములందును, దేశ్యములందును, గ్రామ్యములందును, వికృతులందును, పెక్కురీతుల వాడుకమాటలందును ఎగుడుదిగుడునడకలు నడచు తెలుఁగులు, ఒరులకు లేక తమకే సంక్రమించియున్న యిబ్బందులను గుర్తించి, ఒరుల యొరవడి ననుకరించుతఱి, వీనిని తొలఁగించుకొనుటకు పూనుకొనరేని ప్రాతపుంతలును, ముండ్లపొదలును, కటికిగొప్పులును, బురదగోతులును తెలుఁగురచనకు తప్పవు. ఈ యిబ్బందులను గమనింపని గ్రంథకర్తల రచనలందు గోచరించు వాడుకమాటలు ఆంధ్రభూమిలోని కొన్నిచోటులలో స్థలజాతిప్రసంగ ప్రభేదములకతన కొఱుకుపడని కొయ్యలైయున్నవి.

రచయిత తెలుపు పలుకు లెల్లఱకు తెలియవలెననిన, బెండులవంటి నుడువులను, ఒరుగులపోలు పదములను అతఁడు ప్రయోగింపరాదు. చప్పిడినుడువులును, ఎండుమాటలును కళాకామినికి సహజములెట్లగును? కళ భావమయి; సౌందర్యమయి; భావసౌందర్యము అందంపుఁ బల్కులందుఁగాని ప్రస్ఫుటింపదు. హృదయమందు నందనసుఖమును గుమ్మరించు సుగంధము చక్కనిమల్లికనుండియు, మనోహరమగు గులాబినుండియు వెడలునుగాని, రోతపుట్టించు డొంకపువ్వులనుండికాదు. ముత్తెపుజేరులవలెనో, పొందామరసరుల పోలుపుననో, కెంపుతళ్కులు చిందు దాడిమగింజలపుంజమట్టులో, ముద్దు

గొల్పుపూగుత్తులపగిదినో, వివిధరాగరంజితశిశిరబిందుసందోహము చందముననో తోచు పదములవరుసమీఁదనే కావ్యకన్యకన్ను వేయును. సుఖమున్న గీతికాకళలే శ్రోతలవీనులందు హాయిని వోయును. సుఖముఁన్నపంక్తులే పఠితహృదయమున సుధాలహరిని ధారవోయును. సంగీతమెట్లు, ఎల్లరకు నలవడదో, సాహితియు నెల్ల మానవులకు నలవడదు. గానఝరియందలి మాధుర్యము నెల్లఱు నెట్లు గ్రోలఁజాలరో సాహితీసుధాధునియందలి తియ్యందనమును మను జులందఱు గుటకలు వేయఁజాలరు. కళాసందీప్తహృదయులకే సాహితీ సీమంతిని మిగులఁగూర్చు నెచ్చెలియగును. రససంభరితహృదయులు మధురసంగీతమును మెచ్చునట్లు, మధుమయసాహితిని మెచ్చెదరు. రసహృదయులనుచేరు సాహితి స్వయంవరసభాంగణమున పూల మాలఁ జేకొని నడచు పడతివడువున చక్కనిచుక్కయై యుండ వలెను. సద్గుణములను ప్రజలు మెచ్చునట్లే కళయును మెచ్చును. కాని సద్గుణములు సౌందర్యసందీప్త అంగప్రత్యంగములందే వెలయ వలెనని కళామహిళ కాంక్షించును. చక్కనైన కళ చక్కందనమునే వలచును. వికృతము దీనికి వికారము గొలుపును. కన్నుకుట్టనిరూపు లీ రూపవతికిఁ గిట్టవు. నవరత్నములను కళ అందంపు పట్టుపుట్టమందుఁ గట్టునుగాని, గోనుగుడ్డయందుఁ గాదు. భావబంధురనృత్యమున నాటితేటిన తెరవ యోర్తుక కాటుకరూపుఁ గలదేని, పక్కుమనని వారుండరు. కళకమల కెనయైనది. కావున పరిపూర్ణత్వమును, సంపూర్ణసౌందర్యమును వలచును. లోపములనుచూచి ఇది 'ఇసీ!' యనును. ఉపమకై చందురుని చేకొను కళోపాసకుఁడు షోడశకళా సంశోభిత రాకాసుధాకరునే తన సామగ్రియందు చేరుచుకొనును. గులాబిని పేర్కొనినపుడు, తప్పకప్పు వెట్టు డిఫెన్సులాయరువలె, నీతఁడు

ముల్లును గుఱించి కిక్కురుమనఁడు. అనినపో, కంటకమందు సంకట మనుకాక బ్రహ్మాండమంత తత్త్వభావ మున్నదని గడుసుకబురు లలోనికి దిగును. జగదీశుఁడు సృష్టియందేలకో చూపిన లోపములను దిద్దుటకు కళావతుఁ డనారత మాతురంపడుచుండును. హంసపాదు లును, కోతలును, కట్లును, పట్లును ఇతనికిఁ గిట్టవు. ఈతని చూడ్కి కనక మయూఖులకు పుట్టినిల్లు.—యీతనిహృదయము కాంతిమయమైన మిహిరమండలము. సౌందర్యమును, మాధుర్యమును, అద్భుత తేజ మును ముగురమ్మలై కళోపాసకుని కేలొడ్డుల నందును. ఈతని భావమును, ఈతనిపల్కును స్వర్గసౌందర్యము చిందు—కవి అమరుఁడు కాఁడూ?—వెల్వడును. కనుల పండు వొనరించు శశికిరణములందే సుధాధారలు చిందునట్లు తళ్కొత్తుపంక్తులందే కళావతుని భావ ద్యుతులు తొలఁకాడును. గీతికామాధుర్యమువిని ఆనందింపని (ఇట్టివారు నిష్ఠురహృదయులనినాఁడు షేక్స్పియరు) వారును, ప్రకృతిసౌందర్యమును చూచి ప్రఫుల్లహృదయులు కానివారును ఉన్నట్లే, సొగసుకత్తెవంటిశైలిని చూచి మెచ్చని అభాగులును ఉందురు. వెంగళప్పలమెప్పునకై వెఱ్ఱివేషములు వేయునటకుఁడు కళోపాసకుఁడు కాఁడు. కళాశూన్యులప్రశంసకై పొడిమాటలు దొరలించు బానిసవ్రాఁతకాఁడును కళోపాసకుఁడు కాఁడు. గంభీరభావప్రభాకలితమై, సుందరభాషావిభ్రాజితమైనశైలిని ఏ గుప్పెడుమంది మొండిపండితులో బండతనమునమెచ్చకపోయిన నేమి, సాహితీవిశ్వమందలి నక్షత్రమండితవిహాయసమని కోటియుగ ములు దానికి చేతులు మొగుచును. వ్యాసవాల్మీకి, హోమర్ మొయిన్ షెలిన్, డాంటే, వర్జిల్, కాళిదాసు షేక్స్పియరులాది ఆదర్శ కళోపాసకులశైలిని పఠించినవారు నానుడువునందలిసత్యము నవలీలగ గ్రహింపఁగలరు.

భావప్రకాశమునకు సముచితమైన భాష సాధనము కదా. భాషాగమనికకు వ్యాకరణసూత్రము లవసరములే. ఇవి కట్టుత్రాళ్లు కాక, పట్టుదారములట్లు మృదులములై, అనురాగసూత్రములట్లు అదృశ్యములై యుండవలెను. తెలుఁగక్కరములు ముత్తెములవంటివి. ముత్తెపు సరములోని దారము వెలుపలికి తోఁపనట్లు, తెలుఁగులోని లక్షణసూత్రములు బట్టబయలుకానపుడే తెలుఁగుశైలి చక్కనిదై యుండును. పగ్గములను, ఉరిత్రాళ్లను తెలుఁగన్నకంఠమునుండి పండితులు తొలఁగించుటపాడి. ఆంధ్రభాషాప్రపంచమున ద్వంద్వయుద్ధమునకు తొడరియున్న ఇరుపక్షములవారును తమదోసములు గుర్తించి ఉత్తమసారస్వతోద్దేశములకు తోడుపడు సూత్రములను శాసించుపట్ల నిరువురు చేతులుగలుపుకొని, విశ్వవిద్యాలయముల సాహాయ్యమందవలెను. ఇట్లొనరించిరేని, ఎన్నెని బాధలు తొలఁగిపోవును. వాడుకమాట సంగీకరింపని విశ్వవిద్యాలయములును, వాడుకమాటలనే అంగీకరించు గ్రంథాలయములును, విఱుగుడుమాటలను, త్రుంపుడుమాటలను కాంక్షించు భాషాసమితులును, వాడుకమాటలని చెప్పి వంకరమాటలను దెచ్చి సింహాసనముపైఁగూర్చుండఁబెట్టి చుట్టును రామభజనముచేయు అపూర్వభాషాభక్తులును పెడమొగములను బెట్టుకొనక, ఒకరిమొగముల నొకరు పరికించుకొని, వెక్కిరింతలకును, పండ్లపటపటలకును, కారుమాటలకును, కన్నెఱ్ఱలకును స్వస్తిచెప్పి, సొమ్మసిలియున్న భాషాసతికి శాంతియు, నానందమును ప్రసాదించిరేని, దారితెన్ను లేక అల్లాడు పాఠకులును, విద్యార్థులును ధన్యులగుదురు.

ప్రముఖు లందఱునుగూడి, తెలుఁగురూపును మాపుచేయు అమిత సంస్కృతపదజాలమునకు త్రోసిరా జనుట చెల్లును. తెలుఁగు

వ్రాయుతఱి విభక్తిప్రత్యయములనుమాత్రము తెలుఁగునుండి తెచ్చి, తక్కిన భాషనంతయు గీర్వాణమునుండి దిగుమతిచేయు నలవాటును రూపఱుఁజేయు సెక్షన్‌ను ఇండియన్ పీనల్ కోడ్‌లో వీరు ప్రవేశ పెట్టించినను, పెట్టింపవచ్చును. ఇట్లనిన, నోఱెత్తు బ్రదుకు బ్రదుకుఁ డనియు, తెలుఁగును చీఁకటికైదునం దుంపుఁడనియు నేను పలుకను. భారవహములైన నగలుదాల్చి, నేలఁగూలిన టూర్పియనుకన్యగాక తెలుఁగు తనకుఁగాని, తానుతాల్పఁజాలని సంస్కృతభారమును తలపైఁజేర్చుకొనక, అవసరమగుపట్ల సొంపుఁగూర్చు భూషలను ధరింపవలెననియే నాతలంపు. ఒక్కసంస్కృతమేగాక, అన్యభాషలు కూడ తెలుఁగునకు తోడ్పడినచో, మనతల్లిమాట గమనికకలదై యుండును. బంగాళమును పరికింపుఁడు. Chain, Table, Bracket మున్నగు మాటలకు వంగానువాదములు లేవు. ఆంగ్లపదములే వంగ మందుఁ గలిసిపోయినవి. ఒకప్పుడు కొంతస్వేచ్ఛయెఱిఁగిన తెలుఁగున నుర్దూమాటలు చేరినను, ఇటీవల నన్యభాషాపదములను మన పండితులు వెలివెట్టుచున్నారు. విశాలదృష్టిఁగల వీరేశలింగముగారు కూడ కలెక్టర్ పదమునువాడుట కిష్టపడక ''మండలకరగ్రాహి'' యని కటికిదాయివంటి ముక్కను విసరి, (''స్వీయచరిత్ర''ను చూడుఁడు) సామాన్యులకు బొప్పిగట్టించిరి. ఈకలెక్టర్ పదమునకుముందు టికెట్ అనిగాని, మఱికొన్ని విశేషణములుగాని ఉన్నయెడల, ఇనుపదారివలె తెలుఁగుశబ్దము పొడవెక్కును. భాషాశాసనమునకుఁ గడంగుమహానీయులు ఛాందసపు వ్రాఁతలందలి కష్టనిష్ఠురములను గుర్తింతురుగాక.

పదప్రయోగములను గుఱించిన శాసనము సాధ్యముగాని, శైలిని గుఱించినశాసనముకాదు. పదప్రయోగమే శైలియని ఊహించువారు పెక్కండ్రగుటవలనను, శైలియనఁ బదప్రయోగముగాకున్నను,

పదప్రయోగము శైలిలోనిది కావునను, త్రుప్పుపట్టిన కొన్ని ప్రాత కట్టుబాట్లు నేఁడు ఆంధ్రవాఙ్మయప్రపంచమున నెంతేని అనర్థమును దెచ్చుచుండుటచేతను, ఆధునాతనపరిస్థితుల ననుసరించిన భాషాశాసన మవసరమని తెలిపితిని. ప్రజాసేవకు ఒక్కవాడుకమాటయే అక్కర కలదను వారియుద్దేశము మహత్తరమైనదని వాకొనియేయుంటిని. ప్రజాసేవకై కావింపఁబడు నుపన్యాసములును, వ్రాయఁబడు ప్రాఁతలును మనమపేక్షింపకయే వాడుకమాటలందు వ్యక్తమగును. ఆర్థికపునరుద్ధరణమని ఎంచఁబడు ప్రజాసేవకుమాత్రమే సాహిత్యము ఉపయోగపడదు.

ప్రజాసేవ సారస్వతమందలి ఉద్దేశములలో నొక్కటైనను, సారస్వతము ప్రజాసేవమాత్రమే కాదు. సారస్వతము ఆధ్యాత్మికమైన కళ. సారస్వతము నిష్కామకర్మవంటిది. ఫలితమును ముందిడికొనియే అది తన సౌందర్యమును ప్రగుమ్మరింపదు. కళయొక్క సహజప్రకృతి ఆత్మవికాసము. ఇది యాత్మవికసనమునఁ బెంపారుతఱి ఒరులు అనంతానంద మందుదురు. కళయన కాంతికాదా? దీని నారగించుతఱి ప్రకృతి తన్మయనృత్య మొనరింపదా? కళయు, నానందమును హేతుఫలితములట్లు తోఁచుచున్నను, ఫలితము నభిలషించి హేతువు, తనహృదయమును విప్పుకొనదు. తనయైశ్వర్యమును తన యెడందయందు బిగించుకొనియుండుట కళాప్రకృతికి ప్రతికూలము. సహజగుణప్రకాశమున కళశోభిలునుగాని, తనగుణఫలములను తాను ముందేయూహించి, ఒరులప్రశంసను గాంక్షించికాదు. అడవిని వెన్నెలకాయదా? ఆత్మహృదిని వెడలించుట కౌముదిసహజగుణము. మానవుఁడు కనివిని యెఱుఁగని తావులందు చక్కని పూవులు కుసు

మించుటలేదా? ('Full many a flower is born to blush unseen.' Vide: Grey's 'Elegy') సుందరివదనము కవితావిభూతి నొప్పదా? తనదెస నొకరుచూచినను, చూడకున్నను, ఇంద్రధనువు నభోసీమంతిని కటిసీమయందు వివిధరాగరంజితవిచిత్రమేఖలయట్లు కాంతిలదా? తమ్మొకరు చూచినను, చూడకున్నను తమకొరులు చేటు తెచ్చినను, తేకున్నను, శిశిరబిందుసందోహములు ప్రభాతసమయములందు ప్రభాకరమరీచులనుగూడి, పచ్చికపానుపులపై పరితోషక్రీడలఁ దేలవా? ప్రాణులన్నియు నిదురించువేళ మిణుగురుపుర్వులు కారు చీఁకటులపై వింతకాంతులను విరఁజిమ్మవా? కవితాసంపదఁ గల హృదయము తన సహజసౌందర్యమును నలుకెలంకులందును కలువడింపదా? అడవిగాని మనసునందు, ఎడారిగాని యెడఁదయందు కళాదీప్తులు సార్థకమగును. ఎదుటి హృదయము నల్లరాయియని కళాకౌముది అమవసనిశియై బీతుఁగొలుపదు; తన రూపునకు చెఱుపుఁదెచ్చుకొనదు. కాని సమ్ముఖీనమైనది చంద్రకాంతశిలయైనచో, ఆత్మహృదినందుఁగాంచి అందలి హాయికరళ్లయందు చంద్రికయీఁదులాడును. తన్నుఁజూచి కులుకుకైరవసతికి పరిష్వంగ కిరణస్పర్శచే గిలిగింతలుగొలిపి, రజనీనిస్తబ్ధతయందు, ప్రణయప్రదీప్తకాసార పర్యంకమున కుసుమప్రియురాలిఁగూడి కవితావిలాసములఁజొక్కును.

సారస్వతాత్మయగు కవిత్వము పుస్తకములు చదివినందువలనఁగాని, ఆచార్యప్రబోధమువలనఁగాని ప్రసన్నగాదు. బోధవలనఁగాని, కృషివలనఁగాని, పూవులను, జాబిలి రేకలను, మంచుతుంపురులను, ముత్తియపుదొంతరలను పుట్టింపఁగలవా రుండుచో, పాతముల

ఈనుడువు కవిత్వమునకును, సారస్వతమునకుమాత్రమే కాక, తోడి కళలగు సంగీత చిత్రలేఖనములకుఁగూడఁ జెల్లును.

భాష భావముయొక్క బాహ్యరూపమై యుండ సుందరమైన భావమును వెలువరించు భాష సుందరమైయుండక వేఱుతీఱున నుండునా? కవి, తనమాటలను తా నెన్నుకొనఁడు. వాఁడుకమాటేమో, వాడుకమాటకానిదేమో అతఁడు లక్షింపఁడు. కవివాక్కు, కవిది కాక, కవియెడందదని కవిత్వ మెఱింగినవా రెఱుఁగుదురు. ఒకవిధమైన శైలి వ్రాయవలెనని గట్టిగఁ గూర్చున్నవాఁడు కవియేకాఁడు. గణములను పేర్చి, అక్కరములను లెక్కించి, యతిస్థానమును కన్గొని, ప్రాస యతినూహించి, వచ్చినపదములను పంక్తులం దిరికించి, పద్దెములు వ్రాయు మహానీయుని కైత సహజమై, ఆత్మవికాస మొందు నెమలి పింఛముకాక, కాకిఱెక్కల కట్టయగును.

నిరంకుశత్వము విజృంభించునపుడు, విప్లవము రేకెత్తును. దేశచరిత్రలును, భాషాకాహినులును ఈసత్యమును వేనోళుల రూఢి పఱచుచున్నవి. కొంతకాలమునుండి మన నేలయందు భాషానిరంకుశత్వము సాగుచున్నది. కావున విప్లవముకూడ తలసూపినది. శబ్దైశ్వర్యము కీర్తిచంద్రికలను గోరుముద్దలట్లు తినిపించునని యెంచి, మన పండితులు పల్వురు కొండలవంటి నిఘంటువులను, అమరకోశములను త్రవ్వి గుట్టలాదిపదములను మనసులందుఁ జేర వేసికొనిరి. మఱుగునఁ దాము రాల్చు చెమ్మటబొట్టులు ప్రత్యక్షప్రపంచమందు కుంభవృష్టిగఁ గురియు ప్రతిభాధారలు కావలెననియెంచు రచయితలు శ్రమించి సంపాదించిన శబ్దసామగ్రిని తమగ్రంథములందు కొల్లలుగ బోర్లించిరి.

భాషాభూగోళమునఁ గూలినాలిచేసికొని బ్రదుకువాఁడు కళోపాసకుఁడు కాఁడు. కళావ్రతుఁడు ఫలము కాంక్షించి తపోభూమియైన తనపఠనాగారమునఁ బ్రవేశింపఁడు. తపసికంటె నితఁడు ఘనుఁడు. తపసి వరములు కోరును. కళావ్రతునిదృష్టియందు మెఱు

పులు తళ్కొత్తించు వరములు లేవు. కొంతకాలము నిష్కామయోగిగా మై వరలి, పదంపడి ఈతఁడు పైమెట్టుపైఁ గాలువెట్టును. నిష్కామయోగి తలవాంచి కర్తవ్యము నారాధించును. ఈతఁడును, ఈతని కర్తవ్యమును నొక్కండుగావు. తాను కాని దాని నక్కునఁ బట్టియుఁ, బూజించియు, దాని నంది ఇతఁడు తరించును. కళోపాసకుని చెయువునకును, ఆతని వ్యక్తిత్వమునకు అవినాభావసంబంధమున్నది. పాశ్చాత్య తాత్త్వికులు తెలుపు Subject, Object లీతనిపట్ల విభిన్నములు కావు. మనశ్శాస్త్రము (Psychology) తెలుపు Auto-Suggestion యీతని మనసున అనివార్యమై పొడసూపనక్కర లేదు. అవ్వలఁగాని అంతరంగమునఁగాని నీ క్రియ చేయుమని పోరు నిరంకుశత్వము నీతఁ డెఱుఁగఁడు. నిష్కామయోగి కుండు మహత్తర ఆంతరంగిక ప్రోత్సాహము ఈతని హృదయమునఁ దోఁచి, కాలక్రమమున హృదయ గ్రథనము కలిసిపోయిన అదృశ్యభావస్థాయివై యున్నది. కావున కళోపాసకుని క్రియ నైసర్గికమని నొక్కి వక్కాణింతును. నిష్కామ యోగి యైహికజీవనమందలి క్రమ తపసి. ఈతని ఘట్టమును దాటి ఆంతరంగిక పూర్ణత్వసిద్ధినందిన మహానుభావుఁడు ఆదర్శకళోపాసకుఁడు. ఎదుటఫలమునుగాని, వెనుక ప్రోద్బలమునుగాని చూడక యే, విజ్ఞాననిక్షేపములైన గ్రంథములను పరిశీలించియు, విస్తృత పృథ్వీభాగములను పరికించియు, విభిన్నప్రకృతులను పఠించియు, నూతనభావసృష్టిని వెడలించియు, కళోపాసకుఁడు తనజీవనమును కడపివేయును. ఈతనిచేత ఈతని సహజప్రకృతి ననుసరించియే పొడసూపునదికావున, నొకవైపునుండి కడుపుకాలుచున్నను, తలపై పిడుగులు డుల్లిపడుచున్నను, తన కలము నితఁడు పరిత్యజింపఁడు. "మతము, పట్టిదైన కడుపుకు కా"దని రామకృష్ణపరమ

హంస యగునాఁడు. ఈ ప్రబోధము కళోపాసకునిపట్ల చెల్లదు. ఇతఁడు ప్రబోధపుట్టమునుండి కడచినాఁడుకదా! ఆదర్శకళా వ్రతుల జీవనములను పరికించితిమేని, "కాలుచున్నకడుపులకే కళో పాసన మేమో!" అనిపించును. కటికచీఁకటియందు గ్రుక్కఁబడినను, భావభాస్వన్మరీచికలతో నద్భుతదృశ్యముల నల్లుకొని ఇతఁడు కులు కును. సారస్వతవిశ్వమం దీతఁడు పరమహంస.—తపసిదృష్టియందలి మజిలీలనుదాటిన మహాత్ముఁడు. పరమహంస కిది యున్న నేమి, లేకున్న నేమి? ఆత్మభావసమాధియందు మునింగిన కళావ్రతునకు మెతుకుల ఘోషయును, కట్టుపుట్టముల నాతురపాటును నుండునా? పరమ హంస, కర్మను దాటిన మహనీయుఁడు; ప్రత్యక్షభగవంతుఁడనుట కానికూత కాదు. "ముక్కుమూసి ప్రార్థింపుము; నడ్డివంచి ధ్యానిం పుము" అని వెఱ్ఱులును, పలుగాకులునుగాక వివేకులును, సహృదయు లును ఈతని కానవెట్టెదరా? 'నీ రచన మిట్లుండవలెను. నీ భావ మట్లుండవలెను' అని కళోపాసకునిచే డ్రిల్లుచేయించు టెట్టివారికి? శైలిదిద్దుబాట్లు తొలుతపేర్కొనిన బండపండితునకుగాని, ప్రత్యక్ష జగదీశుఁడైన కళోపాసకునకు కాదు. స్వయంభువునకు ముక్కు చెవు లను తీర్చి దిద్దువా రెవ్వరు? రమ్యప్రకృతికి రంగులసవరణలు చేయు వారెవ్వరు? కళావ్రతుని శైలి సహజసృష్టినందిన భావవర్ణవితానము. దీనికా హంసపాదులు? కళ నెఱుఁగక, భావ మెఱుఁగక ఎందుండియో, యేటి ప్రోగొనరించుకొనిన మాటలచే రోతదడిని గట్టి,రూపుచూపులు కొఱవడిన కూలిపండితునిచేఁబట్టి, ఇష్టమువచ్చినట్లు ఊగిసలాడింపుఁడు. దేవురించికట్టిన తడపలను త్రెంచుట సుసాధ్యము. హృదయాకాశము నుండిప్రసరించిన కిరణపంక్తిని తున్కలుచేయుట సాధ్యమా? "మొండి పాండితిని వదలి, సులభవాక్యల నుచ్చరింపు'మని సహజభావమును

గాని, సహజపదప్రయోగమునుగాని, యెఱుఁగని మొఱకునకును, మోటువానికి తెలుపవలెను. తెలిసినగాని, భావవంద్యుఁడైన ఆ మహాశయుఁడు రాళ్లను కని సాహితీవసుంధరయందు మసలముఁ దెచ్చి పెట్టును. పరంజ్యోతిస్వరూపమునకు గ్రుడ్డిదీపములు పాఠములు చెప్పినట్లు, కళోపాసకునకు రచనాసూత్రములు కఱపఁదలఁచుట అవివేకము.

కళోపాసకుఁడు జగదీశున కెనయైనవాఁ డంటెనిగదా! జగదీశుఁ డొంట్రెత్తు బ్రదుకును కాంక్షించువాఁడు కాఁడు; బహుళసంఖ్యాకులను సృష్టించి, వారితో లీలలఁ దేలుచుండును. భక్తుఁడు భగవంతుని జేరఁ గాంక్షించునట్లు భగవంతుఁడు భక్తునిఁ జేర మక్కువపడును; భక్తులందు మసలుటకై, సుఖదుఃఖములను దెచ్చిపెట్టు రక్తమాంసములను గట్టుకొని అవతారములు దాల్చును. ప్రజానీకము తనకు కాదని, కళోపాసకుఁడు తన విహాయసమున తాను విహరించి, తుదకు మొగలుగములందే తన రెక్కలు తునకలు చేసికొనఁడు. వినువీధి నెగయువాఁడైనను, కవివిహంగ మవనిపై చూడ్కులు పఱపును. చెప్పనేల? తనదృగ్జాలమున ధరిత్రిని లాగి, తనతో దానిని హద్దులేని స్థలకాలములగుండా యిచ్చవచ్చినచోటునకు గొంపోవును. భావశక్తిగల కళోపాసకులే పృథ్వీజనులను తమ రొమ్ములఁ జేర్చుకొందురు. తాము సృష్టించినభువనమందు వారికి సుఖావాస మేర్పఱతురు. ఎపుడో పుడమిలో పుట్టిన వ్యాసవాల్మీకులశక్తి యెట్టిదోగాని, వారు సృష్టించి వెడలిన రెండు సాహిత్యబ్రహ్మాండములందును, బహుళశతాబ్దపథము నుండి సాగివచ్చు భారతీయులును, అన్యదేశీయులునుగూడ వెలయుచున్నారు!

జగతితో సంపర్కముఁగల కళోపాసకుఁడు జగత్స్థితినికూడ పరికింపవలెను. తనసామగ్రిని విశేషించి అందుండియే గైకొనవలెను.

షేక్స్పియరాదులు జగతిరుచిని విశేషముగ పాటించిరి. దురదృష్టవశాత్తూ ఆంధ్రసాహితీజగతి నేడు చక్కనై, సత్తువకలదై యుండలేదు. వంగసాహితీవసుమతి విశేషాభివృద్ధినందినదికావున వంగకళోపాసకులు సత్వరానందము నందఁగలుగుచున్నారు.

తామరలున్న చెర్వునందే దినమణితేజము సార్థకమగును. సరోజము లెఱుఁగని సూర్యుఁడు గోపికలఁ జూడని కృష్ణునట్లు వ్యర్థుఁడై యుండును. కృష్ణసంశ్లేషముకలిన గోపికహృదయము విరియును. తరణికిరణము తాకినంతన,—ప్రభాకరమరీచికాచుంబనము సోకినంతన, నైశవిరహమున స్రుక్కి ఖిన్నమైయున్న పద్మము ప్రఫుల్లముఖ యగును. అరవిందమును తన చేడియఁ జేసికొని మురియువాఁడు భాస్కరుఁడు. కుంతిపోలు కుట్మలములను చేరి, మొగ్గనుండి కవచకుండలధారియైనభావమును సృష్టించువాఁడు విశ్వకవియైన రవి. ఈ మొగ్గగాని, ఆ తామరగాని లేనితఱి క్రుద్ధుఁడై, సూర్యభగవానుఁ డేయెడారిలోనో భగ్గుభగ్గున మండిపడును. తన్నాహ్వానించి, తనవలన తరించి, తన్ను తనుపు కమలకహ్లార సన్నిభ సాహితీవసుమతిని గాంచని కవి భగ్నమనోరథుఁడై ఎదుటఁదోఁచు మరుభూమియందు భగ్గున మండును. సభ్యతాలోకమునందినపుడును, విజ్ఞానవాతూలము వీచినపుడును, ప్రజాహృదయము ప్రఫుల్లమై, జగచ్చక్షువున కేనమైన కళోపాసకునకానందముఁ గొలుపును. ఆతని జీవనమును సార్థక మొనరించును. తన్నుగుర్తించి, తన్నాదరించు ప్రజాహృదయముకై, తన తలఁపు ననలుకొని, తనపై సంతసవసంతముఁ జిల్కరించు సాహిత్యధరిత్రీ పురంధ్రికై, సంఘజీవియైనకవియువకుఁడు తల్లడిల్లును. రంగారురూపున నిది కనులెదుటఁ దోఁచుదనుక నీతఁడు తన రెక్కల నించుక కత్తిరించియైనను, ప్రజాహృదిని జేరును. చేరుతఱి జనవత్సలుఁడైన కళో

పాసకుఁడు భక్తవత్సలుఁడైన భగవంతునకు సరిపోలును. భక్తవత్స లుఁడు రక్తమాంసముల యావరణమందు చిరకాలము ఖైదీయై యుండఁడు. అవతారమును చాలించి భక్తులఁ దనతో వైకుంఠమునకుఁ గొంపోవును. కవియును సారస్వతోపాసకులను తనభావబృందావన మునకు కొనిపోవును.

భక్తుల తెఱఁగుఁజూచి, ప్రజలు సాహిత్యోపాసకులు కావలెను. జగదీశునిభక్తులు చేరఁ గాంక్షించునట్లు వీరు కవిని చేరవలెనని మక్కువ పడవలెను. నరకమందు నిలుచువారికి ఈశ్వరతేజ మెట్లు లభించును? లోఁతుగోఁతులందు నిలిచి, తమకడకు కవికంఠీరవుఁడు దిగి, తనతలంపు లను తమకు తెలియునట్లు తెలుపవలెనని ప్రజలు కోరఁజనదు. వీరి వేఁడికోలున కొడఁబడుకవి పతితులతో సముఁ డనిపించుకొనునుగాని వారి నుద్ధరింపఁజాలఁడు. తమవిజ్ఞానమును, తమ విచక్షణాశక్తిని వృద్ధిఁ జేసికొని, తమపై కన్ను వేసిన రచయితదెస చరచర వీరెగఁబ్రాఁక వలెను. స్వయంయత్న మహత్త్వమును గుర్తించిన సారస్వతాభిలాషు లకుత్థానము కలుగుట కాలస్యము కాదు. సాహిత్యాభిలాషులును, కళోపాసకుఁడును పరస్పరసంబంధమందలి అశేషాభ్యుదయమును గుర్తించిరేని, రచయితశైలి నిమ్నతలమున ప్రాకులాడవలెనను వాదన తనంతఁ దాను మడియును.

కవిశైలిని నిర్దిష్ట మొనరించునది కవియంతరంగముకాని, కవి యెన్నఁడో వర్ణించిన అమరకోశముకాదు. వ్యాకరణమునుండి కొల బద్దనుదీసి కొలిచితిమేని, ఈతనిశైలియందు భాషాస్ఖాలిత్యములు తోఁపవచ్చును. ఇవి దోషములని వైయాకరణులు కనులెఱ్ఱఁజేసినను, నిరంకుశత్వము నల్లేరుమీఁదిబండియై కవిపై పడినను, కవి, కన్నెత్తి చూడక తనభావమున తాను మునిఁగియుండును. సింధు వుమీఁది అలలను, చారలను, భీషణవాతూలమును లోఁగల గభీరశాంతి ఎన్నఁ

డైన కన్నెత్తి చూచునా? కాలుచున్న కరుకోలను మీఁదికెత్తినను, కవి తనప్రకృతిని తానుమార్చుకొనఁజాలఁడు. తనప్రకృతిని మార్చుకొననికవి, తనమాటల నోరులు చేఁబూనిన తక్కెడలందుంచి, మొగ్గుఁజూచుకొని, వానినేలుకొనుట కిచ్ఛగింపఁడు. కవియనఁ బద్యకవియేగాక గద్యకవియనికూడ తెలిసికొనుట కలవాటుపడని ఆంధ్రభాషాశాసకులు సహజభావవిభూతి నొప్పులేఖకునకు శైలిని చెప్పసాహసించుట దుడుకుదనమునకుఁ దలపడుటనియు, వ్యర్థపాండిత్యమును చలాయించుటనియు, తలదిరుగుడు నిరంకుశత్వమును విజృంభించుటనియు, సాహితీహృది నెఱుఁగక మాటలగుట్టపైఁ బోరలాడి, ఒరులను పోరలాడించుటనియు, తమసామర్థ్యమును తామెఱుఁగక ఒరులతలకు తప్పులుకట్టుటనియు, తమసంఖ్య అధికమై, తమశక్తి మిన్నయై, తమపలుకుబడి గొప్పదై, తమనోరుపెద్దదై, తమ యచ్చుయంత్రములును, తమప్రయోగాస్త్రములును ఒరులకు బహిష్కారణాస్త్రములై, తమ్ముగట్టెక్కించి, ఒరులను లోఁతుగోఁతిలోఁ త్రోయునని విఱ్ఱవీగి, తెయ్యిమనుట తమ కరుణావంధ్యత్వమును, తమ యసురనిష్ఠురతను వెల్లడించుటనియు గుర్తించి, యిఁకముందు తప్పుడుబ్రదుకునుండియు, తాఱుమాఱు తెరువులనుండియు తొలఁగి, విశాలదృష్టిఁగలిగి, యుక్తాయుక్తవిచక్షణదక్షులై మెలఁగుదురుగాక! శైలినిగుఱించిన నేఁటికయ్యము ఆంధ్రసీమనుండి అచిరములో నంతర్హితమై, సాహిత్యయోషకు స్వాతంత్ర్యమును, సౌందర్యమును, సౌష్ఠవమును చేకూర్చుటకు భాషాసేవకులను, ప్రజాసేవకులను, కళాసేవకులను పురికొలుపు నుత్సాహమునకు తావొసఁగుఁగాక !! ఆంగ్లవంగసారస్వతములట్లు ఆంధ్రసారస్వతము అధునాతనయుగమున అపూర్వతేజమును విరఁజిమ్మఁగాక !!! తెలుఁగుశైలి, జ్ఞానశైవలినియై ప్రవహించి, జిజ్ఞాసులనుతనుపుఁగాక !!!!

# 6. భావనావేశము

సృష్టిహృదయమున స్రవించునది భావనము. భావనధునీ హృదినుండి ఉవ్వెత్తుగ నుబుకునది ఆవేశము. భావనావేశము నిద్దుర నుండి జీవకళలను ఎగురఁజిమ్మును. నిస్తబ్ధతనుండి గీతికాధారలను వెడలించును. రసబంధురహృదయమునుండి సౌందర్యమును గురి పించునది భావనావేశము. భావ విద్యుల్లతములను తళ్కొత్తించునది భావనావేశము. ప్రత్యక్షప్రపంచమున దివ్యకార్యములను తాజ్ మహాలు లట్లు నిలుపునది భావనావేశము. కావ్యజగతియందు బృందావనమును పరిమళించునదియు భావనావేశమే. దీని శక్తి యందు జగదీశుఁ డదృశ్యుఁడై యుండును. ఇది బొమ్మరాళ్లను సంపెంగ పువ్వులు జేయును. చింతనిప్పులను నిత్యమల్లెలుగావించును. మొద్దు లను నిలిపి తాండవనృత్యము చేయించును! నవ్యపల్లవములచే మొర డులను వికసింపఁజేయును. పాపులను పావనులను గావించును. పందలను పండితులను చేయును. చావును చంపి దివ్యదీప్తులఁ జల్లు జీవమును ప్రత్యక్షమొనరించును. సృష్టికి ఆదియై, సృష్టికి ప్రతి సృష్టిని చేయఁగలుగునది ఈ శక్తియే. దేవునకు మహత్తరమానవ రూపు నిచ్చునదియు, మానవుని జగదీశుఁ జేయునదియు నిదియే. తమమును పిండి వెలుగువెల్లువలను వెలారించునదియు నీశక్తియే. అసాధ్యములను ఆశ్రితవందిమాగధుల నొనరించి, అరిష్టములను చరణాశ్రిత పరిచారికలఁజేసి దురంత దుఃఖములను ధూళ్యావలుంఠిత శత్రువులఁగావించి, బ్రహ్మాండమును చేతిచెండును చేయునదియు నీశక్తియే. సంభవాసంభవములును, జీవమృత్యువులును, భౌతికా ధ్యాత్మికశక్తులును, జీవాత్మ పరమాత్మలును, దీనికళనే భేదరహిత

ములై మహాపురుషుల జీవనరంగములందుఁ జూపట్టును. మనుష్య హృదయము నిది ప్రాఁపుచేసికొనినందున, ఇహపరములు గోపికా గోపాలురై అందనవరతము రాసక్రీడలఁ దేలుచుండును. గోపికాగో పాలురఁ గలుపు బంధము అనురాగము. సౌందర్యము, మాధుర్యము, ఆనందము, ఆవేగము, ఈ మిథునానురాగమున,—ఈ రాసక్రీడయం దున్నవి. ఆశయములును ఆదర్శములును ఇందు శోభిలుచున్నవి. కళామయమైన కృష్ణజీవనమునకు హృదయము ఆటపందిరియైనపుడు మనుష్య జీవనము కనకురుకాంతు లీను కావ్యజగతి కాదా? కాళ క్రౌర్యముచే విషజ్వాలలు క్రక్కించి, భావనావేశమున దానిపై రస బంధురనృత్యము సలిపిన శక్తి అంతరంగజగతియందు వెలసియుండ, దానిని గుర్తించిన వానికి గోవర్ధనగిరులు తలగొడుగులు గాక అడలు కొలుపు ఆపద లగునా? భావనావేశముపై నుఱ్ఱూఁత లూఁగువానికి కళలు పట్టపురాణులగును. ఘనకార్యములు చేతిబొమ్మలగును! ఘనశైలములు బొమ్మరాళ్లై, ఆతని కాలిక్రింద నడఁగియుండును! వాని జీవితము సౌందర్యోపేతమై, రసబంధురమై, గురుగంభీరమై, ఆశయప్రభాకలితమై యుండును.

ప్రకృతినుండి హృదయములోనికిని, హృదయమునుండి ప్రకృతి లోనికిని అదృశ్యశైవలినివలె భావనావేశము ప్రవహించును. దీని వీచికలందే రెండును గలిసికొనును. కావుననే కళోపాసకుఁడు ప్రకృతిని జూచి తన్మయచిత్తుఁడై పోవును. కళోపాసకుని కాంచి ప్రకృతియు పులకితశరీరయగును. హాయి జుఱ్ఱుచు, నిర్వారు చిత్రఖేలనము సలుపు కొందురు.

శాంతికాంతులు అరుణగగనమున జాలువారు తఱి ఎడద విప్పారఁ గేలు మొగిచి,కళోపాసకుఁడు మధురగీతికలు పాడును. రంగారు

కిరణపంక్తులందు బంగారు తలఁపులను నేలపుటపై రవికవి వ్రాయుటఁ జూచి, తన కల మాతనికిచ్చి ఆతని భాస్వంత లేఖని దాఁగొన నాతురంపడును! మృదుకరస్పర్శచే నసుచు, వసుమతిని పులకితఁజేసి నవ్వులందును పువ్వులందును ప్రభాతమును కడపుచుండ రాగమయమైనవారి చెలిమిఁ గాంచి ఆవేశభరితుఁడై కళోపాసకుఁడు శకుంతకాంతలను గవియ నంతరిక్షమున కెగయఁడా? భావనావేశముతో నుచ్చలిత మగు పక్షికూజితములకు నిజహృదయతంత్రుల గీతికారవములను లయగా సహకరించి తన్మయనృత్య మొనరించుచు, జగన్మోహనుఁడైన కవికుమారుఁడు సృష్టికాంతను హృదయమునఁ జేర్చుకొనఁడా? మినుకులీను రవిభావములను పువ్వు పడుచులు దిగ్రమింగుటఁ జూచి కడు కాంక్షతో నాతఁడు వానిదాపలఁజేరి సౌందర్యభిక్షను వేఁడుకొనఁడా? పూపడంతుల మోములకు కన్ను లప్పగించి ఆవేశభరమున పరిమళపూరమునకు మానసాధరము నొడ్డుచు, ఈసున సమీరుఁ డెల్లకడలందు గుసగుసలు సల్పుటఁదిలకించి, సిగ్గున, పొదరిండ్ల మఱుఁగున కరిగి కవియువకుఁ డందు కులుకుచుండఁడా? అపరంజి మరీచికి మన సిచ్చిన మంచుతుంపురు మణికాంతులను నగుచుండ, బిందుసుందరి హృదయముఁ జొచ్చి, పరవశుఁడై కాంతిరాసులను తలఁబ్రాలు గావించు కొనఁడా? ఈ గుట్టుఁ జూచి తన కేలని యూరకొనక కుసుమాధరముఁ గ్రోలుచు మందరవమున ప్రణయినికి భ్రమరవరుఁడు దానిని దెలుపుటఁగాంచి కినిసి, కవి తుమ్మెద నెత్తిపొడుచుచు పాటలు పాడఁడా? గూళ్లమీఁది పచ్చందనపు పూఁతపై పైడి రంగులు తళ్కొత్తినంతన, ఆకుగములమాటున దాఁగి కళోపాసకుఁడు పిట్టబిడ్డల తియ్యని కూహూలకు వీనుదోసి శ్లోగ్గి పోయినందఁడా? రసపూరిత

ఫలములు నిండురూపముల హృదయములపై నొప్పారఁ, దీన యిల్లాండ్రు శోకించినంతన, రసపిపాసు వైన కవి ఆతురపాటున దొంగ చూపుల నాదెస సారింపఁడా? అదికాంచి, ఈసున రవికవి వాని తలఁపులను క్రొందళ్కులందుఁ బట్టబయలు కావింపఁడా? నిశీథినీ నిస్తబ్ధతయందును, నీరంధ్ర నీరదములందును తన తలఁపులను ముంచుచుఁ దేల్చుచు, ఆఁడుచు పాడుచు, నవ్వులు రువ్వుచు ఆనంద వ్రతుఁడు నాకమును, నందనమును హృదయమున నింపుకొనఁడా? చెర్వు కెరటాలఁ దేలుచు, కౌముదీపూరమున మునుఁగుచు, పవనువలన నుడుపతికి ప్రేమసందేశ మంపుచు, ఫుల్లవదనలైన కుముద్వతులఁ గాంచి పులకితచిత్తుఁడై సరోవరతీరమునకు పర్విడి, మలిపుట్టువున తాను కల్వయై పుట్టవలె నని కవి తపసు చేయఁడా? వరునిఁ జూచి మోహిత యగు వధువువలె కవిని కాంచి ప్రకృతి సీమంతిని హృదయము విప్పి తన సౌందర్యము నాతని వశ మొనరింపదా? భావనావేశమున కవి ఆనందమునం దీఁదులాడఁడా? పాలకరల్లందు నీఁదు సృష్టికర్తవలె, ఆనందవీచికలం దీఁదులాడు కవి ఎన్ని యద్భుతములను సృష్టింపఁడు? భావనావేశమున నడచువానికలము తరళకాంతులను విరఁజిమ్మదా? మనోహర రూపులఁ గనులెదుటఁ బెట్టదా? సాహితీయారామమున కమనీయ కళాబదనికలను నాటివేయదా? వసుమతిని రసవాహినులం దోలలాడింపదా? స్వోత్కర్ష కళావిన్యాసములు భావనావేశమునఁ గదా తలసూపును! రాతిని కూడ రసమయము చేయునది, కటికిచీఁకటిని కూడ కళాసందీప్తము గావించునది, కంకాళమున జీవకళలు నింపునది, హృదయమును మీటి విశ్వసంగీతము వెడలించునది, సచ్చిదానందములను మూడుగ్రుక్కల ఆపోశనముఁ జేయించునది భావనావేశము కాక మఱేది?

సాహితీ సామ్రాజ్యమందును, మనుష్య జీవనమందును విశేష ప్రశస్తిఁ గన్న "రసములకు రాజు" శృంగారరసము భావనావేశమున నుబుకునదే! ప్రాచీనకవులు జడలే దాల్చినను, తమ హృదయములందు సుధాబంధురవల్లరులనే పెరుఁగనిచ్చిరిగాని డొంకలఁబోలు జడలను గాదు. కెంపుతలఁపులు చిప్పిలు అలరు విరులను దురిమి, తమ జడలను సురభీకరించిరి గాని అందు వల్మీకములను పెరుఁగనియ్యలేదు. నిభృతప్రకృతినుండి కూడ సౌందర్యమును కొల్లఁగొట్టువారు కావున మునిముచ్చు లని వరూథిని వారిని గేలి చేసినది శోకధారలను జాలువార్చునపుడు కూడ నా కళావ్రతులు కలస్వనమున రాగాలాపన మొనరించునా రని వీణాతంత్రుల బోలి, తీపి తుంపురులు రాల్చు వారి రచనపంక్తులే తెలుపుచున్నవి. దుఃఖమునఁ దొలుకాడు ఘట్టములకుఁగల శృంగారరసవాహినులు స్రవించుచుండునని రామాయణమును తెలిచినవా రెఱుఁగుదురు. వాల్మీకి హృదయము రసపూర్ణమేఘ మని ఎఱిఁగియే వానకోయిలయై కాళిదాసు దాని నాశ్రయించినాఁడు; పిదపఁ దన హృదినుండి మెఱపుల వర్షముఁ గురిపించినాఁడు. శృంగారమును, ఆనందమును, సౌందర్యమును కవిహృదయమున నూరించు అద్భుత శక్తియేది? భావనావేశము కాదా?

కవితావేశము ఏకొలఁదిమంది హృదయములందో మందాకినీ వీచికల నుప్పొంగించును. సంగీతమట్టిదికాదు. "రహిమీర యంత్ర గాత్రముల రాలఁ గరఁగించునది" విమలగాంధర్వము. మానవులకును, మృగములకును, దేవతలకును, దానవులకును, నొకేభావమైనది గానము. అనురాగము, ఆనందము, సంఘీభావము, సంగీతమున నుప్పొంగు భావనాబుద్బుదములు. గీతకళలు స్వర్గమునకు మెట్లు లని

రవీంద్రుఁడు వాక్రొనెను. సామగానముఁ జేయుచు ప్రాచీనులు నృత్యము సలిపిరి. నారదతుంబురుల నాట్యకౌశలము పురాణప్రసిద్ధము. కృష్ణుఁడు నృత్య మొనరించి వైకుంఠమును భూతలమున నిలిపినాఁడు. విశ్వమోహననృత్యము సలిపి, నటరాజు సృష్టిమహత్త్వమును తేట పఱచినాఁడు.

కవిత్వనృత్యములందు వలెనే తక్కుంగల కళలందును భావనా వేశము చూపట్టును. శిల్పకౌశల్యమును, చిత్రలేఖనానైపుణ్యమును దీనివలననే తేటపడును. ప్రాచీప్రతీచీ జీవనముల నుప్పొంగు భావ ములను రవివర్మ రాఫేలులు తమ చిత్రములందు చిత్రించిరి. రామా రావు రామమోహనులును, ఆనందమోహననందలాలులును, అవనీంద్ర రవీంద్రనాథులును అధునాతన మానవహృదయములందు పొంగి పొరలు తలఁపుకరళ్లను తమ రంగులందు చిమ్మి పృథ్వికెంతేని ఆనంద భిక్షనొసఁగిరి. గతభారతమహత్త్వమునఁ గొంతకవఱకు చరింపఁ దలఁచువారు అజంతా ఎల్లోరా గుహలందును, బృందావనభువనేశ్వర మందిరములందును, బుద్ధగయ దాక్షిణాత్య దేవాలయములందును ప్రవే శింపవలెను. తక్షశిల, మొహెంజొరా, జింటూరా, సారనాథములందు నేఁడు వెల్వడు శిల్పభాగ్యమును గాంచి అద్భుతప్రాచీన యుగమున మసలఁ గలిగితిని. స్థలకాలపరిమితులను ధిక్కరించి, అనంతశోభ ననంతకాలమునకు ధారవోయు తాజ్ మహలును చూచి భావనా వేశమున గంతులిడనివా రెవరు ? ఈయావేశము కతన అదృశ్యభావ ములు దివ్యదృశ్యము లగుచున్నవి. కళాజగతి యందును, ప్రత్యక్ష వసుమతియందును అవతరింపఁ గలుగుచున్నవి. మృత్యువునఁ గూలిన సంఘటనములకు సంజీవి నిచ్చి చిరంజీవములు చేయుచున్నవి.

బాహ్యాంతరజగత్తులకును, త్రికాలములకును వియ్యమును, నెయ్యమును గూర్చు కళకు ఆయువు భావనావేశము.

వక్తృత్వమును కళలలోనిదే. కళాహృదయుఁడు కాని వక్త మాటలు వట్టిగొడ్డుఆర్పులట్లుండును. కళోపాసకుని పలుకులు శ్రోతల హృదయములను పరమహంసలను చేయును. ఉపన్యసించు సరోజనికిని, పద్యపంక్తులందు పరుగులిడు సరోజనికిని భేదములేదు. మధుమయమైన సరోజని హృదయ మావేగముతో రివ్వురివ్వు మనుచుండును. భరతపక్షిని గూడి షెల్లీ కవీంద్రుఁ డెగసినట్లును, కోకిలవెన్నంటి మహాకవి కీట్స్ అడవికొమ్మలందు "(On the viewless wings of Poesy") ఎగసినట్లును, శబ్దపక్షవిక్షేపమున సరోజని ఎగసి, శ్రోతలను గూడ నందనవనమునకు గొంపోవును. సురేంద్రుఁ డుపన్యసించుచు, మేఘములతో మద్దెలలు మ్రోఁగించువాఁడు. శబ్దడోలికలందు భువనముల నుఱ్ఱూఁత లూఁగించు జగద్ధాత్రి బీసెంటుసతి యని సభ్యప్రపంచ మెఱుఁగును. నారాయణదేవు హృదయము నుండి ఆంధ్రమేఘములు సలుపు గర్జనలను మనరాష్ట్రీయు లెఱుఁగుదురు.

కళోపాసనమునకువలెనే ఆధ్యాత్మిక జీవనమునకును ఆవేగ మవసరము. కళ అనురాగమయమైనది. ఆధ్యాత్మికజీవనము భక్తిపూరిత మైనది. అనురాగమునుండియే భక్తి జనించును. చెప్పనేల? అనురాగమే భక్తి యగును. భక్తియే అనురాగమగును. కృష్ణునెడ ననురక్తయైన రాధకంటె నెక్కుడు భక్తురాం డ్రున్నారా? రాగవల్లరులందు బంధింపఁబడిన గోపికలు భక్తికి మేలుబంతులు కారా? శశికిరణములట్లును, గీతకళలట్లును, కవిభావములట్లును అనురాగలతికలు సౌందర్యసందీప్తములై ఆవేగభరములై యుండును.

కృష్ణచైతన్యుఁడు "నాథా! నాథా!" యని శ్యామసుందరుని సంబోధించుచు, ఆత్మవిస్మృతుఁడై నదియాలో నృత్యము సలుపుచుండువాఁడు. భక్తిపూరితహృదయుఁడై "మాతా! మాతా!!" యని దక్షిణేశ్వరమున రామకృష్ణుఁడు గంతులు వేయువాఁడు. ఆనందావేశుఁడై రక్తారుణపూర్వదిక్కును చూచి అడవిజాతివాఁడు నృత్యము సలుపువాఁడు. కళాసౌందర్యమును కాంచి జర్మనీ షేక్స్పియరు గంతులు వేసినాఁడు. ప్రేమికులకును, కవులకును, భక్తులకును, గాయకులకును, చిత్రలేఖకులకును, వక్తలకును, వీరులకును, శిల్పులకును, ఆవేశమును, ఉద్రేకమును లేకున్నయెడల బ్రదుకే లేదు. అనురాగమునకు ఆయువు ఆవేగము. భక్తికి ప్రాణము ఆవేశము.

గురుకార్యములు, చతికిలపడి యోచనానిమగ్నులైన వారికిఁ గాక ముందంజవేయువారికి సాధ్యమగును. మతగ్రంథములను తెరువుఁడు—చరిత్రలను చూడుఁడు. వీనియందలి మహనీయులును, వానియందలి మహాత్ములును ఎట్టివారో పరికింపుఁడు. ప్రజాసమూహములను వాగ్వీచికల నూఁగించి, కటికిరాళ్లచే నయితము ఘనకార్యములు చేయించిన మహాపురుషులు ఆవేగపూరితులు కారా? కృషికకులమునఁ బుట్టిన మార్టిన్ లూథర్ పదునేనవ శతాబ్దమున, పాపభూయిష్ఠమైన యూరపుఖండమును తలక్రిందులు చేసి ఆవేశమయుఁడై మతమహత్త్వమును పునరుద్ధరింపలేదా? రసపుత్రవీరులును, రసపుత్రరమణులును అద్భుతక్రియలను నెఱపి, భావనావేగము కతనఁ గదా శతాబ్దులపైఁ గీర్తిచంద్రికలు వెదఁజల్లిరి! థెమిస్టకిల్స్, ఎపమినన్డస్, లియనిడస్, హేనిబల్, సీజరు, అలెగ్జాండర్ లాది మహావీరులు భావోద్రేకమువలనఁ గదా అసాధ్యములను పడఁదన్ని, నింగిచుక్కలను నెన్నముద్దలట్లు నంజుకొనిరి? మనుష్యమాత్రు లెక్కిచూడని

ఇటలీ తుషారాద్రిపై (Vide: Abbot's 'Life of Napolean') లేడి దండులట్లు తనదండులను దుమికించి, నిఘంటువునుండియు, ప్రత్యక్ష ప్రపంచమునుండియు 'అసాధ్యమును' పాఱదోలి, తీక్ష్ణదృక్కులచే నింగిచుక్కలను వడకించి, (Vide: Byron's famous Poem on Napolean Bonaparte) ఎల్బాదీవినుండి మహోదధియం దుఱికి హూమ్మని ఉత్తాలతరంగములను పిడికిటఁ బట్టి, ఒక్క తన్నున యూరపుదేశమును అట్టిటు లాడించి సింహసేనల కడలు పుట్టించి, వీరులందు వీరుఁడై, మనుష్యులందు మనుష్యుఁడైన నెపోలియన్‌ను నెపోలియన్ఁ జేసినది భావనావేశము కాదా? సన్యాసియైన సవ్య సాచి హృదయమున భావోద్రేకమును పురికొల్పియేగదా గీతా చార్యుఁ డాతనిచే గాండీవ మెత్తించి కర్మక్షేత్రమున వాని నగ్రసరుఁ గావించినాఁడు! కమలకాసారమున లంఘించు రాజహంస వడువున (Vide: "Sakka's Jataka" Anderson's "Pali Reader") శిశువును రక్షింప భయదజ్వాలలాందు దుముకు జనయిత్రికి ఉత్సాహావేగము లిచ్చునది భావనావేశము కాదా?

ఇది మేధశ్శిఖరమునఁబుట్టునది కాదు.—హృదయమహోదధి యందు జనించి, యందుత్తుంగతరంగములై పొంగునది. కళను తనుపు భావోద్రేకమును, పరమహంసను తన్మయచిత్తుఁ జేయు భావనావేశ మును, ఘనకార్యములను అరచేతఁ బట్టించు భావనావేగమును హెచ్చు తగ్గులు కలవిగాని వేర్వేరైనవి కావు. కవితారసమున నుప్పొంగునవి మృదువీచికలు. వీరరసమున నుప్పొంగు అలలు కొండలవంటివి. భక్తి రసమునఁదొల్కెరటాలు మలయుహిల్లోలవాక్కులఁ బోలునవి. చెప్ప నేల?—రసములన్నిఁటికిని, ఆశయము లన్నిఁటికిని మూలవిరాట్టు భావ నావేశము! కళాకౌశలమునకును, ఆత్మకైవల్యమునకును కన్నతల్లి

భావనావేశము!! పురుషార్థములకును, పరమార్థములకును ఆధారము భావనావేశము!!! శూరుని సృష్టికిని, సంయమీంద్రుని సృష్టికిని, ఆనందవ్రతునిసృష్టికిని, సృష్టికర్తసృష్టికిని ఆయువు భావనావేశము!!!!



# 7. భావనము, పరిశీలనము



సాహితికి జీవనము భావనము ; బ్రదుకు తెరువు పరిశీలనము. పుష్టినిచ్చుభావాహారము నది పరిశీలనాపథమున కనుఁగొనును. తుష్టినిచ్చు ఆనందామృతమును భావనావీథియందు పడయును.

వ్యక్తిజీవనమునకువలె సాహితీజీవనమునకును బహిస్సృష్టి, అంతస్సృష్టి యున్నవి. దృశ్యమాన మగు ప్రకృతిపై కన్నిడి, కంటి వెలుఁగుతో దానికి చైతన్య మొసఁగి, సాహిత్యోపాసకుఁడు దానితో వేడుకలాడును. కవి పరిశీలనము ప్రకృతికి సంజీవి. ఈతని భావనము అంతస్సృష్టియం దెగిరి, అపూర్వ, అదృశ్య, అద్భుతలోకములు చూచును. జడజగత్తును దృష్టియం దిడికొని, తాత్త్వికశక్తి తేటపడ నందుండి తీపితలఁపులు తీయుట పరిశీలనముయొక్క కృత్యము; అదృశ్య వసుంధరయందు మసలి అనంతవిభూతిని కొనివచ్చి, హృదయకోశాగారమున గ్రుమ్మరించుట భావనముయొక్క కృత్యము. పరిశీలనము పైచూపుకలది ; భావనము లోఁజూపుఁగలది.

శంకరునికాలమునుండియు జగత్తు మిథ్యయని తాత్త్వికులు పలురీతులఁ జెప్పుచున్నారు. ఎదుటఁ గనబడు పృథ్వి శాశ్వతమైనది కాక; నశ్వరమైనదని వీరితలంపు. మన్నుపాలగు శరీరమున అనంత

జీవి యైన ఆత్మ విడియున్నట్లు, వసుంధరావరణమందును చిరజీవియున్న దనియు, ఇదియే పరమాత్మయనియు వీరు దాని నారాధింతురు. సృష్టిబహిరంతరములందు జగదీశుఁ డున్నాఁడని ("God is immanent as well as transcendent") హిందూతత్త్వశాస్త్రము వాకొనుచున్నది. జగతి ఈశ్వరుని శరీర మని ఉపనిషత్తులును, భగవద్గీతయు దెలుపుచున్నవి. హిందూవేదాంతమందలి ఈ సత్యమును దృష్టియందిడికొనియే సుప్రసిద్ధ తత్త్వవేత్త రాధాకృష్ణుఁడిట్లనినాఁడు.

"Hindu thought is not afraid of asserting the presence of God in all things." (Vide: Radhakrishnan's "Hindu Thought and Christian Doctrine")

సృష్టియందు ప్రస్ఫుటించు సౌందర్యమును, ఉప్పొంగు ఉత్సాహమును, ప్రభవించు విభూతియు తన తేజోభాగసంభవములని శ్రీకృష్ణుఁడు తెలిపినాఁడు.

"యద్య ద్విభూతిమ త్సత్త్వం శ్రీమదూర్జిత మేవ వా,
తత్తదే వావగచ్ఛత్వం మమ తేజోంశసంభవమ్"
(శ్రీభగవద్గీత. అ. 10: శ్లో. 41)

కవిత్వమునకును, తత్త్వశాస్త్రమునకును నడుమ మూఁడడుగుల మేర యున్నదనినాఁడు ప్లేటోమహాశయుఁడు. కానుపించు దృశ్యమును కప్పికొనియున్న నిజవస్తువుయొక్క తత్త్వ మేమని యూహించుట తాత్త్వికుని ఆశయము. ఈతని తెరువులో నెన్నో ఎత్తుకొండలుండును; ముండ్లపొదలును ఉండును. ఘర్మధారలు ఓడ్చుచు, మెదటిని మర్దించుచు, సూక్ష్మయోజనల పట్లు దోడి తత్త్వపరిశోధకునితో డీకొనుచు తాత్త్వికుఁడు ముందుల కరుగును. ఈతని పని

యంతయు వట్టి యోజనయందుండును; ఈతఁడు చేపట్టునవి సూత్రములు; చేరునవి సిద్ధాంతములు. భావనమున పెరిఁగిన మతము తత్త్వమునకు తోడైనపుడు, తాత్త్వికునియందు మతాచార్యుఁడు పొడగట్టినపుడు, అతఁ డీక బొప్పిలు తగిలించుకొనక పరాసరి త్రోవఁ బడి ఛరఛర నడచును. అపు డతఁ డందఱికిని అందుబాటగును. అతని వ్యాఖ్యాలం దపుడు తేజ ముండును. మనశ్చక్షుస్సమక్షమున దివ్యదృశ్యములు చూపు శక్తి అతని భావములందు ప్రత్యక్షమై యుండును. మానసికగ్రథనమున నీతనికి సైదోడగు నాతఁడు కవి. కవి వట్టి తాత్త్వికుఁడు కాఁడు. చెమ్మటచుక్కలీతని చేరవు. చేరినవిపో, అవి ముత్తెపుతుంపురు లగును. కవి మతాచార్యుఁడును కాఁడు. బోధనలును, సందేశములును ఈతనికి గిట్టవు. ఈయిగ్వారనుండియు పుట్టుక్కున సంబంధము త్రెంచుకొని, ఈతఁడు గద చేబూనఁడు. ఈయిర్వారదృష్టియందలి జగదీశుఁడును, మానవుఁడును, వసుంధరయును, కవిదృష్టియందును వెలయుచుంట ప్రసిద్ధవిషయము. కాని, త్రిమూర్తులందలి శ్రీవిష్ణువువలె నీతఁడు కొంత ఆధిక్యము కలిగియుండును. ఈతని దృష్టి, ఈతనికి ప్రత్యేకమైనది. ఈతనికి స్వాతంత్ర్యము మెండు. సౌందర్యమును కన్నుల నింపుకొని, ఆశానందములను రెక్కలు చేసికొని, ''భావాంబరవీథి విశ్రుతవిహారి''యై ఈతఁడు వెలయును.

అవ్వలి యవనిఁ జూచునది కవి హృదయము కాని, అవ్వల గల వట్టి కన్నులు కావు. కన్నులే చూచుచున్న వనిన, వీని దృష్టిమయూఖలు కవిహృదయమందలి మిహిరమండలమునుండి వెడలుచు, వీనియందుఁ జొచ్చి, అందుండి శశిప్రభలై జగతిని తాకుచున్న వని మనము గ్రహింపవలెను. కవి పరిశీలనమునకును, భౌతికశాస్త్రజ్ఞుని పరిశీలనమునకును పోలిక ఏమియు లేదు. శాస్త్రపరిశోధకుఁడు

హృదయమునకు దిగదుడు పనవచ్చును. అవ్వలి దృశ్యమును చూచుతటి ఇతఁడు, తన మానసికవికారములను, తన హృదయసామగ్రిని వెనుకకు త్రోసివేయవలెను. వ్యక్తిగతమును, ప్రత్యేకమును నైన ఊహల కితఁడు బలాదూరనవలెను. కష్టమైనను, నిష్ఠుర మైనను, బాగైనను, ఓగైనను ఎదుటి దృశ్యమును ఆశ్రయించి, దానిని పుంఖానుపుంఖముగ పరిశీలించి, తాను కాంక్షించిన సత్యము నితఁడందుండి పడయును. ఈతని దృష్టి వాడియుడిదమువంటిది. కన్నుముందు నిలిచిన దానిని తున్కతున్కలు చేసి, అణువుల నవ్వలికిఁ దీసి, అణువునందలి భౌతికజగములను తన సృష్టిట్యూబులో జేర్చి వాని నితఁడు బట్టబయలు చేయును. ఇతని దృష్టికిని కవిదృష్టికిని, ఇతని ఆశయమునకును, కవి ఆశయమునకును, భేదము లున్నట్లే, ఇతని సత్యమునకును కవి సత్యమునకును వ్యత్యాసమున్నది. ఇతనికి దూరముగను, తాత్వికునకు (ప్లేటో చెప్పినట్లు) సమీపమందును నిలిచిన కవి కాంక్షించు సత్యమునకును, తత్త్వవేత్త అభిలషించు సత్యమునకును తేడా యున్నది. పృథ్వీదృశ్యములు మిథ్యలని వానిని కవి త్రోసిరాజనఁడు. వానిపై నాదరముంచి, వానియందలి ఆత్మ కాతఁడు చేతులు మొగుచును. శరీరము రక్తమాంసముల ప్రోవనియు, అవి అనిత్యమనియు యోజించి, సాధనాగ్నియందు దానిని చిటచిటలాడింపఁడు ఆత్మకు దేవాలయమైన ఒడలిపై నితఁడు ఎంతేని మక్కువఁ జూపును. దాని సౌందర్య సౌష్ఠవములపై మనసునిలిపి వానిచేఁదోడున, అంతరంగ గర్భాలయముఁ జొచ్చి, ఆత్మప్రదీపమునకు 'జే! జే!' యనును. శృంగారమును చూచి కాళిదాసు "తూ! తూ!!" యనలేదు. శృంగారకావ్యములందు అద్భుతమైన ఆధ్యాత్మికార్థమును చూపినాఁడు. ఒడలికి విభూతి

పులుముకొని, నట్టడవులందు ఆశ్రమములు నిర్మించుకొని, యోగనిద్ర యం దీతఁడు బుడుంగు మనలేదు. ఆత్మను వేఁడి, భావవిభూతి నంది, దాని నీతఁడు మనసునకు పట్టించుకొని, సభ్యప్రపంచమున కంతకు దానిని పులిమివేసినాఁడు. 'మునిముచ్చు'గుటకై ఇతఁడు వనము లందు ప్రవేశింపలేదు. గృహజీవనమందలి సౌందర్యమునకు బలాదూ రనినట్లు వనశృంగారమునకు దిగదుడుపని కన్నులపై రెండు రెప్పలు తాపటమొనరించు జోగులట్లు కాక అడవులఁ జొచ్చినపుడు, కనురెప్ప లను వెనుకకు విఱిచికట్టి కాళిదాసు వనవధూటికి చూడ్కు లప్ప గించి తన కవిత్వపు సెజ్జయందు దానిని చేర్చుకొనినాఁడు. ఒక యాశ్రమముఁగట్టికొని, కణ్వుఁ డందు ఏండ్లను పూండ్లను కడపినాఁడు. మానసజగతినుండి చరచర నడచి, కొలఁది నిముసములు కణ్వాశ్రమ మునఁ గడపి కాళిదాసు దానికి అమరత్వము ప్రసాదించినాఁడు. కణ్వుని యోగనిద్ర కణ్వుని జగదీశుని చంక కెక్కించె నేమో నే నెఱుఁ గను. అతనిది స్వాంతస్సుఖమునకు. గుట్టలకొలఁది పున్నెము సంపా దించి వానిపై నాతఁడు పిప్పిగంతులు వేసినను, చూచి, ఏదో లబ్బ సము దొరకు నని, మనము మురియనక్కఱ లేదు. ఈవట్టి సన్యాసి కంటె పరార్థజీవియైన కాళిదాసే సహస్రాబ్దుల ముత్తైపుసేస లందు చున్నాఁడు. కాళిదా సొసఁగిన ఆనందభిక్ష నంది ఎంద ఱెందఱు గౌలు తన్మయనృత్యము సలుపుట లేదు? ఎంద ఱెందఱు కవికుమా రులు కళావ్రతమున దీక్షితులు కాలేదు? వెనుకటి కాలపథమున కళాపూర్ణుఁడై సాగిపోయి, సత్యయుగత్రేతాయుగములను, దివిచిత్ర ములను ,అర్వాచీనప్రజల కందించినది కాళిదాసు కాఁడా? దినేశవంశ ప్రభలను "రఘువంశము"న తళుక్కొత్తించి, ఉమామహేశ్వరుల ప్రణయానందమును చూపి, పృథ్వీప్రజలను "కుమారసంభవ"

డోలికయం దుఱ్ఱూఁతలూఁపి, ఊర్వశీపురూరవుల వలపువల యిట్టి దని "విక్రమోర్వశీయము"ను వసుమతీహృదిపై నిలిపి, మనుజులకే కాక అమరులకు కూడ కవితాప్రపంచమున నుత్తమర్ణుఁడై నిలిచిన కవిచంద్రుఁడు కాళిదాసుకాఁడా ? కళోపాసకులు కాళిదాసు ఋణమును దీర్చుకొనఁజాలుదురా ? కాళిదాసునకును, ఆతని కావ్యములందు ప్రవేశ మందిన పాత్రలకును అమరత్వము నిచ్చినవి ఆతని పరిశీలనమును, భావనమును. షేక్స్పియరు, వర్డ్స్వర్త్, షెల్లీ, కీట్స్, బ్రౌనింగ్ మున్నగు మహాకవులు బాహ్యసృష్టిని నిమిత్తము గావించికొని తమ కవితావిశ్వములు సృష్టించిరి. భోజుని కొలువున నున్న కాళిదాసు బ్రహ్మాండమునంతను చుట్టివచ్చి, మఱొక బ్రహ్మాండమును సృష్టించినాఁడు. పరిశీలనము కంటె భావనమునకు ఈతఁడు ఎక్కువ పని కల్పించినాఁడు. ఇట్టి శక్తియందు కొంత అభిజ్ఞత చూపఁగలిగిన పాశ్చాత్యులు డాంటే, మిల్టన్, బనియన్, కీట్స్ మున్నగువారు. బాహ్యదృష్టి లేని మిల్టన్ తన అంతరంగమునుండియే స్వర్గోద్యానమునకును, నిరయరాజ్యమునకును (Vide: "Paradise Lost" and "Paradise Regained") రహదారులు నిర్మించుకొన్నాఁడు. బెడ్‌ఫర్డ్ కారాగారమున పండ్రెండేండ్లు చీఁకటియందు పడియుండియే, జాన్ బనియన్ సురపుర దృశ్యములు ఆంగ్లేయులకు చూపినాఁడు. పరలోకమున బియాట్రిస్‌ను, దివ్యసింహాసనమున జగదీశుని చూచినట్లు వర్ణించిన డాంటే కీట్స్‌లు ఎంతో భావనాశక్తినిఁ జూపిరి. కాని, భావనమున నద్వితీయుఁడు కాళిదాసు. బహిస్సృష్టి చూచి పులకితుఁడై చివాలున నీతఁ డంతస్సృష్టియం దడుగిడును. ఇది భారతీయుని నైజగుణము. భారత సంయములు ఇంద్రియహయములను వెనుకకుఁ ద్రిప్పుదురు.

తమ చూడ్కులను లోనికి మరలింతురు. భారతకవులకు అంత ర్దృష్టిపై,—దివ్యదృష్టిపై ప్రీతి మెండు. వీరు దీని నలవఱుచు కొని, అందలి వెలుఁగును విశేషముగ తమ రచనములపై ప్రస రింపఁజేతురు. ఇట్లనిన, వీరు ఆలోచనమునకే పని కల్పించు తాత్త్వికకవు లని చెప్పరాదు. భావనమునకే పని యిచ్చు సర్వజన హృద్య కవితాశిల్పమునే వీరు చూపఁగలిగిరి. సృష్టి తుదవఱకు పృథ్వీజనసామాన్యమందు నిలుచు మహాకావ్యములను రచించిన వ్యాసవాల్మీకులు తమ లేఖినులకు దివ్యదృష్టి నిచ్చిరి; తాము భావనా వీథులందు విహరించిరి. వాల్మీకిని మేలుబంతిఁ గావించుకొనిన కాళి దాసు ఈశక్తులం దాచార్యునకు తమ్ముఁడ ననిపించుకొనినాఁడు. మేఘునిపై ఒకమాఱు చూపు నిగిడించి, షెల్లీవలె దానినే పట్టుకొని ప్రేలాడినాఁడు కాఁడు. మేఘుని దూతఁగావించి, అపూర్వసౌందర్య సామ్రాజ్యమున కాతనిఁ బుత్తెంచినాఁడు.

భావనమున కాళిదాసు అద్వితీయుఁడైనట్లు పరిశీలనమున షేక్స్పియరు అద్వితీయుఁ డనవచ్చును. షేక్స్పియరు పుట్టినది ప్రకృతిసౌందర్యమందు; పెరిఁగినది అద్భుతబహిస్సృష్టియందు. ఈతని పల్లె స్ట్రాట్ఫర్డ్, ఏవన్ నదీకూలమున నున్నది. షేక్స్పియరులో కవితాశక్తిని పుట్టించినది, అతని మనికిపట్టును పట్టుగొమ్మఁ జేసి కొనిన సృష్టిచిత్రమే యని కొందఱు విమర్శకుల వాదన. స్ట్రాట్ఫర్డ్ నందలివా రందఱు కవులు కాలేదు. షేక్స్పియరు హృదయమందలి సహజసామర్థ్యానలమునకు అతని యూరి దృశ్యము చెకుముకి యైనది. ప్రకృతి యూరువునఁ బుట్టిన షేక్స్పియరు ప్రకృతిపరిశీలనమున కల వాటుపడినాఁడు.

జడములను చూచు కవి వానికి జీవచైతన్య మిచ్చునంటిని కదా! అంతియ కాదు. తన భావనాశక్తిని కవి వాని కిచ్చును; తన హృదయమందలి సంతోష శోకాదివికారములను వాని కాపాదించును; వానిని తనతోడివారిఁ గావించుకొని వాని నేస్తమున నమందానంద మంది, వాని హృదయములనుండి ఎంతేని భావమును పడయును. ఎదుటి కొండకొనయందు ముంగాలిౕవేళ్లపై సూర్యుఁడు తోఁచినంతనే కన్నులు తెఱచి పువ్వు చిఱునవ్వు నవ్వెన దఁట. ఈవాక్యమందు, ఆహా! షేక్స్పియరు ఎంత చక్కఁదనమును, ఎంత హాయిని పూరించినాఁడో చూడుఁడు. వలపునఁ గులుకు పువ్వుపడంతి కవి మనసున ఆవేగముఁ బుట్టించినది. భావనావేశమున పరవశుఁడైన కవి ఎందఱెందఱి హృదయములనో ప్రణయోద్రేకముచే కదలించివేసినాఁడు. స్వర్ణముఖుఁడైన రవి పచ్చనేలలను ముద్దిడుకొనె నఁట:—చూడుఁడు.

> "Full many a glorious morning have I seen
> Flatter the mountain tops with sovereign eye,
> Kissing with golden face the meadows green,
> Gilding pale streams with heavenly alchemy"

ప్రేమికుల సంఘమందు ప్రసిద్ధినందు ముద్దును, నవ్వును ప్రకృతియందు చూచి, విలాసామోదములందు కవి ఈఁదులాడినాఁడు. బహిస్సృష్టి నంతను చూడ్కివలయందుఁ బట్టి చేరఁదీసికొనుట మహాకవులవాటు. అంతియు కాదు. దాని నల్లన వడకట్టి, అందలి రసమును, అందలి పరమార్థమును తనకావ్యపుటలందుఁ గుమ్మరించుట కీతఁడు మఱువపడును. కొండలం దొంటరియై యుండి, ప్రకృతీహృదయమున నంతఃస్సలిలలీలఁ బ్రవహించు తత్త్వభావమును వర్డ్స్వర్త్ పురిషిళ్లతో క్రోలువాఁడు. సృష్టికర్త తేజమును, అనురాగమును

జడజగత్తుపై వెల్లివిరియుటఁ గాంచి, బ్రౌనింగ్ నిత్యానందమున మునింగియుండువాఁడు. దుఃఖముచే పొగులువారికి బ్రౌనింగ్ వాక్కులు నూతనజీవము నొసఁగును. శాస్త్రపరిశోధకుని పరిశీలనమువలెకాక కవిపరిశీలనము ప్రత్యేకమైనదై వ్యక్తిగత కవిరుచి ననుసరించియుండును. పుష్పకేసరమును పెనవేసికొని యుండు బాలకిరణమును కనిపెట్టి చూచి, వాని నిభృతపరిష్వంగమున నెంత వేడుక యున్నదో ఎఱిఁగి ఒడలు పులకరింపఁజేసికొను యువకవు లెందఱు లేరు? వీరభిలషించునది నిత్యజీవనమందలి నిత్యశృంగారమును, నిత్యకల్యాణమును. రవీంద్రుని పోలు కవులు ఇట్టి శృంగారమునఁ జొక్కి మైమఱచియుండక, ఆధ్యాత్మిక సౌందర్యపిపాసువులై వెండినీరు పోలు తత్త్వకాంతిలో బంగారునీరమున కెనయైన ప్రకృతీరాగమును వోసి, అపూర్వపానీయమును సిద్ధముచేసి తనివారఁ గ్రోలి, ఆయమృతమునే సహృదయుల కందింతురు. చైతన్యజగత్తునకు, జడజగత్తును అర్ధాంగిఁ జేసి వదలుదురు. ఇట్టి సంబంధముఁ దేర్చుచు అర్వాచీనభారతపురోహితుఁడు రవీంద్రుఁడు. కొలనిపంకమునుండి, నీటిగుండా వెడలి, అవ్వలివెలుఁగున ప్రస్ఫుటించు సరోజము, నిద్దురనుండి వెడలి, జాగ్రదవస్థయందు తలసూపు మానసముఁ బోలునదనినాఁ డీతఁడు. చెట్టుకొమ్మలపై తోఁచు లేతచిగుళ్లు, రవికవికి పసిపాపల బుడిబుడి నుడువులవలె నున్నవఁట. (Vide: Tagore's "Sacrifice") అలంకారశాస్త్రము ఇట్టి ఉపమలకు చోటీయ దన్నారు ఒక తెలుఁగుకవిగారు. "కవిస్వాతంత్ర్యము ముందు బిఱ్ఱబిగిసిన మీ సూత్రములు తునియలు కావలెను. వెనుకటి తెలుఁగురెక్కలు వెనుకటట్లే యున్న, విఱిచివేయుఁడు. లేకున్న తెలుఁగునకు సొంపు సున్న యగు" నంటిని. ఇట్టి ఉపమలందు టెన్నిసన్ ఆఱితేఱినాఁడు. ఈతని "Princess"యం దివి కొల్లలుగ నున్నవి. ఉపమలందు

మేలుచేయి * అం పించుకొనిన కాళిదాసు సహజవర్ణనసమయమున వానిని వెనుకంబడ వేసినాండు. సాక్షాత్కరించిన దృశ్యమే మనసు నంతను ఆకర్షించియుండ, నాలోచనమును రేకెత్తించు బలాత్కృత సాదృశ్యప్రతిపాదనము కూడదని గ్రహించిన వారిలో ఆమహాకవి మొదటివాండు. నేలనంటి యంటనట్లు ముందులకు పర్విడుచు, వెన్కం దరుముచు తూపులేయు రాజన్యునిపై నొక చూపును వేఱొక చూడ్కిని ముంగలి తెరువుమీందను వేయుచు, సహజప్రవృత్తిని బట్టి రెల్లుచిగుళ్లను నోటంగఱచుచు, వివిధావధానమున తోంచిన కురంగమును కాళిదాసు ప్రత్యక్షము చేయుటం జేసి ఘనకవిహృదయ మొండు పట్టరాని ఆనందమున నృత్యము చేసినది. గెటే హృదయము అలంకారముల ఊట. ఈతనిచే గంతులువేయించినది తళ్కొత్తు అలంకారము కాక సహజవర్ణనము. లేడి గొనములను గుఱించిన చిట్టాజాబితాలను శాస్త్రవేత్తవలె గాళిదాసు సూపలేదు. ఉపజ్ఞం గల పరిశీలనమున ఘనుండైన కాళిదాసు సాక్షాత్కరింపం జేసిన దృశ్యమే గెటేహృదియందు అద్భుతానందములను పొంగించినది.

జడప్రకృతి పరిశీలనమే కాక మనుష్యప్రకృతి పరిశీలనము కూడ కళారాధకుని కర్తవ్యము. ఈ విద్యయందు మిల్టన్ మహాకవి విశేషశక్తి చూపలేకపోయెను. షేక్స్పియ రిందు సిద్ధహస్తుండాయెను. గెటే షిల్లరుల పాత్రలవలె నీతని పాత్రలు అతిలోకకల్పనలు కాకుండుటచే, వీని ప్రతిరూపములు నేఁడును పృథ్వియందు గోచరించుచుండుటచే, ఇవి వెనుకటి కాలపు విడ్డూరపురూపములు కాక నేఁటి ప్రత్యక్షజీవుల ప్రతినిధులై వెలయుచున్నవి. వ్యక్తిచారిత్రమును కథావివరణమునఁ దెలుపుటందు ఛాసర్ దిట్ట (Vide : Chaucer's Canterbury Tales). నవలాయుగమునఁ దోఁచిన స్కాట్ డికెన్స్

మున్నగు మహనీయులు కొంతకుఁ గొంత ఈకాలయం దాఁటితేటి నారు. వ్యాసుఁ డీవిద్యయందు అద్భుతప్రజ్ఞ సంపాదించినాఁడు. భారత పాత్రలు తోలుబొమ్మలై యుండుచో, భారతము ముగిసిన నిశీథమందే అవి యంతరించెడివి. మహాత్ములను, దురాత్ములను చూపి, సాధారణ ముగ మానవుఁడు బాగోగుల మూట యను నంశమును తెలుపుట కృష్ణద్వైపాయనుఁడు మఱువలేదు. మనుష్యచరిత్రములోని నిగూ ఢాంశములను, విరివిగఁ గాకున్నను కొంతదనుక కాళిదాసు భవభూ తులు వ్యక్తీకరించిరి. వీరి గొప్పందనము కవిత్వమందలి మాధుర్య మును, కథనమందలి సౌందర్యమును, శిల్పకౌశలము తేటపడఁ జిప్పిలఁజేయుటందు గోచరించును. రసాంకితకావ్యములు రచించు టందు వీ రజేయులు. మనుష్యచరిత్రయందలి స్వర్గమునే కాక నరక మునుకూడ చూపఁగలిగిన ప్రజ్ఞాధురీణుఁడు షేక్స్పియరు. మనుష్యు లందలి తరగతులు చూపుటందు నేఁటి మన రవీంద్రుఁడు కొంత నైపుణ్యమును చూపినాఁడు. ఇతఁడు తత్త్వదృష్టిఁగల మనీషి. పరి శీలనముకంటె భావన మీఁతనియందు మెండు. మనుష్యప్రకృతియం దును, మనుష్యజీవనమందును గల చిరభాస్వంతాంశములను తన నాటకములందు రవికవి చూపినాఁడు. మహత్తరాశయములను— ప్రాచీప్రాచీన మహత్త్వమున జోతిర్లిలమై వెలింగిన ఆశయములను రవీంద్రుఁడు తన నాఁటి ప్రజలందు, ప్రతీచీనాగరకతవలనఁ గలుషి తులు కాని భారతీయులందు, ముఖ్యముగ పల్లీయులందు ప్రదర్శింపఁ గలిగినాఁడు. విజ్ఞానపిపాసువులైన పాశ్చాత్యులు భారతసీమ వైస చేతులు మొగిచి నిలుచుట నేఁడును ఆచారమై యుంటఁ బట్టి, ఆశయ ప్రభలఁజూపఁ గలిగిన రవీంద్రునెడల విశేషాదరము చూపు చున్నారు. భావనాపక్షములపై నెగురఁగలిగిన రవికవి, బౌద్ధ

యుగములోని కరిగి, అందలి వేశ్యవనితను రంగస్థలిపై "నాటీర్ పూజయందు" చూపినాఁడు. రవిదృష్టి నాకర్షించు వేశ్య, అజాంత గుహాయందును, పూజయందును, చూపట్టకమానదు. చక్కందనమును, తియ్యందనమును, కళాసామ్రాజ్యమందలి సామగ్రినంతను తన నాటకములందు చూప నాకవిచంద్రుఁడు మక్కువపడు ననుటకు ప్రత్యక్షతార్కాణము పౌరాణికకథ నాధారముఁగల 'శాపమోచన్'. రామమోహనునినుండి వెడలిన అధునాతనభావస్రవంతియందు మునిఁగి, బ్రహ్మోపాసకుఁడైన జనకుని ఉపదేశములు గుండెయందిముడ్చుకొని, అనేకములైన హిందూ ఆచారముల దెస పెడ మొగము పెట్టిన రవికవి, నిత్యజీవన సంధాయక సాహితీ సంజీవియై ప్రాచీన భారత విజ్ఞానమును, దీని వెలుఁగు నందిన గ్రీక్ నాట్యకళను నెమకెను. వంగప్రకృతియందలి ఆవేశమునకు ఈతఁ డారాధించిన వైష్ణవసాహితియందలి ఆవేశముతోడై రవీంద్రుని హృదయమున నింకి పోయినది. ఈతని పాటలవలెనే, ఈతని నాటకములును భావనావేశముతో పొంగి పొరలుచుండును. నృత్యగీతము లందు మెండు. ప్రతీచీ సాహిత్యాచార్యుల పరిశీలనము, భారతకళోపాసకుల పరిశీలనము వేఱురీతుల వని, అధునాతనయుగమునఁ జూపఁగలిఁగిన వారిలో రవీంద్రుఁ డగ్రగణ్యుఁడు. పాశ్చాత్యసీమయందే విద్య నభ్యసించి, పాశ్చాత్యసాహితీప్రథలకు విశేషగౌరవము చూప నెంచిన ద్విజేంద్రుఁడు నాటకములు వ్రాయు నవసరమునఁ దన పాత్రల నున్నతాశయములతో నింపి, భారతీయులందు భారతీయుఁడ ననిపించుకొనినాఁడు.

కవి ప్రత్యేకప్రకృతియు, కవి దేశసంప్రదాయమును, కవి పరిశీలనమున తోలుకాడుచుండును. విభజనము కాక, సమన్వయు,

గ్రథనము లీతని యాశయములు కావున, అణువునం దానుషంగికము లైన ఎలెక్ట్రిన్సును వెతుకక, భువనముల నన్నింటి నొక్క దండగ గ్రుచ్చి ఆత్మకంధరమున దానిని దాల్చి కవి కులుకుచుండును. సూక్ష్మములను పరికించు పట్ల, వానిని కళోపాసకుఁడు తన కలమునకు గాని, తూలికకుఁ గాని చేర్చి రంగారు మేలిమి పూత వాని కొసంగును. కవి ధూళిని పరిశీలించుట దానిని పుప్పొడి చేసి వదలుటకే. సృష్టి గ్రంథములోని ఒక్కొక్క దృశ్యము ఒక్కొక్క యంకమై కవికి చూపట్టును. సృష్టిచిత్రములు స్వర్ణాక్షరపంక్తియై ఈతని కన్ను లెదుటఁ దోఁచును. సామాన్యపతివలె నీతఁ డల్పసంతోషి కాఁడు. భావక్షీరమును తరచి అందలి మీగడతరకల నీతఁ డాస్వాదించును.

కవి యంతరంగమునకును, సృష్టి యంతరంగమునకును నడుమ నిలుచునవి కవి కాయమును, సృష్టి శరీరమును. ఇవి రెండును వారాశీ గగనములవంటివి. ఒకే వన్నెఁ గలవి; ఒకదానికి వేఱొకటి ప్రతిబింబము. సింధువు కట్ట లెఱుఁగదు. ఎఱిఁగినను, నభమును తాకు మొగులుగట్టులుపోలు, కట్టల నందందు గాంచును. పాథోధి వియత్తలములు దిగ్వలయమునఁ గలిసికొనునట్లు, కవిహృదయమును, సృష్టిహృదయమును; కవి కను కొలుకులందు కలిసికొనును. సృష్టియందు తాను చొచ్చి, సృష్టిని తనయందు చొరనిచ్చువాఁడు మహాకవి. కావున కవి జగదీశున కీడువచ్చును. మనుష్య హృదయ మందుండి,* మనుజుని ఈశ్వరుఁడు తన యందులీనము చేసికొనును. ప్రకృతి హృదయమునఁ జొచ్చి ప్రకృతిని కవి తనయందు లీనము చేసికొనును.

---

* अङ्गुष्ठमात्र पुरुषोऽन्तरात्मा सदा जनानां हृदये सन्निविष्टः ।
हृदा मन्वीशो मनसाभिक्लृप्तो य एतद्विदुरमृतास्ते भवन्ति ॥
अणोरणीयान् महतो महीयान् आत्मा गुहायां निहितोऽस्य जन्तोः ।
तम् अक्रतुं पश्यति वीतशोको धातुः प्रसादान्महिमानम् ईशम् ॥
*Svetasvataropanishad*, Chap. III, Verses 13, 20.

కవి ఏమిచేతఁ బట్టినను, దివ్యపరశువేది స్పర్శనందినట్లది అపూర్వరూపునందును. బండరాతినైనను, మొండిబండనైనను, పెద్దమొద్దునైనను వర్ణించునపుడు కవిలేఖిని చిన్ని మంచుతుంపురులనో, చిఱునవ్వులు చిలుకు సూనవితానమునో, మినుకులీను నగలనో, మంచిముత్తియములనో వానికి చేర్చును. వేడిసెగలందు సేగులనుగాక ఆదర్శజీవనమునకు సాయపడు ఆలోకమునే చూపును. మాడి చల్లారిన కొరకంచురుచూచి, ఆశయసందీప్తమై, అది ఆత్మత్యాగమున బూదియైన జీవియని కవికుమారుఁడు నిరూపించును. నిష్ఠురుఁడైన సన్యాసిలీల, జగదీశుఁడొసఁగిన సౌందర్య రాశిని తన్ని వేయక, దాని నాతఁడు తన యక్కునఁ జేర్చుకొనును. ఈతని లేఖిని నందనములోని రొబ్బ. అదియున్న తావు సౌందర్యమండితమై, ఆనందపులకితమై, రసవత్కవితాకృతిఁ దాల్చును.

కవిపరిశీలనము కవిభావనమందును, కవిభావనము కవిపరిశీలనమందును నుద్భవించును. కవియొక్క భావనావేశము, కవియందే పొంగిపొరలదు. ఇది సముద్రతరంగమువంటిది. విశాలసింధు హృదయమున నెందో పుట్టిన అల చరచర ముంగలకు దుమికివచ్చి, కూలమందు తాఁకి దానియందు భావచైతన్యము పుట్టించును. చిరగీతము విను సాగరకూలము పులకితమైయుండదా? కవిహృదయమున పొంగిపొరలు ఆలోకవీచికలు పఠితమానసమును (వశ్యవాక్కు సభ్యుల ఎడందలను తట్టునట్లు) సోకి, అందు సాంద్రచంద్రికలను తళుక్కొత్తించు ఆనందోద్దీపనము కవిఆశయమని మనము తెలుపనక్కరలేదు. ఆనందమయుని చూచి, ఆనందింపని వస్తువేది? తనభావమును తనయందే జేసికొని, తనయానందమును గురింపించుచు, కవి గీతికలు పాడునని షెల్లీ తెలిపెను. (Vide: Shelly's

"Sky Lark") ఆనందమును పుట్టించుట ఈతనియుద్దేశమని వర్డ్సు వర్త్ అనినాఁడు. మాటలు వేఱుతీఱులు కలవియైనను, వీరిభావములందు పొరపొచ్చెములు లేవు. కవి ఆనందప్రవక్తుఁడై, ఆవేగభరితుఁడై నిలుచు నంతదనుక, ఈతని నెఱిఁగిన జడములును, జంతువులును కూడ కృష్ణ గీతమువినిన పశుపక్ష్యాదులవలె నిరతిశయాహ్లాదభరితాంతఃకరణ ములగుట నిక్కము.

భావనాపరిశీలనములు ప్రత్యేక కవియందు ప్రత్యేకాధిక్యము తోవిజృంభించియుండ, నీని ప్రసన్నతసందక పద్య...ల్లుటకు పెనగు లాడువాఁడు కవితామాధుర్యము నెఱుఁగక శుష్కజీవియగును. ఆలోచించి, ఆలోచించి పద్యముప్రాయువాఁడు, వెంటనే తన పద్య మును చక్కని గోరిలో పూర్చిపెట్టిన మేలు. తలమొట్టికొని, కను రెప్పలను కట్టివేసి, ఉస్సురస్సురనుచు, పిష్టముగట్టిన నాలుగు పంక్తు లను నిలువఁబెట్టునాతఁడు, కవితాహర్మ్యముపొంత ద్వారపాలకుఁ డగుటకైన తగఁడు. భావనాపరిశీలనములు హృదయమును నూతన సృష్టిచిత్రములతో నిండించుచుండ, సురభిళవాతూల ప్రవంతి యట్టులు కవివాక్కులు తెరలు తెరలై ప్రవహించును. సహజగాంగ ధారల కడ్డునిలుచుటకు గట్టుల దొరకైన శక్యమా? ధారాళవాగ్ధా టికి ఆనకట్టలు వేయుదుండగు లెవ్వరు? యౌవనవతి అంగప్రత్యంగ ములనుండి పుష్పించు సౌందర్యమును త్రుంపివేయుట ఎవ్వరితరము? ప్రకృతినుండి ఉప్పొంగు అనంతలావణ్యవారాశిని తృటిలో నాపోశ నము పట్టఁగల సంయమి ఏడి? అంతరంగమందలి భావకల్లోలిని అభంగలయతో, మధురపల్లవితో, మంజుల నృత్యముతో, నవ్వలఁ దోఁచుగాని, మూల్గుచు పొరలునా? అందమైన పువ్వు ఎన్నఁడైన ప్రసవవేదన చూపునా? కాంతినికను, విన్ను ఉదయశిఖరమున

నాక్రందన మొనరించునా? ఆత్మప్రకాశమెఱుఁగని కొండొక గొడ్డు మోతుపువ్వు నిగ్గినిగ్గి సౌందర్యోపాసకునకు సుగంధ విభూతిని ధార పోయఁగలదా? చీఁకటి నడిరేయివంటి తన గదియందు పడి, నిభృతమున కలమునకు మంత్రసానియై నిలిచి, చచ్చిచెడి పద్యమునొండీవలఁ బెట్టునాతఁడు కవి యెట్లగును? ఈతని లేఖినికనునది మురళీధరుఁ బోలు గీతిక కాదు. అది రోఁతపుట్టించు రక్కసి బిడ్డ కావచ్చును. లేక జీవము లేని వట్టి కళేబరము కావచ్చును.

కన్నున్నఁగాని, శిల్పము నెరవేరదు. జీవమున్నఁగాని, శిల్పము సార్థకము కాదు. ఈ జీవమును, ఆకన్నును భావనాపరిశీలనముల మేలుగీములు. అద్భుతసృష్టికిని, కళాపుష్టికిని, భాస్వంతాశయతుష్టికిని సుధామయ, ఆనందమయ, ఆలోకమయ అనంతజీవమునకును తలిదండ్రులైన భావనాపరిశీలనముల ప్రసన్నత చేకుఱుట ఎట్టివారికి?



# 8. మాతృభాష



సాహితికి అమరత్వము నిచ్చునది సహజభావము. ఇది యాత్మ తేజమున వృద్ధినందును. పఠితమనసున నవతరించుట కిది సరాసరి తెన్నునే కాంక్షించును. సహజోచ్చారణమే ఈ స్పష్టపథము.

సహజభావ మెందుండునో సహజోచ్చారణమును నందే యుండును. పూవురేఖలు పూవుభాష. పూఁదావి పూవుతలఁపు. చల్లనితలఁపు చక్కనిదళమున నున్నదని భాష్యకారుఁడొకఁడు దాఁపల నిలిచి తెలుపవలెనా? ఒకరివకాలత్తై ఆశపడక తనమన సిట్టిదని ద్రష్టహృదయమునకు పువ్వురేఖ తెలిపివేయదా? సహజ భావమునుండి సహజభాషను చించివేయు టెవ్వరితరము? ఒక్కండు రెండురీతులట్లగపడు అద్భుతము వానియందు లేదా?

పువ్వుకనుకలలు పూవుమోమున మంచుతుంపురులందు తళుక్కుత్తును. కవికలలు కవికన్నులందే ఇంద్రధనువులు చిత్రించును. పువ్వు మానసమునుండి వెడలు బుడిబుడినుడువులు కేసరములట్లు గోచరించును. సహజసాహితి కుసుమసదృశము. దానిభావము గుప్పున నుప్పొంగును. దాని చక్కందనము తావికెరటాలతో లేచు భావవాతూలమై మనసున సోఁకును.

ఒకరి ఉద్బోధము గాని ప్రేరణ గాని లేక పువ్వు ఆత్మవికసన మందును. పువ్వుహృదయమున నిదురించు సొబగు కిరణస్పర్శ నంది తనంతన లేచి పక్కున నవ్వును. మనుజుని హృదయమందలి సహజశక్తి ప్రకృతిస్పర్శ నంది పుష్పించును. కళలకు ప్రాపు సహజశక్తి. కళాకు

శలులు స్వాయంభువులు, స్వీయబోధకులు. వీరిలో సాహిత్యోపాసకులు ముఖ్యులు. వీరిభావములు, వీరిభాష వీరికి సహజమై, ప్రత్యేకమైయుండును. వీరిసహజశక్తి వీరిస్వాతంత్ర్యమునకు కన్నతల్లియగును.

తలఁపునకును, భాషకును అవినాభావసంబంధ మున్నదనియు, అంతరంగమంతైనను భాషయందే భావము జాలువారు ననియు మన శాస్త్రము వాకొనుచున్నది. తల్లితలఁపులందును, తల్లిజీవనమందును తొమ్మిదినెలలు పెరిగిన శిశువు తల్లికి ప్రతిబింబమై యుండి, జిలిబిలి పలుకులు తల్లియక్కున నేర్చి, తల్లినీడయందే భావిజీవనస్వప్నము లల్లికొనును. సాహిత్యము సహజమై యుండవలెనన్న, తల్లిమాట యందే అది యవతరింపవలెను. ఆత్మబీజమునుండి యుద్భవించిన భావము అంటుమొక్కవలె గుజ్జుగఁ బడియుండక అనంతకాలమునఁ దనశాఖలు చాఁపుచు అద్భుతవృద్ధినందును. శతాబ్దులును, సహస్రాబ్దులును దీనిశీతలచ్ఛాయయందు ఎంతేని హాయి నందును.

మాతృభాషమహత్త్వమును గుర్తించిన భారతీయులలో మొదటివారు వంగీయులు. ఆంగ్లమందు అభిజ్ఞత సంపాదించి, దానిని వంగమాతృకయందు గ్రుమ్మరించుకొనినారు. పందొమ్మిదవ శతాబ్దమునకు తొలుతఁ దోఁచిన ఆంగ్లకవులు వీరి కెంతేని భావనావేశము కలిగించిరి.

"ఐరోపాయందు లేటిన్‌భాష గ్రంథభాషగా నున్నపుడు ఐరోపాయందు సాహిత్యవృద్ధి లేదు. ప్రత్యేకభాషలు ప్రత్యేకసాహిత్యమును వృద్ధిచేసినపిదప బహుళసాహిత్య శక్తినంది ఆఖండమెంతేని ఉన్నతిని పడసినది. వివిధభాషలతో వెలయు భారతదేశమున నిట్టియభివృద్ధి గోచరించునుగాక. యావద్భారతమున కొక్క

భాష యనువాక్యమందు నాకు నమ్మకము లేదు. రాజకీయముగ నట్టి దొకటి అవసరమై యుండవచ్చును. భావవ్యక్తీకరణమునకు సహజమైన భాష మాతృభాషయే. ఆంగ్లమున పద్యము లల్లి, అభిప్రాయమునకై అపుడపుడు కొందఱు తమరచనలను నా కంపుచుందురు. వీరు ఒక్క మద్రాసురాజధానిలోనివారే. వీరు మాతృభాషలోనే తమ గ్రంథములు వ్రాసి, స్వీయప్రజల తీర్మానము నందుట మేలు. వీరి భాషయందు గొప్పందన ముండుచో దానిని నేర్చికొనియో, భాషాంతరీకరణములందు దానిసత్త్వను గ్రహించియో ఒరు లానందింతురు. అమూల్యనిక్షేపము గలిగిన దయ్యు వాడుకమాట కాని సంస్కృతము నేఁడు మనకు సాహిత్యోచ్చారణము కాఁజాలదు. ఇంగ్లీషును తొలుత చేఁబట్టినది మేము. అందలిశక్తి నెఱిఁగి మాభాషను వృద్ధి చేసికొంటిమి. ప్రపంచమహాసాహిత్యములలో వంగసాహితి ఒక్కటైనది.'' అని రవీంద్రుఁడు 1934 అక్టోబరుమాసాంతమున మేరీకళాశాలయందు (ఈ యంశములు పత్రికలలో వెలువడలేదు) తెలిపినాఁడు. ఇట్టి యుద్బోధనమును రవీంద్రుఁడు పెక్కేండ్లనుండి పెక్కుచోటులందు చేయుచున్నాఁడు*. రవీంద్రునినుడువులను ప్రతిదక్షిణసీమస్థుఁడును

* సింహళవాసుల నుద్దేశించి రవీంద్రుఁ డిట్లనినాఁడు :—"You have not yet been inevitably urged to take up that living instrument, your own language. You have not yet fully strung her and tuned her. You would have surely felt the necessity of it, if your soul were fully awake and if it responded to the ceaseless messages of beauty that come to you from your horizon and blessings that meet you from the bosom of your earth. You indulge in the vanity of mastering a language which is not of your heart and of your birth-right, which does not belong to

మననముచేసికొనవలెను. మన రాజధానిలో నేడు సాహిత్యమే లేదను భావము ఆతని హృదయమున తలచూపినని తెలిపిన తప్పుకాదని తలంతును. మాతృభాషకు మనము పెక్కుఆమడలదూరమం దుంటి మని అతఁడు గ్రహించినాఁడు.

---

your past nor to your future and owing to that obsession in her children, your country is waiting in vain for her wealth of literature which only can help her to discover her own soul and to bring out the treasure lying hidden in the lightless corner of her mind........I hope that my coming to your country will not end in an ephemeral sensationalism, that even when I leave your shore the memory of it will speak to you about the greatest of your problems, which is that of finding your own true voice—not that of your master—in your own language. In order to justify your existence, you must make yourself heard to your own self and to others. Do not waste your time and intellect in carefully imitating other people, however great they may be, imitating their idioms and being utterly lost in a vagueness of futile inanity. I shall consider myself as having failed in my message if I have not sufficiently impressed you with the truism that you cannot belong to yourself, if you do not produce your own literature as the truest document of the mastery of your mind, and also if I have not persuaded you to believe that you must have a continental background of your culture, which is the Indian background that will vitalize your thoughts and enrich your imagination."
సింధు రాష్ట్రీయులను గుఱించి అతఁ డిట్లు తెలిపినాడు: "........Modern Sind has contributed so little to the cultural renaissance that is sweeping over India to-day. This poverty is traceable,

భాషావిషయకప్రసంగము సలుపుచు ఆంధ్రదేశమందలి ఒకానొకచోటును పేర్కొని అందు సాహిత్యవాతావరణము లేదని నేననినపుడు, "కొథాయ్ ఆఛె?" ("ఎందున్నది?") అని రవీంద్రుఁడనినాఁడు. "అదిహృదయమందుండవలెను.—మీమాటయందడఁగియున్న భావమును గ్రహించితిని. మీరు నిక్కము వాకొంటి" రని నే నంటిని. మాతృభాషమీఁది అభిమానము మనలో సున్నయని నే నెఱుఁగుదును. ఆంధ్రు లందఱును ఎఱుఁగుదురు. సారస్వతమునకు గంగోత్తరియగు హృదయమును విదేశపుసరకుతో పూడ్చిపెట్టిన మనము సాహితీసేవకులమనియు, మాతృదేవి నారాధించు మహా

---

it seems to me, to the Sindhees looking for inspiration where only demoralization is to be had. Sindbees are under the shadow of a cheap, foreign, imported culture. It is a sight at once ludicrous and pathetic to see their young men strutting about in foreign dresses, muttering foreign accents, imitating foreign gestures. We in Bengal were the first to come under the foreign fascination, but we soon strove to free ourselves and in the process of refinding ourselves, we released forces which have given us a new pride, entirely our own. *We may learn from other people but we can get inspiration only from within ourselves.* My advice to modern Sindhees is to remember and by remembering to recapture the glory that once flourished on the banks of the Indus. Let them be themselves true to life that has nourished them for centuries and their old glory will blossom again."

చెన్నపురియందున్న పదమూఁడుదినములలో దాక్షిణాత్యుల కీపాఠము నాతఁడు పలుమాఱు ఉద్బోధించినాఁడు. "మీవిజ్ఞాన"మను తీవను మీటి "ఇదియే నాతుదివాక్కని పలికి, రవీంద్రుఁడు చెన్నపురియుపకులనుండి తరలిపోయినాఁడు.

నీయుల మనియు రవికవితో నెట్లు తెలుపుదును? కవిమాటలు భావగర్భితములు. అందు మోమోట ముండును. మోటుగ నాతఁడు మాటలాడఁడు. రవీంద్రుని "కొ థాయ్ ఆఛే" అనువాక్యమందు నే నెంతేని ప్రబోధ మందితిని. మాతృభాషపైఁగల నిరాదరము కడతేఱినపుడును, ఆంధ్రు లాత్మవికాస మందినపుడును, శక్తిగల సారస్వత సేవకులు ప్రజలచే గుర్తింపఁబడుదురు. స్త్రీలను సంబోధించుచు రవీంద్రుఁడింకను ఇట్లు తెలిపినాఁడు: "మారాష్ట్రీయులలో తొలుత మాతృభాషయెడల నిర్లక్ష్యము చూపినవారు పురుషులు. స్త్రీలే తల్లిమాటపై నభిమానముఁ జూపి దానిని నిలువంబెట్టిరి. ఇచటఁ గూడ మాతృభాషను స్త్రీలు కాపాడఁజాలుదురని తలంతును." చదువుపేరిట నేఁ డెందఱెందఱో పాశ్చాత్యవిద్యావ్యామోహాము నందును, ప్రతీచీసభ్యతానుకరణమందును సమయమును వ్యర్థము చేయుచున్నారు. మేరీకళాశాలయందలి బాలిక లెందఱో ఆంగ్లము నందే ఈఁదులాడుదురు. రవీంద్రుఁడు వీరి కొనరించిన ఉద్బోధనము సముచితమైనది.

చెన్నపురి విద్యార్థులసభయందు రవీంద్రుఁడు వంగభాషోద్ధరణమునుగుఱించియు, ఆయుద్యమముతో తనకుఁగల జోక్యమును గుఱించియు వివరించినాఁడు. "రాజకీయ, మత, సారస్వతోద్యమములు నదీమతల్లులట్లు బంగాళమునఁ గలిసినవి. నే నపుడే జన్మించితిని. మితిమీఱిన అలంకారములు భాషకు సంకెలలై యున్నపుడును, ప్రాఁతపద్ధతులప్రామాల పలువురు బద్ధాంజలులై యున్నపుడును, బంకించంద్రుఁడు భాషావిప్లవమును దెచ్చి నవీన రచనావిధానమును నిర్మించినాఁడు. మతవిప్లవమున నాతండ్రి పాల్గొని వెలిదైనాఁడు. పిన్ననాఁడే భాషోద్యమముతో నేను జోక్యముఁ గలిగించుకొన్నాను.

ఒకరు చెప్పినది వేదమని నే నెన్నఁడును నమ్మలేదు. నాకు తోఁచిన రీతిని, నాస్వాతంత్ర్యకాంక్షను పురస్కరించుకొని పండ్రెండవయేఁట నే కవిత చెప్పఁదొడంగితిని. రానురాను పలువురు నన్ను వెక్కిరించిరి. నారచనలందు చిక్కు లున్నవనియు, అవి ఎవ్వరికిని బోధపడవనియు పలికి పలువురు మాతులు విఱిచిరి. వంగవైష్ణవకవిత్వమును కొంత చదివి, దానిని మనసునకు పట్టించుకొంటిని. వెలియైతిని. నావెలి నాకు స్వేచ్ఛ నొసఁగినది...నాపద్యములు వంగపుష్పములు నిలుచు నంతకాలము నిలువఁదగిన వైనవి......కాలానుసారమైన మార్పు నందనిభాష వృద్ధిఁ గనఁజాలదు.'' అని యాతఁ డనినాఁడు. సాహిత్య విషయమున చెప్పఁగలవాఁడు రవీంద్రుని మించినఘనుఁడు నేఁడు పృథ్వియందు లేఁడు. ఆంధ్రభాషోద్ధరణమునకై శ్రమించు బుద్ధిమంతులకు రవీంద్రునినుడువులు చక్కనిదివ్వెలై యుండునని నా తలంపు.

సహజభావమునకు సహజమైన కాయము మాతృభాష యగుడు భావవృద్ధినిబట్టి యదియుఁ బెంపొందుచుండును. మనుజునిమానసము జడము కాదు. అనుక్షణ మది వృద్ధి నందుచుండును పరిపూర్ణత్వమును చేరఁ దలఁచు యాత్రికుఁడు మానవుఁడు. నిలుకడగ నిలుచు మానవుఁడు జీవము లేనివాఁడే. ఎడతెగక ముందడుగు వేయునాతఁడు మనుష్యత్వమునకు చేటు లేకుండ నుండును. తన గమ్యస్థానమును—వివిధజన్మఘట్టములు దాఁటియైనను—చేరఁగలఁడు. ఈతని హృదయమందు ప్రస్ఫుటించుశక్తి ఈతనియాత్ర ముగియువఱకు క్రొత్తదళముల నీనుచు వికసించుచునేయుండును. హృదయప్రసవమున తొలుకాడు మరందమే సారస్వతమునకు జీవమిచ్చు అమృతము. ఇది యమరేంద్రు నుండి ఖగనాథుఁడు తెచ్చి యిచ్చినది కాదు. ఆత్మనందనమున మనుజుఁ డందఁజాలు సుధ యిది.

ప్రపంచసాహిత్యాచార్యులు ఆత్మనందనమును కనుఁగొనఁ దప మొనరించి, ఉద్దేశసిద్ధి నందుదురు. సాహితీసేవకుఁడు సంయమి కాఁడు కాని తపసి. ఇంద్రియములకు తాళములు బిగించి ఇతఁ డంతరంగ మందు ఎందో కట్టువడి యుండఁడు. హృదయనిభృతమున కొండొక వడి తడసినను, అందుండి అపూర్వధనము నీతఁడు కొల్లఁగొట్టుకొని వచ్చును. సాహిత్యోపాసకుఁడు రసహృదయుఁడైన 'మునిమ్రుచ్చు'. కళాకామిని కొంపోవు మేఘవీథులం దీతఁడు తూఁగుటుయ్యాల నూఁగును. తారకలతో సయ్యాటలాడును. స్వాతంత్ర్యప్రియుఁడై ఎట్లు కావలయునని నీతఁ డట్లగును. ఒకపరి పరమహంసయై ఆత్మ దక్షిణేశ్వరమున తన్మయనృత్య మొనరించును. వేఱొకపరి నటరాజై వెలయును. ఇంకొకమాఱు జగన్మోహినియై దిక్కులందు వలపులు మేల్కొలుపును. మఱొకమాఱు మానససరోవరమున రాజహంసయై తేలియాడును. ఇంకొకతూరి అపూర్వవారిచరమై, ఆత్మరత్నాకర మునఁ గ్రుంకులిడి, వెలలేని మానికములు చేఁబట్టును. హృదయ కుంజమున నాత్మభావనాసంశ్లేషమున నాత్మవిస్మృతుఁడై యున్నతఱి తనయల్లికయం దీతఁ డెన్నేని భువనములఁ జేర్చుకొనును. నిభృత యోజనమున నిమగ్నుఁడై యుండ, అద్భుతభావవిద్యోతములు తళ్కొత్తి, ఈతని కను లెదుట దివ్యదృశ్యములు ప్రదర్శించును. వీనిని కాంచినంతన నీతఁడు నూతనావతారమందిన తేజస్వి యగును. సహజశక్తి చేయఁజాలని కార్యమేది? చేరఁజాలని తావల మేది? ఎరువుసొమ్ము బరువైనది. ఎంగిలికూడు నీచమైనది. ఆత్మనిర్భరత్వమో? ఇది ఆమ్నాయచతుష్టయమట్లు గురుగంభీరమైనది! వియత్తలము దీనికిగొడుగై దిగ్వలయమున వంగి జోహా రొనరించును. దీని కుఱఁగట నిలుచునది స్వాతంత్ర్యము. సృష్టికి ప్రతిసృష్టి చేయఁగలుగునది, దృఢ

నిశ్చయ ఇచ్ఛాశక్తులను తన స్యందనముపై నిలుపునది స్వాతంత్ర్యము. సహజశక్తికి స్వాతంత్ర్యము కుడిబుజము. ఇవి రెండును సాహిత్యము నకు ప్రాపులై, నూతనభువననిర్మాణమున దానికి సాయపడును. సాహిత్యోపాసకుఁడు సృష్టికర్త ఏల యగుచున్నాఁడో ఎఱుఁగవూ?

సాహితీవ్రతుఁడు జగన్మోహిని యగు వంటివికదా! జగన్మోహిని ఏజాతిజవ్వని యని అడుగువారెవ్వరు? కళకు వర్ణభేదములును, స్థలకాలములును అడ్డుగట్టు లగునా? కళాహృదయమునుండియు, కళావదనమునుండియు వెడలు దివ్యతేజము అస్తమయము నెఱుఁగునా? ఆశయములకు, ఆకసమున చిట్లు చుక్కమువ్వెపుచిప్పలకు, మహావ్యక్తులకు, కళలకు, మనుష్యసులభ వ్యత్యాసము లెట్లు సోఁకును? కళాకాంతకు భాషాబాధకము తేఁగల కట్టేఁడి కట్టుబాటేది? కొండొక మాతృభాషయందు అవతరించి, దానియందు బృందావనమాధుర్యమును ప్రవహింపఁజేసినశక్తి అందే కైదీయై యుండక విశ్వరూపసందర్శనమున నిజతేజమును విజృంభింపఁజేసి జ్ఞాన ధనంజయులను విజయక్షేత్రమునఁ బురికొల్పును. పుట్టినచోటునఁ గైదీయైయుండుభాష భాషకాదు. గొడ్డుమోతు గొడ్డేయైన నిది సాహిత్యము నెట్లీనును? ఇది పలువురతో సంబంధబాంధవ్యముల నెట్లేర్పఱుచుకొనును? గ్రీక్, ఫ్రెంచ్, లేటిన్, ఆంగ్లసారస్వతములు ఒక్కచో బిఱ్ఱబిగిసి నిలిచినవా? వీనియందలి విభూతి ఒకరు దాఁచఁ బెట్టుకొనిన సొమ్మయినదా? నేఁటి వంగసాహిత్యము? అన్నికడ లందలి అర్వాచీన సాహిత్యోపాసకుల కారాధ్యదేవత కాలేదా? నేఁటి వంగసాహిత్యమును, రవీంద్రుఁడును ఎల్లరహృదయపేటిక లందు నాదరస్థానము నందలేదా? "ఒహే! బిహంగ! ఒరే! బిహంగమా!!" యని ఆవేశపూరితుఁడై రవీంద్రుఁ డుచ్చరించిన పుడు దశదిశ లాతని శకుంతముదెస నెగయలేదా?

రవీంద్రుని ఆవేశమునుండియే ఆతనికవిత్వ ముబికినది. నిలిచి ఉపన్యసింపుమనిన, ఆతఁడు నిట్టూరుపు విడుచును. "చెట్లును, పక్షులును ఉపన్యసించునా?" యనును. కవిచంద్రుని హృదయము జగదీశుని చేతి వీణె. వీణియనిూటు అంగుళియున్నపుడే అందలి అమృత ప్రవంతి పొంగి పొరలును. అదృశ్యుఁడై బృందావనవిహారి సారస్వత వ్రతుని హృదయతంత్రిని మీటినపుడే ఆతఁడు విశ్వమోహనగీతికలు పాడును. సాహిత్యోపాసకులు విశ్వవిద్యాలయమునందును, పాఠముల కొలుములందును తయారుకారు. దీర్ఘపఠనము పాండిత్యమును ప్రసాదించునేమో కాని సాహితీవిభూతిని కాదు. పుష్పములును, కాంతులును, గీతములును, మనుష్యకర్మాగారమందు నిర్మింపఁబడు వస్తువులు కానట్లే సాహిత్యమును మనుష్యనిర్మితవ్యవస్థలందు నిర్మాణమందదు. దివితేజ మొక్కొకపుడు ఒక్కొకమనుజుని వాక్కులను తూరగొట్టములు చేసికొని భూతలమున ప్రవహించి సాహిత్యకేదారములు తనుపును. ప్రతి సాహితీవ్రతుని హృదయమునుండియు దివ్యశక్తి "నిమిత్తమాత్రం భవ సవ్యసాచి" యనుచు, మరీచిపంక్తుల నాతని లేఖినినుండి ప్రసరింపఁజేయును. జగదీశుఁడు ప్రత్యక్షమై పోతనను భాగవతము వ్రాయుమనెనఁట. మఱియొక మహాకవిని నిద్దుర పోనిచ్చి శారదాంబ నిశీథినీనిస్తబ్ధతయందు ఉద్గ్రంథమును లిఖించెనఁట. ఆధ్యాత్మికమైన ఆవేశము మనుష్యమానసము నాటపందిరి గావించుకొనినపుడే, అందుఁ జెవులపండు వొనరించుచు, కనులకు విందుసేయుచు సాహిత్యనృత్తగీతోత్సవము గోచరించును. కవియంత రంగము 'కమలభవనర్తనుని'చేతి జవనిక. మఱుఁగునుండి వెడలు కవితాభామిని దివ్యనర్తనుని మధురమంజులనిస్వనమునకు తనగీతమును, తనగమనికను మేళగించును.

ఆవేశము ఐహికమైనదనుట తప్పు. అది జాహ్నవీపూరము వంటిది. ఉపాసకుని హృదయశిఖరమునుండి యుఱుకులిడి అది స్వర్గమును తనయెడందయం దిడికొనియే యుండును. ఆవేశఝురి యందు అద్భుతదివ్యభావములు కొట్టుకొనివచ్చి కవిముఖమునుండి వెలువడును. గురుగంభీరకార్యములును, గురుతరకావ్యములును ఈ శక్తివలననే నివ్వటిల్లును. రాశిరాసులుగ మిన్నుపై ప్రోవగు సాంధ్య రాగములును, ప్రకృతిముఖమున చిప్పిలు అందంపుటలలును ఆవేశ సముద్భూతములే. గగనమునంతను దనరెక్కలమఱుంగునఁ జుట్టివేయ గమకించుచు రివ్వురివ్వున వాతూలమున నెగయు విహంగమునందు పరిఢవిల్లుశక్తి ఆవేశముకాక మఱేది? వికిరగీతికలను రేపకడ వసుమతీముఖమున వెదఁజల్లున దిదియేకదా! దీనికతననేకదా అనంత వారాశి అనంతకీర్తనము నాలాపించును! దీనికతననేకదా తమబొజ్జలం దిముడ్చుకొనిన రతనపుకణికలను మేఘము లింద్రధనువులని ద్రక్కి వేయును! దీనికతననేకదా వనలక్ష్మి కిలకిల నగును! దీనికతననేకదా మనుష్యహృదయమందు నిద్దురవోవు సహజశక్తి వేయిపడగ లెత్తి వేయిమణుల మరీచీగుచ్ఛమును సాహిత్యమున కప్పన మొనరించును!

ఆవేశ మెఱుఁగనివాఁడు కళారాధకుఁడు కాలేఁడు; మనుజుఁడే కాలేఁడు. లలితకళలందును, మనుష్యత్వప్రతిపాదనమందును వంగీయులు సిద్ధహస్తులై తమమాతృదేవి కంధరసీమయందు మహాపురుషులమాల్యమునొండు చూపఁజాలుటకు హేతువు వారావేశపూరితులగుటయే. వెలుతురుకల చోటున చీఁకటికి చోటు లేనట్లు, ఆవేశమున్న నెలవున భయమునకుఁ గాని, సంశయమునకుఁ గాని బ్రదుకు లేదు.

అనువదేండ్లకు మున్ను ఊరుపేరెఱుఁగని వంగభాష నేఁడు దివ్యసింహాసన మేల యధిష్ఠించెనో పాఠకులు గ్రహించియుందురు.

ఇందు నేఁ దెలిపిన రవీంద్రుని నుడువులు నా కథనమునకుఁ జేదో డగును. ఇఁక మనమో? వంగీయులహృదయశక్తిని, ద్రవిడులమేధా శక్తిని మనయందిముడ్చుకొనియుండియు, ఘనలను మనము గుర్తించు కొనక స్వీయసముద్ధరణమును కాంక్షింపక, సాహిత్యవృద్ధినుండియే జాతీయవృద్ధి గోచరించునని ఎఱుఁగక ఆత్మవిస్మృతులమై పడియుం టిమి. మన భాషయో? ప్రాచ్యఇటాలియన్ అని ప్రసిద్ధినందిన భాష యయినది; అనేకశతాబ్దులకుమున్నే విజయ నిశానములు నంబర వీథి నగిరింపఁజాలిన భాష మనయది! సౌందర్యమాధుర్యములకు పెన్నిధానము కాఁజాలుదునని నిరూపించిన భాష మనయది! నేఁడు మూలఁబడియున్న భాషయు మనయదియే! ఏల? ఖడ్గములు చేతఁ బుచ్చుకొని, మూతులు బిగించుకొని, భాషాసతిని విఱిచికట్టు పండిత ప్రకాండులే యుత్తర మీయవలెను. కాలానుసారమైన గమనికను జూపని భాషనుగుఱించి రవీంద్రుఁడనిన వాక్కు ఎల్లెడల వర్తించు సిద్ధాంతమేకద! రాతినగలందు నిలిచిన తెలుఁగు సర్వాంగసుందరియై ఎట్లు చూపట్టును? ఎట్లాంధ్రభాషాయోష ముందులకు జరుగును? ఆంధ్రహృదయమందలి సహజశక్తి విజృంభింపవలెననిన, ఆంధ్రసాహి త్యము పునరుద్ధరణము నందవలెననిన, ఆంధ్రభాష స్వాతంత్ర్య మంది తీరవలెను. వంగసీమయందువలెనే మనసీమయందును భాషావిప్లవము తలసూపవలెను. శతాబ్దులకుముందు శిలాగ్రంథములందు చెక్కఁ బడిన లక్షణసూత్రములును, వ్యాకరణనియమములును నేఁటికాగితము లందు పునర్ముద్రణమందినంతనే తమరాతిరూపును, తమకటికిమన సును మాపుచేసికొనునా? భాషాస్రోతమునకు ఆనకట్టయగుటకై వ్యాకరణము నిర్మింపఁబడదు. అట్టిది నిలిచెనేని, దీనిని దెగఁగొట్టుటకు కాలవిలంబనము కారాదు.

వంగీయుల రాష్ట్రాభిమానము, భాషాభిమానము జోడుచెలిమి కత్తెలై వృద్ధి నందినవి. ఈ రెంటిని హృదయసింహాసనమున నిలిపి, వంగీయుఁడు భక్తిపరవశుఁడై భజనచేయును. "అమార్ సోనార్ బంగ్లా" (నా బంగారు బంగాళము) అనియు, "అమారి బంగ్లాభాషా" యనియు ఆవేశపూరితుఁడై ఒకేస్వరమున నీతఁడు గీతాలాపన మొనరించును. రవీంద్రుని హృదయమునుండి వెడలిన గీతాపంక్తులు కొంతకాలమునకుమున్ను (1934 అక్టోబరు) చెన్నపురిరేడియోగుండా వెల్లివిరిసినవి:

"తుమారి కోలే, తుమారి బోలే, కోతోయి శాంతి, భాలో భాషా"
అమారి బంగ్లాభాషా,
ముదేరీ గర్బ్, ముదేరీ భాషా!"

(కోతోయి=ఎంత; భాలో భాషా=ప్రేమ; తుమారికోలే=నీ యూరువున; తుమారిబోలే=నీ పలుకున; ముదేరీ గర్బ్, ముదేరీ భాషా=మా గర్వము, మా భాష.)

రాష్ట్రాంతరప్రదేశములందలి ప్రజాహృదయములను రేడియోలు గావించుకొని మనకవులు, "మా బంగారు ఆంధ్రభూమి" యనియు, "శాంతిమయి ప్రేమమయి మా ఆంధ్రవాణి" యనియు నావేశపూరితులై యాలాపించిన దినమందే తెలుఁగుతల్లి జగద్ధాత్రియై శోభిల్లును. అట్టిశుభదినము ప్రభాకలితప్రభాతవిభూతిని ఆంధ్రభూమి యందెపుడు ప్రకుమ్మరించునో కదా!



# 9. నేఁటివాఙ్మయోద్యమము

ఆంధ్రరచయితలు ఉత్సాహవంతులు, మహావీరులును. రంగస్థలమున నిలిచి వీరు నెగ్గుకొనిరాఁగలరు. కాని ఎట్టిశూరులైనను ఒక సామరికవిధానము ననుసరించి నడువకున్నయెడల, వీరేదారియు తెన్నును ఎఱుఁగక చెల్లాచెదరై పరువిడుటో, బోర్లపడుటో, వెలికిలఁబడుటో, ఒకరినొకరు కొట్టుకొనిచచ్చుటో తటస్థించును. భావబంధురమైన నేఁటియుగమున జడపదార్థములట్లు పడియుండక, మన ఆంధ్రులు అద్భుతమగునుత్సాహమును జూపి నలువైపులకు నుఱుకులు వేయ నాతురపడుచున్నారు. ఆంధ్రవాఙ్మయోజ్జీవనమునకు అనువైన అదను నేఁడున్నట్లు ఈవఱలో నెన్నఁడును లేదు. మనతల్లికి క్రొత్తవన్నెను, క్రొత్తసొంపును ఈయఁజాలుటకు చక్కనితరుణము నేఁడు మనచేతులందున్నది. జాతిహృదయమును ఇటునటు ఊగిసలాడించు రాజకీయ, ఆర్థిక, సాంఘిక, మతహేతువులు నేఁడు మిగుల బలమైయున్నవి. ఈయీసమస్యలు తమ ప్రత్యేకాంగణముననిట్లు నిలుచుచున్నను, వీనివలనఁగలిగిన అద్భుత ఆంతరంగికచలనము సాహిత్యక్షేత్రమున నెంతేని మేలుగూర్చునదై యున్నది. ఇట్టి యుత్కృష్టముహూర్తమున ఆంధ్రప్రజ్ఞ పంచబంగాళీమైపోరాదు. నేఁటి ఉద్రేకము మహత్తరమైనది. ఉద్రేకము పిడికిలియందిమిడినపుడు యంత్రమందునిలిచి, పటువేగమున బండ్లవరుసను ముందులకుదుమికించు ఆవిరియట్లు పనిచేయును. నేఁటి ఉద్రేకము, ఉద్వేలము, ఉద్వేగము, ఉత్సాహము వాఙ్మయమునకు అద్భుతగమనిక నొసఁగజాలును. ఇట్లని యెఱిఁగియుండియు, తమయుత్సాహజంత్రమును పట్టాలపైనిలుపక, ఇష్టమువచ్చిన తెన్నునకు మనతెలుఁగులు పర్వొత్తనిచ్చుచున్నారు. ఆంధ్రగ్రంథకర్తలొకదారి నెఱుఁగక, ఒకయుద్దేశము నెఱుఁ

గక 'ఎవరికివారే యమునాతీరే' అనుచున్నారు. చెప్పనేల? కలములు విసరివైచి, గదలు చేఁబూని హుమ్మనుచున్నారు. ఒకవంకనుండి గ్రాంథికవాదులు, వేఱొకవంకనుండి గ్రామ్యవాదులు, మఱొకవంక నుండివీరును వారునుగాని స్వతంత్రవాదులు అస్త్రశస్త్రప్రయోగ ములు చేయుచున్నారు. శతాబ్దులకుమున్ను తయారైన మోకుముదు లను చేఁబూని మనపండితులు వీథిఁబడుచున్నారు! నేఁటి తారాజువ్వ లను వారిపైరువ్వుచు, వెఱ్ఱెత్తి వారుపర్వెత్తునపుడు మనయువకవులు నవ్వుచున్నారు! శుద్ధశ్రోత్రియమైయున్నగాని తెలుఁగు రూపుమాపగు ననియు, వెనుకటిసంప్రదాయమునుండి జరిగెనేని సంకరజీవనమున నది పడిపోవుననియు మడిగట్టుకొన్న పండితు లనుచున్నారు. ఎంతచక్కని చుక్కయైనను దశాబ్దులు, శతాబ్దులు కడచినయెడల అవ్వగాకుండ నుండదని ఈపితామహులెఱుఁగరు. రాగిడిచంద్రవంకలను, తమల పాకు మొగలిరేకులను, పోచీలు మిరియాలపేరులను, అడ్డబాస నత్తు లనుదాల్చి ఓపుత్తుక ఎదుటనిలిచెనేని చూచి, తాతలు మురిసిపోదు రేమోగాని, నేఁటికవికుమారులు నవ్వుకొని అవ్వలికి పాఱిపోదురు.

నిలిచి కాళ్లు తిమ్మిరలెక్కించుకొనకుఁ డనిసంతనే కొందఱు పరమానందయ్యలు కోతి కొమ్మచ్చులలోనికి దిగుచున్నారుగాని వాఙ్మయవనమందు నవ్వులురాలుచు కొమ్మలమీద హాయి నెఱుఁగ కున్నారు. కోయిలయు, కోతియుఁగూడ కొమ్మమీఁదనే మసలును. కొమ్మను స్వర్గముఁ జేసికొని మధురగీతకలుపాడు కవి కోయిల. కొమ్మను వెక్కిరింతఁజేసి కిచకిచలందు తలక్రిందులగు ఆకతాయి కోతి. ఒక రీతియు, ఒకనీతియు, ఒకనియమమును, ఒకసూత్రమును లేని పాలన మెట్లుకొనసాగదో సాహిత్యమును గొనసాగదు. వెనుకటిప్రభుత్వము నేడు నిలువకున్నను, నేఁటిప్రజాస్వామ్యపాలనము విచ్చలవిడినడవడికి చోటిచ్చు ననితలఁచుట తప్పు.

నాఁటిసూత్రములు నాఁటి పరిస్థితులందుఁ బుట్టినవి. నేఁటిపరిస్థితుల కవిసరిపడని అంగీలై బిఱ్ఱబిగిసియున్నవి. భాషాసూత్రములు మనుష్యులచేతియందు పెంపారునవి; ప్రకృతిసూత్రము లట్టుమార్పునకు, చేర్పునకు లొంగనివికావు. మోఁకుముడులను విప్పి, క్రొత్తకట్టుబాట్లను అవలంబించుటకు అందఱకును హక్కుఁగలదు. ఇట్టి హక్కును ప్రతియుగమందును, ప్రతిజాతివారును అమలు పఱచుకొనిరి. విడ్డూరమేమన? ఈహక్కున కడ్డుగ అనకట్టవేసి, జరామరణములతోఁ గృశించిన సంప్రదాయమును అక్కునఁజేర్చుకొని, సజీవములైన వాఙ్మయసూత్రముల పీక నులిమి, మేధాశక్తికిమాఱు జబ్బసత్తువ ప్రదర్శించి మనప్రముఖులు జెండాయెత్తి చాలకాలము నిటాక్కు నిలువఁగలిగిరి. వెఱ్ఱి మొఱ్ఱిమాటలును, పిడివాదములును, మొండిపట్టులును, గట్టికేకలును చిత్తమువచ్చినట్లు చాలకాలము బాణాకఱ్ఱ త్రిప్పఁగలిగినవి! చిత్రము! ప్రభువులును, ప్రముఖులును, ప్రచురణకర్తలును వీనికి హుషారు ఇచ్చిరి! మేఘవీథులనుండి దేవుళ్లు ఒకపద్ధతిని క్రిందికి దిగజార్చిరేని, కూడినదైనను, కూడనిదైనను ఆపద్ధతి రాజ్యచక్రమును త్రిప్పును! "ఇదికూడని హాయాము" అనిచెప్పువాని కెన్నివేల గుండెలో ఉండవలెను. పెద్దలుదిద్దిన పెద్దబాట్లు ఒరవల్లె నంతకాలము బరిదాటిసాగుట కెవ్వరును సాహసింపరు. మనదేశముయొక్క ప్రారబ్ధమేమన:—యీ ప్రారబ్ధము మానవసంఘమునంతను ఎదుర్కొనునదేమో!—అడుగుదాటుట ఎప్పుడు తప్పనిదో, ఎప్పుడు కూడనిదో ఎఱుఁగము. విమర్శించి, గుర్తించి, గుణమెఱిఁగినపిదప ఉచితరీతిని వర్తించుటపాడి. ఎవుటిఆచార్యుఁడు పెద్ద నూటపదునొకండు దిద్దినాఁడుకదాయని 'దేవా!' యని వానిపదములపై వ్రాలువారిని నేఁటియుగమునుండి అవ్వలికి తరిమిగొట్టఁదగును. వేషములువేసి, నాట

కములాడి ఎవరెంతకాలము రంగస్థలమున నిలువఁజాలుదురు? స్వర్ణ మరీచికలతో విశాలభాషాదిగ్వలయమున వ్రాయఁబడిన భాస్వంత స్వాతంత్ర్యాక్షరములు కనులకు మిరుమిట్లు గొలుపుచుండ, గదఁబూని గంతులిడు నిరంకుశత్వము లోఁతుగోఁతిలో పడిచచ్చి కాలక్రిమి కాహా రము కాదా? నేఁడు వసుంధరయందు మానవుఁడు పునశ్చరణ మొన రించు తారకమంత్రము స్వాతంత్ర్యమంత్రమే! నేఁటియుగశక్తి భాషాసేనకులకు ధృతినొసఁగినది! వాఙ్మయమందు స్వాతంత్ర్యమును, చలనమును ఉండవలెనని మనసోదరులు నిన్న గుర్తింపలేదుగాని నేఁడు గుర్తించిరి. తమ్మును తాము గుర్తించుకొనఁగలిగిరి. తన్నుఁదాను గుర్తెఱుఁగని హనుమంతుఁడు పనికిమాలినకోఁతియట్లు పడియున్నాఁడు. తన్నుఁదాను గుర్తించినహనుమంతుఁడు అజాండమునంతను అట్టిటు లాడించినాఁడు!

పదుగురు ఏలాతలఁచిన నది పరిపాటియగుట మానవలోకమున చూచుచుందుము. వారియభిప్రాయము తప్పైననేమి? సరియైననేమి? పలువురు బుజ మొడ్డినయెడల నిది శక్తినందును. గొప్పదైన ఆచార మని పరిగణింపఁబడిన అత్యాచారము పెద్దకాలము సింహాసనము నధి ష్ఠించియుండెనని రక్తాక్షరములతో వ్రాయఁబడిన ప్రపంచచారిత్ర ములు తెలుపుచున్నవి. మనవాఙ్మయమందుఁదోఁచిన నిరంకుశత్వమును ఇట్టిదే! దీనిపై ఎందఱో శుభాశుతలు చల్లిరి! రెండుసంస్కృతపద ములను, మూఁడు తెలుఁగుమాటలను, ఆవంత ఛందస్సును, నలుసంత వ్యాకరణమును నేర్చి భావదారిద్ర్యమున కృశించిన పద్యముల నెట్లో నిలువంబెట్టుచు పదిగజముల శాల్వలను గప్పుకొని ఈ నిరంకుశ త్వముచుట్టును పల్వురుపండితులు వందిమాగధులైరి! "బాబులారా! ఇది బానిసదన" మని చెప్పసాహసించిన వారిచెంపలు పెడేలు మన్నవి!

ఆహా! చెంపపెట్టున కెంతమహత్త్వమున్నదో! ఒక చెంప నొకఁడు వాయించినపుడు రెండవచెంపనందీయుఁడని క్రైస్తు ఊరక చెప్పినాఁడా? నాఁడు మహనీయులగు భాషాసేవకులందిన చెంప పెట్టులు నేడు మణిమకుటములై వారిశిరముల నలంకరించినవి! ఉన్నతాశయముల నణఁగఁ ద్రొక్కఁజాలువారెవరు? రక్కసులట్లు ఉక్కుమీఱి ప్రవర్తించువారు కొందొకవఁడి వాని నణఁపఁజాలిన నేమి? అవి యడఁగియుండవు. పెళపెళమని స్తంభమును విఱిచి ఈవలికుఱికిన దేవదేవునివలె, నిర్బంధవిధానమునుండి అవి వెలుపలకు లంఘించి, ముల్లోకములను జయింపఁజాలును. దుష్టగ్రహములన్నియుఁగూడ పిడుగులు రాల్చిననుసరే, యమలోకము కదలివచ్చి నిప్పులుచెరిగిననుసరే, సత్యమును, స్వాతంత్ర్యమును నెగ్గితీరును. కావుననే గిడుగు యోధుఁడు మున్నగువారు నేడు సింహనాదము చేయుచుండిరి. ఇరువదేండ్లకుమున్ను గిడుగుపీరుఁ డందిన వెక్కిరింతలు గులాబిరేకులై నిన్నమొన్న రాజమండ్రిలో ఈతని వృద్ధశిరముపై చిందులు త్రొక్కినవి! నాఁటి ఈతముండ్లు నేఁడు మధురగీతికలైనవి! నాఁటిమోకుదెబ్బలు నేఁడు పుష్పమాల్యములైనవి! నాఁటి ఈటెపోటులు నేఁడు తారహారములైనవి.! "నాఉద్దేశము గొప్పది. నన్ను మీఱెఱుఁగరు. నాకు నేఁడుముట్టునవి తాపులును, తన్నులును. నేను నేలఁగూలినను, నిజము నేలఁగూలదు. నేఁడు గాకున్న తేపది అసత్యమును 'చక్రధారలఖండనఁ' జేయు"నని గిడుగుమహోపాధ్యాయుఁడు నాఁడు పలికినాఁడు. గట్టి గుండెకలవాఁడు. గుండెయం దోరిమిని బిగపట్టినాఁడు. నేఁడు తన "కల్యాణి"ని ముందుల కుడాయించు రాణాప్రతాపుఁడై వాఙ్మయోద్యమమును నడుపుచున్నాఁడు. వాఙ్మయవసుంధరయందు నేఁడు తోఁచు అద్భుతదృశ్యమును విలోకించి సాహితీయోధులు తమ తేకు నాధిక్యనకుఁ బోనిత్తురుగాక!

వాడుకమాటను ముందు నిలిపి, వెన్కకుండితూపులు వదలుట తమ కర్జముకాదని ఇఁక భాషాసేవకులు గుర్తింతురుగాక. వాడుకమాటలప్రయోగమైనను వట్టి మాటలపని కాదు. వడవడ వాగువాండ్రందఱు వ్రాఁతకాండ్రే యైనయెడల, నేఁడు పుస్తకములకుకూడ బర్త్ కంట్రోల్ (Birth Control) అవసరమైయుండును. ఎల్లఱును వాడుమాటలనే వ్రాఁతగాండ్రును ప్రయోగింతురుగాని, లేఖకులప్రయోగము వేఱుతీర్తైయుండును. తెలుఁగుమాటలు పదితెన్నులకు తక్కువకానివై యుండుటచే ప్రయోగసందర్భమున వీనికొక నియమ మేర్పఱుచుట ఉచితము. అభినవాంధ్రోద్యమనాయకుల భాషాప్రయోగములు నిఘంటువులందును, వ్యాకరణములందును చోటు నందెనేని, భావిభాషాసేవకులపథమున నవి మైలురాళ్లు కాఁగలవు. కేసును నెగ్గించుకొనఁజూచు న్యాయవాదికి 'అధికారములు' (Authorities) ఎంత ఆవశ్యకములో లేఖకునకును అవి ఆవశ్యకములు.

వాడుకనియు, వాడుకకాదనియుఁ బెనగులాడనేల? భాషలో ప్రత్యేకజాతితిలకము లెందులకు? భావమునకు ఉచితమైనభాషను భావమే అల్లుకొనును. తనఘట్టమును తాను గుర్తించియే భాష నడచును. శైలికిని, కవిత్వమునకును దారిచూపఁదలఁచునాతఁడు శైలియననేమో, కవిత్వ మననేమో ఎఱుఁగఁడు. శైలి సంకెళ్ల నొల్లదు. బంగారువైననేమి? అవి సంకెలలే!

భాషాభ్యుదయమునుకాంక్షించు కళోపాసకులకు చేదోడగు ప్రచురణకర్తలును, భాషాపోషకులును రంగస్థలమున నిలువవలెను. తెలుఁగునేలలో గ్రంథకర్తలకును, విజ్ఞానులకును కఱవుండదు. పండితుని విజ్ఞానముగాని, కవి మధురోక్తిగాని ప్రజలందు ప్రవేశింపదేని ఈ కవియును, ఆ పండితుఁడును బ్రదికినను, చచ్చినను ఒక్కటే.

కవులను పోషించి ఒకప్పుడు మనరాజులు సాహిత్యవధూటికి ఉన్నత పీఠము నిచ్చిరి. ప్రజ్ఞగలకవులును, పండితులును భావబంధురమైన నేటివాతావరణమున పుట్టుచున్నారు. వీరిప్రజ్ఞను గుర్తించి, వీరి యందలిజ్యోతి కింత తైలముపోసి భాషామందిరమున "జే! జే!!" అనుమహనీయులు నేఁ డెందఱో లేరు.

ప్రచురణకర్త కవికి దిక్కు. నేటియుగమున ముద్రణాయంత్రమునకుఁ గలశక్తి నాఁటి సుదర్శనచక్రమున కైనను గలదో లేదో! ముద్రణముఁగాని, ప్రచురణముఁగాని ఎఱుఁగనికవి ఎంతవాఁడైననేమి, ముసుఁగుఁదన్ని, మూలఁబడి ముక్కి పోవలసినదే! భగ్నమనోరథుఁడైన గ్రంథకర్తను బ్రదుకే లేదు. సృష్టికర్తయగు గ్రంథకర్త చచ్చిన యెడల ప్రజలు ఉట్టిగట్టుకొని వ్రేలాడుదురా? భావసంచలన మెఱుఁగక మడ్డిగోతిలోఁ బడి వీ రెంతకాలము మునిఁగియుందురు? నాగరకతకును, మనుష్యజీవనమునకును వాటిలు ఈ ఘోరవిపత్తును దునుమఁజాలినవారు ముద్రణాచక్రమున కధికారులగు ప్రచురణకర్తలు. ప్రకటనకర్త లాంధ్రభూమియం దున్నారు. కాని, భాషాసేవ ప్రజాసేవకులను ఆశయములుగాఁగొని తమ జంత్రములను నడపువారిసంఖ్య మిగుల తక్కువైనది. పోటీవ్యాపారమునకు డీకొనుచు, గ్రుడ్డిగవ్వకు కొఱగాని పుస్తకములను బండ్లకొలఁది రైళ్లలోని కెగుమతిచేయు మహాశయులు విజృంభించుచున్నారు. దరిద్రులగు గ్రంథకర్తల దుస్థితిని తమ యండగావించుకొని, స్వార్థపరులై, రూకలు కొల్లబోసికొని మసలు ప్రచురణకర్తలుకాక పవిత్రసేవాధర్మమును నెఱపుటకై ముందంజ వేయుప్రకటనకర్తలు మానవాభ్యుదయమునకు అక్కఱైయున్నారు. నేటి వాఙ్మయోద్యమమున వీరితోడ్పాటు మిగుల నావశ్యకమైనది.

గ్రాంథికవాదులును, గ్రామ్యవాదులును, తమవిగ్రహమును తుదముట్టించి, చేతులు కలుపుకొని, "అఖిలాంధ్ర సాహితీసభ" ఒకటి!

ఏ కూటను కూడు ఏర్పాటొనరించి, ప్రథమసమావేశమున "భాయి భాయీ!" యనుచు గలిసికొనవలెను. భాషాహృదయము మెఱుంగిన ప్రముఖులీసభయందు పాల్గొనవలెను. అన్యభాషోద్యమముల గమనికను దెలుపఁగల భాషాసేవకులును ఇందుఁ బాల్గొనుట యొప్పు. ఈసభ యొక్క ప్రథమసమావేశము ఆంధ్రకళాపరిషత్తు నిలిచిన తావున జరుగుట ఉచితము. ఇది కూడిననాఁడే ఆంధ్రచరిత్రయందు అపూర్వమైనఅధ్యాయము స్వర్ణాక్షరములతో లిఖింపఁబడునని నేఁడు జోస్యము చెప్పఁగలను. ఈ ఉద్యమమున విశ్వకళాపరిషత్తుయొక్క తోడ్పాటు అనివార్యము. పాలకులును ఇందులకు చేదోడీయవలెను. ఈసభయందు వెలువడు తీర్మానములు అధునాతనసారస్వతమున శిలాక్షరములై ప్రవేశించి, భావివాఙ్మయసేవకులకు మేలుబంతులు కావలెను.

విశాల ఆంధ్రజీవనమున, అధునాతనయుగమున తలసూపు సంప్రదాయములను మన్నించు ఉద్గ్రంథము తలసూపిన, మిక్కిలి మేలు చేకుఱును. "పాంచజన్యం హృషీకేశో దేవదత్తం ధనంజయః" అనికదా గీతాచార్యునివాక్కు! ఈ యుద్గ్రంథము "పాంచజన్యము"ను పూరించినంతనే దేవదత్తమును పూరింపఁగల విజయగ్రంథములు తోఁచుటకు విలంబముకాదు. విషాదయోగమంతరించి, శంఖప్రకరణము గోచరించినంతన, కురుక్షేత్రవిజయ మెంతదూరమున నుండును? నేఁడు కురుక్షేత్రమైయున్న ఆంధ్రవాఙ్మయము అచిరములో ధర్మక్షేత్రము కాఁజాలకపోదని నాఆశ. నూతనయుగభారతమును ఆంధ్రుల కీయఁజాలు భాషాసేవకులప్రతిభ దిగంతములను ముద్దిడుకొనదా?



# 10. లలితకళలు - నవ్వు కెరటాలు

సృష్టికి సొంపు నవ్వు. సృష్టి ప్రకృతియందున్నది. మనుష్య జీవనమందును, సాహితియందును అది కలదు కదా! ఉదయమున తూరుపును జూడుడు. నవ్వు తళ్కులు ముందులకుఱుకును. మంచు తుంపురులందుఁ జొచ్చి అపూర్వ సృష్టిని కనులకుకట్టును; శిశిరసీమం తిని ఎడందయందు ఇంద్రధనువులు నిర్మించును. మినుకులీను రాగ ములను కుప్పించును. భువనములనునింపు భావమరీచులఁ బ్రసరించును. మక్కువపడి నగుమోముకిరణము చుంబించినంతన ముకుళితమైయున్న సరోజహృదయము ప్రఫుల్లమగును. ఆత్మప్రతిరూపమును కాంచి అంతరంగమందలి దివ్యమానసౌకము తన్మయభావనావేశమున నృత్యము సలుపులీల మయూరప్రేమస్పర్శనందినంతన, కమలహృదిఁ గల సచ్చిదానందములు ఉప్పొంగి కల్హారమును సౌందర్య సామ్రాజ్యము చేయును! నవ్వుచుఁ చందురుఁడు మొగులుదాపలఁ దోఁచినంతన, కనులెత్తి కైరవము పులకితదళాంగములందు శశికరములను పెనవేసికొనదా? సృష్టినంతను మల్లెపువ్వులప్రోవుచేసి, విశ్వమానసమును మధుమయమొనరించి, దిక్కులను, దిగ్వలయమును పరిమళించునది ఆనందహృదిఁగల నవ్వుగాక మఱేమి?

ప్రకృతినుండి గృహమునకు తరలుఁడు. నవ్వుచే కలకలలాడు గీము నాకమునకు మేలుబంతి. నవ్వుచిమ్ము బాలకుని చూడుఁడు. పృథ్వియందలి మడ్డికట్టల నెఱుఁగక స్వేచ్ఛమెయి బాలకుని అంతరంగమందలి అనంతానందము తెరలుతెరలై, నవ్వు కరళ్లై, గృహమున సుఖధుని నుప్పొంగించును. నగుమోముబుడుతని వదనము దివ్యభావముల సదనము. ప్రణయునిముఖమును చూడుఁడు. మెఱుపు

ద్రాంతరలట్లు హృదయాకాశమునుండి చివాలున నెగసివచ్చు నవ్వు వెళ్కులు దానిపై అద్భుత భావోదయముఁ గల్గింపవా? తళ్కులను ప్రోవుచేసి అందుండికదా తన్నుపోలు మోమును నవ్వుఁగల ఎడద సృష్టించును! తియ్యనైన తలఁపులు అంతరంగమున చిగిరించి నవ్వు పువ్వులై అవ్వలఁదోఁచును. హాసనకుసుమితమైన దృశ్యమందేగదా అంబురాశిరత్నములకు మిన్నయైన కయితకయిసేతలు కాంతిలును! ఆనందమయియైన హృదీశ్వరి తీవయిల్లాలుపోలు సుందరి. ప్రతిహృదయము సుధాబంధురమైనది. సుధయు, స్వర్గమును, సౌందర్యమును కవితాసామ్రాజ్యమందును, కవిత్వసంపదఁగల గృహసామ్రాజ్యమందును ముగరమ్మల మూలపుటమ్మయగును. పేరు? గృహలక్ష్మియనుఁడు, భాగ్యలక్ష్మియనుఁడు—మీయిష్టము.

అగ్నికణముల కెనయైన ఇడుములందుఁ బడిన మనుజుఁడు ఆనందమయియైన అర్ధాంగినిచూచి ఆత్మవిస్మృతుఁడగును. సంసారము సాగరమందురా? అగుచో, మనుష్యసృష్టి కలకలలాడుచుండక చాల కాలమునకు మున్నే దుఃఖమున బుడుంగుమని యుండును. బుడుంగుమను పున్నదందురా? అగుచో, సింధువులోని రతనములను ప్రోవు చేసికొనుట కందును. గృహము రమ్యస్థలము కాని దుఃఖమున కాట పందిరికాదు. తోఁటను చూడుఁడు—పండ్లుండును. పువ్వము లుండును. సుగంధ ముండును. పచ్చందన ముండును. మధురకూజిత ముండును. అంతర్వాహినియై, ఆనందమన్నిఁటియందును ప్రవహించు చుండును. గేహమందును పిందెలుపోలు చంటిబిడ్డలును, పండ్లఁబోలు బాలకులును, ననలుపోలు చెలిమికత్తెలును ఉందురు. అంతఃసలిలయైనసరస్వతియట్లు ఆనంద మెల్లహృదయములందును స్రవించు చుండును. ఆనందమును, అనురాగమును, అమృతమును, ఆలోకమును

వెలారించుచు, దివ్య సౌందర్యముతో కలకలలాడు నివనతి నందన వనముకాదా? గృహజీవనమున పక్కమను నవ్వులతోఁట నందన వనమునకు మాఱుపేరు కాదా ?

మనుష్యజీవనమును నవ్వు ఆనందమయ మొనరించుటయేగాక ఆధ్యాత్మికవిభూతిచే ప్రభాకలితముగావించును. గద్దించిచెప్పినసుడువు గాక నవ్వుచు పలికినమాట చక్కందనమును చూపును. కసిపూని, కట్టనెత్తుచేయికాక కరుణించి కడకు చేర్చుకొనుకరమే విజయధ్వజ మెత్తును. కారుణ్యము, క్షమ, ఆనందమును, కవివాక్కునం దిముడు భావనిక్షేపమట్లు నవ్వుతళ్కునందు నిహితమైయుండును. ఇట్టితళ్కు పిశాచమునుకూడ మార్చివేయును. కినుకమంటచే భుగుల్భుగుల్మను మొగముఁ జూచి పాపి నిరయకుండమట్లు జ్వలించునుగాని నగుమో మును చూచి చేతులు మొగుచును. నవ్వునుండినెడలు అదృశ్య ఆధ్యాత్మికద్యుతి సూటిగా నాతని హృదయములోనికి చొరుచుకొని పోయి, తమసావగుంఠములు దాలిచి నృత్యముచేయు పైశాచికప్రవృ త్తులను తఱిమివేసి మఱుగుపడియున్న దివ్యశక్తిని హృత్పీఠిపై నిలు పును. ఆనందాలోకమందిన ఆతని అంతరంగము విప్పారును. విప్పారిన కమలమునుండి లక్ష్మి ఉదయించునుకదా! వికసితహృత్కమలము నుండి ఎట్టి భావవిభూతి ఉత్పన్నమై జీవమునంతను సురభీకరింపదు! తత్త్వశాస్త్ర మతశాస్త్రములు వాకొను ఐహికపునర్జన్మ ఎందుండియో కొట్టుకొనిరాదు. క్రైస్తవులు పేర్కొను జగదీశునిరాజ్యమును (Kingdom of God) హిందువు లుల్లేఖించు దివ్యబృందావనమును ఎందో లేవు.—ఎందుండియో ఊడిపడవు. శరీరముచచ్చి, వేఱొక శరీరమై వసుంధరరంగమునఁ దోఁచుటకుమున్న పంకిలమయమైన మనసు చచ్చి, ఒక్కదివ్యభావస్పర్శచే పునర్జన్మనందిన ముహూర్త

మందే మనుష్యజీవనము అమరులకు లీలాభూమి కాదగు రమ్యా రామము కాఁగలదు! ముండ్లపొదలుపోలు పాడుతలఁపు లంతరించి సుహితభావసృష్టితో కుసుమించు మనసు దివ్యబృందావనమే కాదా? దివ్యభావసందీప్తమైన నవ్వులతోఁటను చూచినపుడును, గురుగంభీరమైన మనుష్యచారిత్రమును కాంచినపుడును, రాళ్లు పువ్వులగును; ముండ్లు కుసుమకేసరము లగును; కడగండ్లు కల్పతరుఫలము లగును; పిశాచములు దేవతలగును. ప్రపంచసాహిత్యమును తెఱచిచూడుఁడు. ఎన్నేని దృష్టాంతములు కనులెదుటఁదోఁచును. షేక్స్పియరు చూపిన Alchemy ని అటుంచుఁడు.—గభీరభారతసాహిత్యఖనిలోని Alchemy ని చేతఁబట్టుఁడు. మానవు నమరునిఁజేయుటెట్లో ఎఱుఁగుదురు. నరకమును దిగఁద్రొక్కి నాకమును అరచేతిచెండు నొనరించుటెట్లో ఎఱుఁగుదురు; సంకటకంటకపూరితజీవనమును ముద్దులొల్కు క్రొన్ననలతో చిగిరించు నవ్వులతోఁటఁ గావించుటెట్లో ఎఱుఁగుదురు.

నవ్వును పుష్పించు హృదయమున ఇచ్ఛాశక్తి దృఢనిశ్చయములు నిలిచియుండును. అంతరంగదిగ్దర్శికనుబట్టి చూచితిమేని, పుష్పాడియందు మేరువుహిమగిరులు చూపట్టును. బ్రహ్మాండమునంతను నిండియున్న సృష్టికర్త వడ్లగింజకంటెఁ జిన్నవాఁడై, మనుష్య హృదయమందున్నాఁడని ఉపనిషత్తులు వాకొనుటలేదా? ఇట్టి హృదయమున మనమింకను గుర్తింపని అద్భుతశక్తులెన్ని లేవు? తన్ను తా నెఱిఁగినవ్యక్తి అరిష్టములదెస భ్రుక్షేపించునా? గులాబి కొమ్మను చూడుఁడు. కొమ్మపైముల్లు ముందుఁదోఁచినది. అట్లనివృంతము దలి ఆత్మజంకినదా? తన్ను తా నెఱిఁగి, కంటకముదెస కన్నెత్తక తనశక్తిని పుష్పించుకొన్నది! ఇది ఆత్మవ్యక్తీకరణముకాదా? ఇన్ని సన్ రవీంద్రులు, **Self-Expression Self-Realisation** లు **Sovereign**

power, Salvation, లను ఇచ్చుననిది. వీని నాత్మజీవనమున అను వదించినది గులాబిపువ్వును, దానినిపోలిన మనుజుఁడును అని కన్ను కల మనీషులెఱుఁగరా ? జగదీశునిచూచి వెడగుచూపుల్లు పఱపు శని (Satan) యట్లు, ఏలికనుచూచి ఒకతట్టున నిలుచు బానిస యట్లు, పట్టమహిషినిచూచి తనవాలకమునకు వగచు పరిచారికపగిది పుష్పమహత్త్వమును చూచి కంటకము తననైచ్యమును దాను తలంచికొని సిగ్గిలదా ? పుష్పమహత్త్వమున ఆశయముల ఆత్మ ప్రకాశముకదా చూపట్టును ! పుష్పసౌందర్యమంతయు నీప్రకాశము నందేకదా యున్నది ! "సత్యం, శివం, సుందరమ్"లు ఆత్మయెందు ముఖ్యాశయములు. సత్యమ్ సుందరమ్ అనియు, సుందరమ్ సత్యమనియు పలికినాఁడు కీట్స్‌కవి. ("Beauty is Truth Truth is Beauty.") సౌందర్యము కేవలము కన్నును ఆకర్షించి అదృశ్యము కాదు. అంతరంగమందలి శక్తులను పరమహంసలట్లు నృత్యము చేయించును. పుష్పసౌందర్యమున తోఁచునవేమి ? ఆనందమును, నవ్వునుకావా ? పువ్వునవ్వున బ్రహ్మాండమెట్లిమిడియున్నదో !

నవ్వునచిమురునది హాస్యరసము. హాస్యరసము శృంగారరసమునకు తోడంబుట్టువు. రసములన్నియు భావనమునుండియే పుట్టును గదా! భావనము పురాణములలోని కమలకాసారమువంటిది. ఎందఱెందఱో బ్రహ్మరాక్షసులాసరోవరమున మునిఁగి శాపముక్తులై సౌందర్యతిలకలయిన గంధర్వాంగనలైరి. కవిభావమున దొరలిన క్రూర మకర మొకటి ఉలూచియైలేచి సవ్యసాచి ఆత్మకు కంఠమాల యైనది! కవిభావనమున మునిఁగిన మొసలి మఱొకటి ధాన్యమాలియై, మారుతి ప్రోలనిలిచినది !! కవిభావమున మునిఁగిన పాషాణ మొకటి అహల్యాహృదికలదై, కళాభిరాముని పాదము సోకినంతన అందమును

పొటకరించు జవ్వని కాఁగలిగినది !!! భావనమునుండి ఉత్పన్నమగు రసముల కరళ్ళయందు హాస్యరసవీచిక పెద్దది. తక్కిన రసములొక వంతు, ఇది యొకవంతు. దీని నెఱుఁగక తక్కినవానిని తనవి చేసికొనిన కవి, కవిత్వము నేర్చిన చట్టుబండ యనుపించుకొనునుకాని జీవకళ ప్రదీప్తహృదయుఁడై, రెండవసృష్టికర్త యనిపించుకొనఁడు; గ్రుడ్డి కొక్కిరాయి అనుపించుకొనును గాని కోటికన్నులుగల వేలుపు యని పించుకొనఁడు. నవ్వ నెఱుఁగని హృదయము నరకముయొక్క ఛాయా చిత్రము. హాసనహృదయుఁడుకానివాని వ్రాఁత తుమ్మమొద్దువలె నుండును. ఇతఁడు రౌద్రరసము చూపును. మొద్దు అపుడు చిటచిట మనును. ఇతఁడు శోకరసమును చూపును. అపుడు తుమ్మమొద్దు నంటినజిగురు నీరయి దిగజారును. హాస్యరసముసోకిన మొద్దులును, మోళ్లును, మొరళ్లును పండువెన్నెలలయి సాహితీవసుంధరను భావ సందీప్తము కావించును. మహాకవు లందఱు హాస్యప్రియులే! షేక్స్పియరని, కాళిదాసని ఎందఱెందఱి పేరులనో గొంతెత్తి తెలుపనక్కర లేదు. సామాన్యులందఱు చవిచూచు లేమ్బ (Lamb) ఎడిసన్ (Adison) నుల రచనములు హాస్యరసములతో తొలుకాడుచుండవా? మంటలు గ్రక్కు దృశ్యములందుసయితము షేక్స్పియరు తన విదూషకుని నిలిపినాఁడు. కారణము? బాహ్యప్రకృతికిని, మనుష్యప్రకృతి కిని, సాహితికిని సహజమైనది ఆనందము. ఒకచోటున ఆర్తి గొడ్డు గేదెవలె అఱచుచున్నను, ఆ అఱపును గూల్చివేయు మధురగీతికను ఆలాపించుచు, శోకలహాపున ఆనందము పొడఁగట్టుచునేయుండును. ఈఆనందమే ఉత్తమసాహితికి మహత్త్వమిచ్చినఆశాశక్తి(Optimism). డొంకలందును జగదీశునిజ్యోతి వెలుఁగుచుండునని మహాకవి బ్రౌనింగ్ (Browning) వల తెలిపినాఁడు? దుఃఖమయమైనదృశ్యములపై

కడవలకొలఁది ఆనందము నేల గుమ్మరించినాఁడు? చచ్చినవానికి సంజీవి యగు నాశక్తి తొమ్మిది నెలలు మోసి కనిన ఆనందముయొక్క గారాబు బిడ్డ. ఆనందమో? శృంగారశయ్యపై హేలితకాయుడై శయనించి, శుభముహూర్తము నాహ్వానించుచు బుడ్లకొలఁది హాస్యరసమును గుటకలు వేసిన ప్రణయిని కాదా? ఇట్టి ప్రణయినికి లలితకళ లన్నియు నవ్వుదోఁటలు. పరికించితిమేని, వీణాతంత్రియందును, చిత్తరువుల సొంపునందును, నృత్యగమనమందును ఎంతో నవ్వుండును. కావుననే కళాకౌశలమును చూచినపుడు మనహృదయములు ఆనందవీచికలచే, నవ్వుకేరటాలచే ఉప్పొంగును.



# 11. విమర్శనము, లలితకళాభ్యుదయము



సాహితికి ఆయువు భావము. రచయితభావము అవతారముఁ దాల్చిన జగదీశునివలె పంక్తివితానముపై ప్రత్యక్షము కాదు. అక్కరములు నిమిత్తమాత్రములు. నిమిత్తమునుజూచి, నిభృతనిక్షేపమైన భావమును తెలుపుకొల్లలకును సాధ్యమగునా? రచనలోని రసాతలమున ప్రవేశించి, అందు కాంతిలు రతనముల నవ్వులఁబెట్టుట భాష్యకారునికర్తవ్యము. కవిభావమొక్కొకపుడు తటిచ్ఛలమువలె తళుక్కొత్తును. ఈతళుక్కు అన్నికన్నులకు కానంబడదు. రసహృదయుని కన్నులకే అది మిఱుమిట్లుకొలుపును. రసహృదయుఁడు మఱొక కవి కావచ్చును; భాష్యకారుఁడుకావచ్చును; విమర్శకుఁడుకావచ్చును. భావవిద్యుల్లతమువెంట రసహృదయుఁడు తన మనసును పర్వెత్తించును. కురంగమును తఱిమిన దుష్యంతునివలె నామనసుదాని వెన్కఁబడును. నాఁటివేట నెలంతుకైన మెఱపుకడ దుష్యంతుని జేర్చెను. రసజ్ఞునివేట ఆతఁడు తలఁపని భావసౌదామినిపొంత వానిఁజేర్చుట సంభవము. దానిమైతీవ వీని హృదయము నుద్రేకించుట తరువాతి ఘటనము. దానితో నీతఁడు గాంధర్వసంబంధ మేర్పఱుచుకొనుట పదంపడి తోఁచు ఘట్టము.

నిహితమైన భావమును గుర్తించుట సామాన్యులకు సాధ్యము కాదు. విజ్ఞానియైనభాష్యకారుఁడు దానిని బయల్వెట్టి, ప్రజలదృష్టి కప్పనమొనరించును. విమర్శకునిది పైచేయి. రచనలోని భావము వన లక్ష్మిఁబోలునదో వన్యపశువువంటిదో తెలుపుట ఈతని కర్తవ్యము. ప్రభాకలితదృష్టి, నిశితబుద్ధి, భావనదార్ఢ్యము, విశాలహృదయము, భావతత్త్వపరిశీలనము, మనశ్శాస్త్రపరిజ్ఞానము, ఉచ్చారణకౌశలము

విమర్శకుని సామ్ములైనగాని అతఁడు ముందంజ వేయరాదు.* సమర్థుఁడుకానివాని 'విమర్శనము' పంచమహాపాతకుని తీర్మానమట్లు దురంతమై, దుర్గంధమయమైయుండును.

విమర్శనము మహత్తరమైనది. ఇంతబురదఁదెచ్చి దానిని విమర్శమనువాఁడు విమర్శకుఁడుకాఁడు. విమర్శకుఁడు తనకలమును విజ్ఞానమందు ముంచును. కుళ్లులో లేఖిని ముంచు మహాశయుఁడు విమర్శకుఁడుకాఁడు. విజ్ఞానియుఁగాఁడు. విషయవిమర్శనముచేయు టొకటి; వ్యక్తిమెడ నులుముట వేఱొకటి. విశాలదృష్టితో విషయపరిశీలనము చేయుట సమంజసమని నామనవి. న్యాయస్థానములందును, సాంఘిక రంగములందును, రాజకీయాంగణములందును, సారస్వతసభలందును, గృహజీవనమందును, బాహ్యజీవనమందును, మనుష్యప్రకృతియందును, బాహ్యప్రకృతియందును, సాధారణముగా కనులెదుటఁ దోఁచు విషయములకంటె తోఁపనియంశములే అధికమైయుండును. తీర్మానమునకు వలయునంశములందు ప్రతికూలము లల్పముగను, అనుకూలము లధికముగను గోచరించుచుండ, సాధారణాంశములనే విమర్శన సామగ్రిగఁగైకొనవలెనని తర్కశాస్త్రము తెలుపుచున్నది. మనశ్శాస్త్ర తర్కశాస్త్ర నిబంధనలను చేతఁబట్టి సూక్ష్మపరిశీలనము గావించినను, ఒక్కొకపుడు సత్యనిరూపణము సాధ్యముకాకయుండును. కాలము కడచినంతన, నిభృతపరిస్థితులు కొన్ని దృగ్గోచరమై, కొంత వెలుతురు నిచ్చును. ఎదుటిదృశ్యము సంపూర్ణమై గోచరింపనపుడును, చూచు కన్నున లోపము తోఁచినపుడును విమర్శనమునకు లోపము ఘటిల్లును. చేటవంటి చెవిని, కొమ్ములఁబోలు దంతములను, స్తంభముల కెనయైన కాళ్లను, తడపవంటి తోఁకను, జెట్టిగొడ్డుఁబోలు తొండమును చూచిన

*"A critic must have a seeing eye".—CARLYLE.

వేర్వేఱువ్యక్తులు వేదండమునుగుఱించి కావించిన విమర్శన మెట్టిదో సాంఖ్యవేదాంతమును నెఱిఁగినవా రెఱుఁగుదురు. ఎదుటివ్యక్తినిగుర్తింపక చేసిన విమర్శనలు కొన్ని చరిత్రపత్రములను అందందు రక్తమయములు చేసినవి. సభ్యతాప్రపంచమునకు తీరని కళంకమును తెచ్చి పెట్టినవి. అరిష్టములు ఘటిల్లినపిదప అంధకారమునందు సత్యము తళుక్కుమనది! ఘనవిషయములనుఁడు, అల్పవిషయములనుఁడు, ఒడుదొడుకుచేతులందు పడినపుడును, మెల్లకండ్లముంగలఁ దోఁచినపుడును ఆదరమునుగాక అత్యాచారమును పడయును. ఎదుటివ్యక్తి వెనుక రక్కసులఁబోలు పరిస్థితులెన్నో అదృశ్యములై ఉండినను ఉండును. కానుపించువ్యక్తిని ఖైదుచేయుట ధర్మము కాదు. ఒక సంఘమందలి లోపము లొక్కొకపుడు ఒక్కరుని తలపైఁ ప్రాలును. క్షమను విడనాడక, విశాలదృష్టి నెదుటివానిని వీక్షించి విమర్శనమునకుఁ గడంగితిమేని, అట్టి విమర్శనము నిర్మాణక్రియకు పునాదియగును. కటూక్తులటుండ, ఎత్తిపొడుపులు సాహిత్యోద్దేశములకు చెఱుపుఁదెచ్చును. అద్భుతప్రజ్ఞానిధియగు జోనాథన్ స్విప్ట్ వ్రాఁతలు విధ్వంసమునకు పనికివచ్చు విమర్శనము లనిపించుకొన్నవి గాని ఆంగ్లసాహితికి జీవకళ నిచ్చినవని యనిపించుకొనలేదు. విమర్శనమువలన,కర్తవ్యస్యందనము ముందులకరుగును. ఎదుటి కురుక్షేత్రమును గుర్తింపక, ఊరక గాండీవ మెక్కు వెట్టుట తగదు. కళోపాసకు లీ విషయములను గమనింతురు గాక.

ఆంధ్రమానసము నంటిన తమసము ఇపుడిపుడు కొంతగొంత దిగజారుచున్నది. ఆంధ్రావనికి తూరుపుదిక్కున అరుణద్యుతి పొడగట్టుచున్నది. ఆంధ్రవాతావరణమునఁ గొంత భావసంచలనము కలిగినది...మన కళలు క్రొందళుకు లీనుచున్నవి. మన కవితనుండి మధురధారలు కురియఁజాలుననియు, మన చిత్రలేఖనము అనంత అంతరంగ

అవనింజూపఁగలుగుననియు, మన నాట్యకళ అపూర్వశోభ నందఁజాలు ననియుఁ దెలుపు శుభచిహ్నములు గోచరించుచున్నవి. పూర్ణత్వము సిద్ధించుటకు క్రమానుష్ఠాన మవసరము. ఈ యున్నతోద్దేశమును దృష్టి యందిడికొని, అగ్రసరులగువారు పూజనీయులు. ఈ యత్నమున జయాపజయములు స్వాభావికములు. అపజయము ఒక్కొకపుడు జయమునకు అవసరమైనమెట్టు కావచ్చును. కూలినవానిని జూచి అల్పులును, సామాన్యులును వెక్కిరింతురు. ఫలితమునకే కష్టము చవి వించువారు ఆదర్శపూరుషులుకారు. ప్రయత్నమునే పాటించుటుచిత మని హాల్డేన్ పోలు తత్త్వజ్ఞు లనిరి. (Vide: Haldane's Convocation Address to the Students of Edinburgh University.) కొండకొనఁగల గమ్యస్థానమును చేరఁజనుచుండు యాత్రికుఁడు (Vide: Bunyan's "Pilgrim's Progress") తెరువున పలుమారు పిశాచముచేఁ గూలఁద్రోయఁబడినను లేచి, ద్విగుణీకృతోత్సాహముతో ముందుల కుటికి కడకు దివ్యమయూఖప్రదీప్తమైన తన ఆశయమును జేరునుగదా !

నిత్యజీవనసమస్యలు పరిష్కారమగుటకు తోడుపడు గ్రంథములుండుట అవసరమనుట తథ్యము. జీవన మనఁ గేవలము ఆర్థికసమృద్ధికి సంబంధించిన బ్రదుకుకాదు. మనుష్యజీవన మంతయు ఉదరపోషణ మందు ఇమిడియుండలేదు. సంపూర్ణజీవనముయొక్క సరిహద్దులు విశ్వవలయమునకు ఇవ్వలనే యున్నవని అపోహపడరాదు. వెలుపలికే చూపులు సారించుట కలవడిన మనుజుఁడు ఒకపరి అంతరంగము దెసఁ జూచెనేని, జ్యోతివలె వెలుఁగు ఆత్మ అందున్నదని గుర్తింపఁ గలఁడు. ఆత్మప్రదీపమున వెలింగెడు జ్యోతులు ఆశయములు. ఇవి పంచభూతములువంటివి ! రవికిరణములను పోలునవి !! పుష్పసౌరభ

మున కెనదైనవి!!! కాలగతి వీనికి వార్ధక్యమును ఆపాదింపనేరదు. వీనికి ప్రాత క్రొత్తలు లేవు. సృష్టితుదవఱకు ఇవి శోభిలుచునే యుండును. కళలకు అసువులైనవి ఆశయములే. ఉన్నతాశయములు చూపని కళలు కళలుకాక వెంటపోగు లగును. దేశకాలములు కళలకుఁ గాని, ఆశయములకుఁ గాని అడ్డుగోడలు కావు. సూర్యకిరణములకైన అస్తమయ మున్నదిగాని ఆశయములకు లేదు. సృష్టి చిత్రము త్రుప్పువట్టిననాఁడే ఆశయములును త్రుప్పుపట్టును. భారతజీవనమును, భారతసారస్వతమును సర్వసమస్యాపరిష్కారమున కుపకరించు గంభీర భావములతో నిండియున్నవి. అధునాతన ప్రపంచమున భౌతికశాస్త్రము సామ్రాట్టై యున్నది. సైన్సునకు చూపవలయు గౌరవముఁజూపి, దానివలన నందఁదగు అభ్యుదయమంది యూరకొనక, అమానుషక్రియలకు దానిని బలికొల్పుచు, బుజువునకు లొంగని ప్రతియంశమును మానవుఁడు నేఁడు లోఁతుగోతిలోఁ గూలఁద్రోయఁ దలపడుచున్నాఁడు. సైన్సు గొప్పదియేయయ్యు, సంపూర్ణజీవనసమస్యలను గుర్తించుపట్ల దాని కొలబద్దలు మిగుల కుఱుచవై, కొరగానివై యుండును. భౌతికశాస్త్రము మనసునకు సంబంధించినది గాని ఆత్మకు కాదు. మనసు విహంగమువంటిదే. అయినను అనంతవిశ్వమం దది ఎగురనేరదు. వాతూలమును కడచి పోఁజాలదు. భౌతికయోజనకు హద్దుపద్దులున్నవి. ఈ యోజనమునకే పట్టముగట్టితిమేని, మన సమస్యలన్నియు లొంగి చేతఁబడనేరవు. టెలెస్కోప్‌నకు కాని టెస్ట్‌ట్యూబ్‌నకుఁగాని అందనివి ఆశయములు. ఇట్లని కొందఱు పాశ్చాత్యప్రముఖులే గుర్తించిరి. ప్రతీచీఖండము నేఁడు సైన్సుమయమై యుండుట నిక్కమే. అయినను ఉత్తమ ప్రతీచీ సాహితిని ప్రవేశించి చూడుఁడు. భాస్వంత జ్యోతులట్లు

అందాశయములు ప్రకాశించు చుండును. ఈ జ్యోతిర్లీల తొలుతఁ దోఁచినది ప్రాచీ విహాయసమందని ఒప్పుకొను మహనీయులు పడమటి నేలయందు కొందఱున్నారు. ఇట్లని పైకిఁ దెలుపకపోయినను, పూర్వవిజ్ఞానమునుండి పొరలివచ్చిన భావధునిని తమ మనసులందును, తమ సాహిత్య క్షేత్రములందును ప్రవింపచేయుటకును, ప్రాచీ సాహిత్యోద్యానమునఁ బెంపొందిన తియ్యని తలఁపులను తమ సారస్వతాంగణమునఁ బదనికలట్లు నాటి, తమ కళలను సురభీకరింపఁ జేయుటకును మక్కువపడు విజ్ఞాన వనమాలులు పశ్చిమగోళమందున్నారు. సంప్రదాయమనినంతన చట్టున లేవక, కనులెత్తి దానిని పరిశీలించి రత్నమైన చేఁబట్టి, గాజుముక్కైన, నవ్వల రువ్వుట పాడి. ఆర్డినెన్స్లు జిజ్ఞాసువులకుఁ గూడవు. నేఁటివికాని ఆశయరత్నములు త్రుప్పుపట్టినవని యోజించి వానిని విసరివేయుట అవివేకము. మహితాశయములను పిడికిటఁ బట్టఁగలిగితిమేని, బ్రహ్మాండము నరచేతనిల్పినవార మగుదుము. దురూహ్యములైన ఆశయములను సామాన్యుల కందించుటకై ఏర్పడిన వెరవులు కళలు! కటువగు సూత్రములను వెన్నముద్దలుచేసి జనసామాన్యమున కిచ్చునవి కళలు!! సత్యమునుగుఱించి గంభీరోపన్యాస మిచ్చుటకంటె సత్యప్రతిష్ఠకై కండలుకోసి యిచ్చుటకు జంకని మహావ్యక్తిని కనులెదుటఁబెట్టు కళాకౌశలము మహత్తరమైనది! ప్రేమనుగుఱించి సుద్దులుచెప్పి, బుద్ధులు కఱపనెంచుటకంటె, ప్రేమమహత్త్వమును ఆత్మజీవనరంగమున ప్రదర్శింపఁ గలిగిన వ్యక్తిని కనులెదుట నిలుపు కళానైపుణ్యము ఘనతరమైనది. ఇచ్ఛాశక్తి త్యాగములను గుఱించి గీతగోవిందములు పాడుటకంటె, నీ అద్భుతాశయములఁ జేకొని వానిని రెండు రెక్కలు జేసికొని అనంత భువనములం దెగిరి, అసాధ్యములను సాధించిన ప్రజ్ఞాధురీణులను

పురోభాగమందిదు కళాకౌశల్యము గురుతరమైనది!!! ఆశయద్యుతిచేఁ దేజరిల్లు కళ సోకినంతనే కొండవలె నెత్తైయుండిన మాధ్యము క్రొన్నన లఁ జిగిరించును !—చీకటినుండి వెలుఁగువెల్లువలు పాఱును !! భారతనాటకములు ఉత్తమాశయ మహత్త్వమును నిరూపించునవి. సామాన్యదృష్టి కివి అబద్ధపు హాళాహాళియే. జగదీశుని, రక్తమాంసము లందు వీక్షించి సృష్టి నాటకమునుగను టెట్లో, ఉత్తమాశయములకు రూపులిచ్చి పాత్రలుచేసి వానిని రంగస్థలమునఁ గాంచుటయును నట్టిదే. నేఁటివి కావని ఈ పాత్రలను రంగవాటికలనుండి తఱిమివేయుట నక్షత్ర ములఁబోలు మహితాశయములను నేలటపాకాయలట్లు నేలఁ గొట్టుట!— వీనిని కనిన కలముకడుపునకు చిచ్చు ముట్టించుట !! కనదురు కాంతులీను జీవనమును శూన్యమునం దెగురఁగొట్టి "ప్రేయసీ !"యని కంకాళ మును కవుంగలించుకొనుట !!! నేఁటి రుచులను మన్నించురూపులను, నేఁటి క్రొత్తందనముకోరు తళ్కులను సర్వాంగసుందరియగు కళ పాటించితీరును. నాఁడును నేఁడును జేపునుకూడ తేజరిల్లు ఆత్మప్రదీప కళికలను అంతరంగమున నార్పివేయఁ గళాసీమంతిని ఆతురంపడదు. సౌకుమార్య సౌందర్య సౌష్ఠవములు కాక్షించు చేయి తనకు సహజ మైన చెయువునుండి త్రుళ్లి నిండు గుండెయందు తూపులు విసరె నేని, రూపునకును, చూపునకును తేజమిచ్చు ఆత్మను హృదయకుంజము నుండి నెగురఁగొట్టినదగును. రవినుండి చిప్పిలువెలుఁగువలె, భగవతి నుండి ప్రభవించు దివ్య సౌందర్యముపగిది, ఆత్మనుండి ఆశయ మయూఖ వెడలును. దీనికి ప్రత్యవతారములైన మహాపురుషులు దీని వలె నన్నికాలములందుఁ దేజరిల్లుదురు! నాఁటి రాముఁడు నేఁడుకంపుఁ గొట్టు కంకాళముకాఁడు—నాఁటి రామదాసు నేఁడు కొఱగాని బుడం దాసు కాఁడు. కళారంగము దిక్కాలము మువంటిది—యిందెం తేని

చోటున్నది. జగన్నాటకరంగమున అనంతకాలము తేజరిల్లఁజాలు ఆశయమూర్తులను నాట్యకళాసామ్రాజ్యమునుండి వెడలించి, సభ్యత కవ్వలఁగల అంధమానులందు బంధింపఁదలఁచు సోదరుఁడు నిష్ఠురుఁ డనిపించుకొనునని నా తలంపు. నేఁటి వ్యక్తులకు వేత్తైనను, నాఁటి ఆదర్శపూరుషులనుకూడ దృష్టిసమక్షమునఁ గళాపీఠమున నిలిపిరేని, అనంత, అవిచలిత, అవిచ్ఛిన్న, ఆశయములకు తమ జీవనములను ప్రాఁపొనరించి మనుష్యసంఘ సముద్ధరణమునకు కళావ్రతులు తోడ్పడుదురు.

కళ అమరత్వముఁగలది ; అమృతమయమైనది; దివ్యసౌందర్య సందీప్తమైనది. కావుననే బడబానలము ఎగిరివచ్చినను, దాని కెగ్గుచేయఁజాలదు. చింత నిప్పులు కళ నెన్నఁడైన సోకఁజాలుచో, అవి నిత్యమల్లెలై ఇహజీవనమందే పునరవతారమందును. విచ్చుకత్తులును, కటూక్తులును కదనరంగమున విజయ మందఁజాలునేమో గాని కళా రంగమున నెండు బెండులై రాలిపోవును. మేరువులను నమలి, సముద్రములను దిగ్రమింగినశక్తులు తలలు వంచి, కళకు జోహారొన రించెనని ప్రపంచసాహిత్యము జలదగంభీరస్వరమునఁ దెలుపుచున్నది. సృష్టిమొదలు నేఁటివఱకు ఎన్నెని మెఱపులు వెడలి వియత్తల హృదయమును చీల్చినవి :—ఎన్నెని ఉరుములు వెడలి విహాయస హృదయమును బ్రద్దలుకొట్టినవి !! ఘనుఁడ ననిపించుకొనఁగలిగిన మేఘుఁడు అడలున అఱచినాఁడు. కాని నిజమందిరమున, నిజపీఠమున కదలక, మెదలక ఆనందసందీప్తమై, నగుమోముకళ తేజరిల్లుచునే యున్నది. కళయొక్క గద్దె కదలిననాఁడు కళ కదలవచ్చును. విశ్వము అట్టిటు లాడిననాఁడే విశ్వకళాపరిమత్తునందలి గద్దెయుఁ గదలును. కళోపాసకుఁడు ఆనందవ్రతుఁడేకదా ! క్షుద్రదృశ్యములకు కను లప్ప

గించి, ఇతఁడు తన వ్రతమును చాలింపఁడు. ఉపాసకుని ఎదుటఁ గలది ఉపాస్యదేవత. అవినాభావసంబంధసూత్ర మిర్వుర ఆత్మలను బంధించి యుండఁ జిట్టిలుకలు శివలింగముపై చిందులాడుచున్నవని దీక్షవదలి ఉపాసకుఁ డవ్వలి కరుగఁజాలునా ?

జీవాత్మ, పరమాత్మను గూడి దివ్యబృందావనమున నృత్త క్రీడలఁ దేలుననికదా తత్త్వజ్ఞులందురు. కళోద్దేశ మీయాత్మోద్దేశమునకు విభిన్నము కాదు. ఇహలోకమందే బృందావన సృష్టిఁ జేసికొని మఱియు కళోపాసకుఁడు దివ్యబృందావనవిహారి హృదయమున కౌస్తుభమణి కాఁగలఁడు. రసహృదయుఁడైన సాహిత్యాచార్యుఁడు దివ్యచక్షువును ప్రసాదించుతఱి సామాన్యుఁడైన నరుఁడును తన యాశయమునంది, దివ్యభూషణమై వెలుఁగొందునుకదా !



# 12. నాట్యకళ - సంస్కరణము

నాటకమునకు సంబంధించిన వ్యక్తులు మువ్వురు: రచయిత, నటకుఁడు, ప్రేక్షకుఁడును. పూవును, మరందమును, తుమ్మెదయును వలె నీ మువ్వురును అవినాభావసంబంధముఁ గలిగిరేని, నాట్యకళ శోభిలును. నాటకరచన మెఱుఁగని పెద్దన్నయ్య ఏదో 'త్రోటకము' వ్రాసి, రంగస్థలమున నిలిపినపుడును, భాషాజ్ఞానముఁగాని, భావగ్రహణశక్తిఁగాని, నైతికదార్ఢ్యముఁగాని యెఱుఁగక, తోఁచిన రీతిని కాల్సేతులు త్రిప్పనెఱిఁగిన నటకుఁడు ప్రదర్శనమునకుఁ గడంగినపుడును, నాట్యకళ యేమో యెఱుఁగక, ఏ వెఱ్ఱినో, ఏవింతనో, ఏవిడ్డూరమునో రంగస్థలమునఁ గాంచి ఉబ్బి తబ్బిబ్బగునాతఁడు ప్రేక్షకుఁడైనపుడును, నాట్యకళ ఘోరస్థితియందు దొరలిపోవును. లోపములందు మువ్వురును సమానభాగధేయులగుచో, ప్రదర్శనము ఢంకా కొట్టితీఱును. ఈ ఢంకా విజయభేరి కాక, నాట్యకళకై ఏర్పడినచావు బాజాయని విజ్ఞానులు పిలపింతురు.

ప్రేక్షకులందఱు నాటకప్రదర్శనమును విమర్శకదృష్టితో వీక్షింపఁగలరని తలఁపరాదు. గభీరపరిశీలనమున నాణితేలువారు కొందఱుమాత్రమే. గాజుకన్నులవారును, రంగద్దములు దాల్చువారునుకూడ ప్రేక్షకులందు నుందురు. జనసామాన్యముయొక్క విద్యాభివృద్ధిపై సాధారణప్రేక్షకుల పరిశీలనాశక్తి ఆధారపడియుండును. పామరులందును కళాంశములను చక్కఁగ గుర్తింపఁగలవారు వంగీయులందు పల్వురున్నారు. కావున వంగరాష్ట్రమున కళలు పెంపొందుచున్నవి. ఆంధ్రజనసామాన్య మింకను అంతయభివృద్ధిఁ గనలేదు. కాని కళాంశములను గ్రహించుపట్ల ద్రవిడవిద్యాధికులకంటె సామాన్యులైన ఆంధ్రులే అధికులనుట కెన్నేని నిదర్శనములున్నవి.

కళోపాసనమునకు వలసిన సహజశక్తిని, పాండితిని, సద్వర్తనమును గలవాఁడే నటకుఁడు కాఁజాలును; నాట్యకళకు వన్నె తేఁ గలుగును. రచయిత యిచ్చినదానిని గ్రుడ్డిపాఠము చేయునటుఁడు తనకు సిగ్గును, రంగస్థలికి ఎగ్గును దెచ్చును. ప్రామ్‌ప్టింగ్‌నందుచు, నటించువాఁడు తోలుబొమ్మకంటె నధికుఁడు కాఁడు.

ఆహారమును నమలి, మ్రింగి, జీర్ణించుకొని, రక్తమాంసములు చేసికొను భోక్తయట్లు, రచయిత యిచ్చినదానిని నటకుఁడు తనయది చేసికొనినపుడు పాత్ర యాతని నావహించును. పాత్రధారి యపుడు తన పుట్టుపూర్వోత్తరముల నెఱుఁగకుండును అపుడతఁడు పాత్రధారియే యనఁజెల్లదు.

నాటకమునఁ బూటకమను నామాంతరముఁగల నాటకమునకు చోటు లేదు.* రంగస్థలమునఁ గాలిడినపాత్రధారి తాను నటకుఁడ ననుకొనినచో, ఆతఁడబద్ధమునే నటించును.

తన్మయానందమున మునింగినపరమహంస తన్నుదాను మఱచును. ఉద్గ్రంథమును చదువు మహామేధావి ఎదుటిరచనయందు బుడుంగుమనును. రమ్యప్రకృతిని తిలకించుకవి ప్రత్యక్షసౌందర్యమునం దీఁదులాడును. కళాసామ్రాజ్యమున నావేశమే గంగాఝరి

* "హామ్‌లెట్" నాటకములో నింకొక నాటకము లేదాయని చదువరు లడుగవచ్చును. "హామ్‌లెట్" బూటకము కాదనియు, అందుఁ దోఁచినప్రత్యేకనాటకమును నట్టిదికాక ప్రత్యక్షప్రదర్శనమనియు వారు గ్రహింతురుగాక! జరిగినదానినేకదా పిన తండ్రియెదుటను, కన్నతల్లికనులముందునను ప్రదర్శించి, వారి ముఖలక్షణములందును, విలోకనములందును, దురంతమైన వారి కుట్రయొక్క అడుగుజాడలను హామ్‌లెట్ కనుఁగొనెను!

యగును. ఈరఘుకీర్తిస్తోత్రమునందు అద్భుతఆధ్యాత్మికవిద్యుత్శక్తి నిహితమైయుండును. ఈ దివిశక్తి విజృంభించినపుడు మహాద్భుతములు పొడసూపును. ఈ యద్భుతములు మానవునకు చెందినవి కావు. మఱి సర్వశక్తిమంతుఁడైన పరమేశ్వరునకు చెందినవి. మనుజులందు కొందఱిహృదయములనుండి మాత్రము దేవదేవుఁడు ఊఁకుకొత్తుచు వెలువడును. ఈహృదయములుకలవారే భక్తులును, కళోపాసకులును. దైవకృప, పూర్వజన్మతపము, నేఁటివ్రతనిష్ఠ కలిసినఁగాని దివ్యవిమానములఁబోలు నిట్టిహృదయములు మనుష్యకళేబరమునఁ బ్రవేశింపవు.

నిజవ్యక్తిత్వమునకు విస్మృతుఁడై, మహావేశమున పాత్రధారి తనపాత్రయందు లీనమగునపుడే అతఁడు దివ్యశక్తినందిన ఆదర్శకుశీలవుఁడనిపించుకొనును. ఇతఁడు నాట్యకళకు తేజమిచ్చు కౌస్తుభమణి కాఁగలఁడు.

నాటకమున సూచింపఁబడినపాత్రవ్యక్తికిని, ఆతనిజీవనమును ప్రదర్శించుపాత్రధారికిని ఇంచుకంతైన పోలికయున్నఁగాని, ఇతఁడు తనకర్తవ్యమును నెఱపుకొనఁజాలఁడు. పాత్రధారణమన వేషధారణమగుచో, భాషోచ్చారణమే పాత్రపోషణమగుచో, ఇతఁడు తనపని నవలీలగ నెఱపుకొనఁజాలును. నాట్యకళ గభీరభావబంధురమైనది కావున, భావానుభవమునకు వలసిన అనుకూలప్రకృతిని, ఆంతరంగికశక్తిని గలవాఁడే పాత్రధారణమున కర్హుఁడగును. మహాభక్తుఁడే జగదీశునిపాత్రను ధరింపఁగలఁడు. ఏల? ఇన్వురయాత్మలును విశేషప్రభేద మెఱుఁగవు కావున. పాత్ర నూహించుకొనఁజాలనివ్యక్తి, రంగస్థలమున పాత్రకు అవతార మెట్లుకాఁగలఁడు? వృద్ధగార్ధభము పట్టివర్ధనములు దిద్దుకొని, రామానుజాచార్యుఁడనని, రంగస్థలిపై

నెక్కుచో, వికృతముగ నడచునుగాని, ఘనభావవిశిష్టమైన విశిష్టాద్వైతము నుద్బోధింపఁగలదా?

ఒక్కొకవ్యక్తి కొక్కొకరుచి, ఒక్కొకప్రకృతి యుండును. సహజరుచియందే సహజశక్తి విజృంభించును. సహజప్రకృతికి సరిపడు పాత్రను ధరించినపుడే రంగస్థలిపై నటుఁడు జయసిద్ధి నందఁగలఁడు.

నాటకరచనమునకు వలసిన శక్తులనన్నిఁటిని తమ మనసులందు కేంద్రీకరించుకొనినరచయితలు మననేలలో నక్కతు. సోదరులు పాటింపవలయు నంశములఁ గొన్నిటి నుల్లేఖించుట సాహసము కాదని తలంచెదను.

భావశక్తిఁగలవిషయమే నాటకరచనమునకు అక్కరగు సామగ్రి కాఁగలదు. విషయపటుత్వము, కథాప్రాముఖ్యము రచయితహృదయమందలిశక్తిని లేవనెత్తును. కొండకొననుండి ఉఱుకులెత్తు మహాధునియట్లాతని కలముకొననుండి తలఁపువెల్లువ వెల్వడును.

ఆదర్శగ్రంథకర్త ఎన్నఁడును తవుడుపై కన్ను వేయఁడు; చిట్టును చేతఁబట్టఁడు; ఎండుమొఱుగు నంటఁడు. వీని కెంత తేనెను తోడిచ్చినను, ఇవి తీపినందవు. వీనిచే నెన్నియవతారము లెత్తించినను, ఇవి తమవ్యర్థజీవనమును చంపుకొనలేవు. ఇసుకను తెచ్చి నాటకరచయిత అందు భావకేదారమును పండింపలేఁడు. కన్ను వేసి, మంచిమన్నుఁ జేఁబూని అందు మిన్నువెలుఁగు చూపఁగలఁడు. ఆవేశమున నుప్పొంగు విషయములే, భావబంధురమైనయంశములే నాటకరచయితగ్రంథమునం దంకములు కాఁగలవు. ఆశయప్రదీప్తవ్యక్తులే నాయికానాయకులై ఈతనికి ప్రత్యక్షమగుదురు.

హృదయమును పొంగింపనిది కళయే కాదు. అందును నాట్యకళకుఁ దక్కిన కళలకంటె ఎక్కువ శక్తి అనేకముగా నుండవలెను. ఒకానొక

నిశీథిసీసమయమున నొక నిర్దిష్టప్రదేశమున, పైకమిచ్చి, మెదడునకు పని కల్పించుకొనుటకై ఎవ్వరును చేరరు. మేధాశక్తిని విశేషముగా ప్రయోగించి, ఏదోనాటకమల్లి, కాల్సేతులు కల గ్రామఫోనుప్లేటుల చేతనో, మాటలు నేర్చిన యంత్రములవలననో రంగస్థలమున 'దరిద్రపుంగొట్టు' ప్రదర్శనముచేయించు గ్రంథకర్తను అపనింద, అపజయములు వెంటనే మార్కొని తీఱును. ఇట్లనిన నేఁడు జయప్రదముగ జరుగుచున్న నాటకములన్నియు ఆదర్శనాటకములని తలఁచుట పొరపాటు. ప్రేక్షకుల యెడందలను కదలించుట నుద్దేశముగా కలవారు ఏదో ఒకతంతును జరపి, ఏదో కథను సాగించి, సంకల్పసిద్ధి నందుచున్నారు. గ్రంథకర్త నాటకమునంతను పద్యములతో నింపగా, గొంతుకున్న పాటకులు రంగస్థలములందు పాటకచేరిలు సలుపుచున్నారు. పాత్రలు నాటకమునాడక నాటకమును పాడుచున్నను, రాగాలాపనమునకై చెవికోసికొను ప్రేక్షకులు వన్సుమోరులు కురిపించి 'శభాస్' అనుచున్నారు. పద్యములుకూడదని గ్రహించిన బుద్ధిమంతులు కొందఱు రంగస్థలమున వచనమునకు చోటిచ్చి, చక్కని సంస్కరణమునకు దారిఁదీయుచున్నారు. కాని, యీవచనరచనములందు ప్రేక్షకులహృదయములను కదలించునవి మిక్కిలి తక్కువై యుండుటవలననో, జీవనమును, ఆశయశక్తినిగల గద్యనాటకములు ప్రదర్శనానుకూలములగులీల రచింపఁబడకపోవుటచేతనో, గురుతరోద్దేశమును దృష్టియందుఁగల ఈ నాటకములింకను మననేలయందు విజయకేతనముల నెత్తఁజాలకపోయినవి. హృదయమును తట్టనిఘోషకై ప్రేక్షకులు కనిపెట్టుకొనియుండరు. కావున నల్లరులు రేకెత్తుచున్నవి. "పద్యములు లేవు కావున పీరిట్లు పెచ్చిల్లుచున్నారు. ప్రేక్షకుల మానసికస్థితి వృద్ధినందకున్న నాట్యకళ

సంస్కరణము నెట్లు కనఁజాలును?'' అని కొందఱు మనీషులందురు. ప్రజాచిత్తము కొంతవృద్ధినందిన, ప్రదర్శనము ఆదరమందుట సత్యము. కాని తప్పునంతను ప్రేక్షకుల నెత్తికి కట్టరాదు. తన నాటకమునకు జీవమీయఁజాలక, శవమునకు పంగనామములుదిద్ది రంగస్థలమున నిలుపసాహసించినరచయితయే ప్రేక్షకులు చూపు నవజ్ఞకు జోలి పట్ట నగును. ఈ విషయము ప్రత్యేకప్రదర్శనమును పట్టియుండును. ఒక్కొకపుడు దోషము గ్రంథకర్తపై యుండవచ్చును. వేఱొకప్పుడు అల్లరికై వచ్చిన కొందఱు ప్రేక్షకులదై యుండవచ్చును. ఇంకొకప్పుడిరు తెగలవారిదై యుండవచ్చును.

నాటకరచయిత మంచిపండితుఁడు కావచ్చును; కవి కావచ్చును; సంగీతవిద్వాంసుఁడు కావచ్చును. పండితునిదంతయు స్థూలకాయమే. వ్యాకరణసూత్రములను గొలబద్దలు చేసికొని, ఒక్క తప్పు లేకుండ నితఁడు కొంత పద్యభాగమును తయారు చేయును. మఱువక ప్రతియంకముతుదను ''శ్రీ జగదీశ్వర వర ప్రసాదలబ్ధ మహాద్భుత కవితాధురంధర...వంశదుగ్ధసింధుక్షపాకర, ...మహామంత్రి పుత్ర,...ధౌరేయ,...విధేయ...గాధేయ...రాధేయ'' అని త్రేతాయుగములో నిగద్యను స్వర్ణాక్షరములతో తాపటమొనరించి తన పాదములకు తాను దండప్రణామ మాచరించుకొని ''తధికిణతోం!'' అనును. బంషపండితుఁడు నాటకకర్త కాఁగలుగుట కల్ల. వట్టికవియు నాటకకర్తయగుటఁ గల్లయే. కోయిలవలె నితఁడు శ్రావ్యముగ పాడఁగలఁడు. శారదఁదాపలఁ గల అంచలీల సీతని కవితా గతి రసహృదయుల మనసుల నాకర్షించును. నాట్యకళ ఇతనికి కొంగుబంగారము కాదు. ఇతని రచనము ప్రదర్శనానుకూలము కాదు.

లలితకళలన్నిటికిని నాటకమున కొంతచోటున్నది కావున, వీనిని పిడికిటఁబట్టఁగల గ్రంథకర్త తన కర్తవ్యమును గుర్తింపఁగలఁడు. ఇంతియకాదు. ఇతఁడు ప్రపంచానుభవము నధికముగఁగలిగి, మనుష్య చరిత్రయందలి నిగూఢాంశములను, స్వర్గనరకములనుగను పెట్టువాఁడై యుండవలెను. మనశ్శాస్త్రపరిజ్ఞాన మీతని కనివార్యము. క్రమ వృద్ధిని, క్రమపరిణామమును నందు వ్యక్తిగతభావములను, సంఘ హృదయమున జాలువాఱు తలంపులను హృదయంగమ మొనరించు కొనియే, ప్రకృతినంతయు గుర్తించియే, తన తీక్ష్ణపరిశీలనమందు విశ్వాసముంచియే ఇతఁడు నాటకరచనమునకుఁ గడంగవలెను. ఇంతియు కాదు, ప్రదర్శనమునకు సంబంధించిన ప్రత్యేకపరిజ్ఞానము (Stage technique) ఇతని సొమ్మైయుండవలెను. సాహితి ఈతనితోఁ బుట్టువు కావలెను. కాలగతి మీఁదను, తన పురోభాగమందలి ప్రజల మానసికగతిమీఁదను ఇతఁడు కన్నువేసి యుండవలెను.

పౌరాణిక నాటకములు నేఁడుకూడ రంగస్థలములందు విజయ మందుటకు కారణము అవి యున్నతాశయ ప్రతిపాదకములైన పాత్ర లను రంగస్థలిపై నుంచుటయును, కళకు కావలసిన భావశబలత భావ నావేశములుఁ గలవియగుటయునని నా యభిప్రాయము. భారతీయులు ఆశయముల నారాధించు ఉదారులు. పేదఱికమందుకూడ కళల మీఁది తీపిని కోలుపడని మహనీయులు. ఆశయములకును కళలకును క్రొత్తప్రాతలు లేవు. అధునాతనపాత్రలందు ఆశయతేజమును చూపియు, నవీనకాలవాహినిలోని భావమును తన రచనయందు వోసియు, కళాసౌందర్యమునందు కలువడించియు, విభిన్నమనుష్య మానసికప్రవృత్తుల నెఱిఁగియు కలమెత్తు నేఁటి నాటక రచయిత ఆదర్శరచయిత అనిపించుకొనును. నాటకరచనమునకు వలసిన సూత్ర

ములను బట్టిచూచినయెడల, ఆదర్శనాటకమొక్కటికూడ తెలుఁగులో నింకను పొడసూపలేదని నొక్కిచెప్పవచ్చును. ఇట్టి లోపమును మాపుచేయు రచయిత లింక తలసూపవలెను.

ప్రజాపురోభివృద్ధికి నాటకరచయిత తోడ్పడినట్లు మఱొక కళోపాసకుఁడు తోడ్పడ లేఁడు.

పతితమనశ్చక్షుస్సమక్షమున ప్రతిమద్మై నిలుచు భావమునే కావ్యకర్త సృష్టించును. కాని, ఈ భావమునైనను గ్రహింపఁజాలు బుద్ధిశాలురు కొలఁదిమందిమాత్రముందురు. ఈ భావమునకే పాత్ర రూపునిచ్చి బాహ్యచక్షుల ముందుంచువాఁడు నాటకరచయిత. ఇతఁ డెల్లఱకును ఎనలేని సేవచేయువాఁడగును. ఆదర్శపాత్రల గుణగణములు సంఘమునందు ప్రవేశించి, చిరస్థాయినందఁగలుగును. భారత సంఘముపై నేఁడు విదేశీయసంఘములందలి దురాచారములు పులుగులట్లు వ్రాలనుంకించుచున్నను, రాజకీయ, ఆర్థిక కారణములు నేఁడు భారతజాతిని వడకించుచున్నను, భారతనాగరకత ఇంకను నేలఁ గూలకుండుటకు హేతువు,—శతాబ్దుల ప్రతికూలయాఘాతములఁ బడుచున్నను అది యడుగంటకుండుటకు హేతువు భారతకళలనుండి భారతసంఘమునఁజొచ్చిన గురుగంభీరగుణములందు వెలయుచుండుటే. నాట్యకళ నుపాసించునాతఁడు సంఘమున కెంతేని సేవచేయఁగలఁడు.

నాట్యకళ సంఘమునకు సంబంధించినదేకదా! ప్రజా పునరుద్ధరణమును కాంక్షించు వ్యక్తి నేఁటి సంఘమును బోనులో నిలుపకమానఁడు. సంఘముమీఁది అభియోగమును పుంఖానుపుంఖముగ పరిశీలించి, దోషనిరూపణ మొనరించుట న్యాయము. సంఘసంస్కారమునకు సత్యాన్వేషణ మవసరము. సత్యమునకు చెఱుపుఁ

దెచ్చితిమేని, సంఘమును మఱింతలోతు గోతిలో కూలఁద్రోసినవార మగుదుము. ఒకరి యిష్టాయిష్టములను సత్యము పాటింపదు. ఆగ్రహమును, అనురాగమునుకూడ నది త్రోసివేయును. కావున సత్య మొకపుడు కుసుమదళసదృశమైయున్నను, వేఱొకప్పుడు వేడినిప్పు వలె నుండును. కన్నుబుస్సులను సంఘముపై రువ్వు టెట్లనుచితమో ముత్తెపు సేసలుపోలు జాలికన్నీటి తుంపురులను దానిపైఁ జల్కరించు టయు నట్లే యనుచితము.

పౌరాణిక నాటకములందు విస్తారమునకు తావున్న దేమో కాని సాంఘిక నాటకములందు లేదు. ప్రత్యక్ష ప్రపంచమున కెదుట నద్దము నిలుపుట నాటకకర్తపని. జరుగుచున్న దానిని, అది చక్కనైయున్నను, భగ్గునమండునదైనను కనులెదుటఁబెట్టుట ఆతనికర్తవ్యము. నీతిపాఠముల కాతఁడు కడంగనక్కర లేదు. అక్కరలేకపోవుట కాదు, అందుల కాతఁడు పూనుకొనరాదు. సత్యమును రంగస్థలమున నిలిపినఁ జాలును; సత్యము మిగుల వాడిగలది. కనుపొరల నది చించి అవ్వలఁ బాఱవేయును. అత్యుక్తి సత్యమునకు భంగముఁ దెచ్చును అత్యుక్తి యందు అబద్ధపుపాలు మెండు. చిత్రవిచిత్రములచే చిత్రింపఁబడిన అత్యుక్తి సామాన్యులహృదయములందు విశేషోద్రేకమును రేకెత్తించినను, రేకెత్తించును; కాని అది సత్యమును నేలరాచ్చి, కొట్టుకొని పోవు సంఘమును ఒకదరిఁ జేర్చుటకుమాఱు సుడిగుండమునఁ గూలఁ ద్రోయును. అత్యుక్తిపై నాధారపడుతీర్మానము దోషిని సంస్కరింపదుసరికదా దోసగులను వృద్ధిచేయును. దుర్నయదండనమునకు చేయూతనిచ్చును. అల్లకల్లోలమును పుట్టించును. శతాబ్దులకుమున్ను పశ్చిమఖండమందు సామాన్యాపరాధులు కూడ మరణశిక్షకు గుఱియగుచుండువారు. నాఁటి సంఘ మెట్టిస్థితిఁ జేరినదో చరిత్రపాఠకు

తెలుఁగుదురు. రచ్చలల్కొను అత్యుక్తులతోను, దుర్ఘటసంఘటనములతోడను నిండియుండు నాటకము సంఘమునకుఁ జెఱుపుఁ దెచ్చును.

అత్యుక్తికి రంగులు పూసి, రంగస్థలముపై నెక్కించి పామరులందఱ్ఱదేకతరంగముల నుప్పొంగించి నాటకకర్త ప్రేక్షకుల సంఖ్యను హెచ్చుచేయరాదు. అబద్ధపుచెత్తను చెఱిగిపోసి, సత్యకథనమును కాంక్షించు సంయమిలీల తులసిపూసలఁ జేఁబూని, చెఱుగుడు చెత్తలో సుద్దులను, విత్తనములను కలిపి, వాడిమాటలకు వేడుకబురఖాలు తొడిగి, నాటకకర్త కూడనిచాకచక్యమును చూపరాదు. తన తీవ్రయోజనమునకు వల్గముఁ గట్టక, ఏదో సంచలనమును ఉబికించుటే తన కర్తవ్యమని గ్రంథకర్త తలఁపరాదు. పెద్దచఱపు చఱచి, పెద్ద హట్టువేసి, చఱపు చూచి ఎవరుగాని చక్షుమనకుండుటకై అనురాగము నింత కందినచోటున మెత్తుట ఏగ్రంథకర్తకును తగదు. తొలుత "ఛీ! ఛీ!!" అనిపించినదోసమునుండి తప్పించుకొనుటకై పిదప "ఆహా!" అనిపించి, వింతయెత్తు వేయు గ్రంథకర్త దోషి యనిపించుకొనును. మసివంటి ఒక అబద్ధమునకు మణిపూసఁ దాల్చిన వేఱొక అబద్ధమును జోడించుట తగనిపని. రెండుఅబద్ధములు కలసి ఒక నిజముకావు. మొదటియబద్ధము సర్పఫణము; రెండవ అబద్ధము సుందరగాత్రి. రెంటిను గలిసిన సృష్టి ఊహాప్రపంచములోనిదిగాని ప్రత్యక్షప్రపంచములోనిది కాదు.

ఘోరపాపులకు ఇహజీవనమునందే పునర్జన్మఁ జూపిన ఆదర్శ గ్రంథకర్తలు ప్రపంచసాహిత్యమందున్నారు. వారు చూపిన అద్భుత పరివర్తనము (ఆంగ్లసాహితియందును, తత్త్వశాస్త్రమునందును ఇది Inward Renewal అనియు, Resurrection అనియు పేర్కొనఁబడు

చున్నది) బుడగలోనుండి పుట్టినదికాదు; సలసల గ్రాగు సత్యానుభవమునుండి పుట్టినది. పాతాళములోనికి దుముకుటకు వలసిన తెగువను, అందుండి సురపురమున కెగురుట కక్కరైన బలమును తీరి పాత్రలు ప్రదర్శించును. కొంతకాలము చిటచిటమండు నరకకూపము పాతాళ్తుగఁ జచ్చి నందనవనమందలి విరిసెజ్జ యగుటకు నిరయమును, నాకమునుకూడ వ్యాపింపఁజాలు శక్తికే శక్యము. తొలుతఁదోఁచు నరకమునకును, పదఁపడి గోచరించు స్వర్గమునకును నడుమ నిలువఁజాలునది మేరువుకంటె నెత్తైన శక్తిగాని సామాన్యపాత్రకాదు. నరకనాకములు వ్యతిరేకములు,—అసామాన్యశక్తులు కలవి. వేర్వేఱుశక్తులైనను, అసామాన్యగుణమందివి సమమైనవి. ఈ సమత్వపోషణములేని సందర్భములందు—యీ వ్యతిరేకశక్తులకు ఆటపందిరి కాఁదగని హృదయమున విద్ధూరమునకై బలవంతముగ వాని నిడి అబద్ధపు భాగవతమును కట్టు గ్రంథకర్త ప్రేక్షకులందు "హా! హా!!" శబ్దములను పొంగించునుగాని సంఘసంస్కరణమునకు వలసిన భావసంచలనమును పుట్టింపనేరఁడు. వాడిచూపును, లోఁతుమనసును, విశాలహృదయమును గల గ్రంథకర్త అనిపించుకొనఁడు. రెండుభావముల సంఘర్షణము సూపి, ఉత్తమ భావవిజయమును కనులెదుటఁ బెట్టఁజూచినచో, నీతని ఉద్దేశము గొప్పది యనిపించుకొనును. తగిన పాత్రనుగాక ఒక్కకసుగాయను ఏఱి, ఆమెజీవితము నీ సంఘర్షణమున కీతఁడు రంగస్థలముఁ జేయుచో, నీతని సాహసము ఔచితిని పాటింపనితెగువయై, నాట్యకళకు చెప్పరాని చెఱుపును దెచ్చును. సంఘసంస్కరణవాతావరణమున కూడని వేడిమిని పుట్టించును. మోహినీవేషములు దాల్చి మనుజులను దిగమ్రింగు రక్కసు లేమేమో దీవులందుండువా రనువింతకథను మనసునం దిడికొని,

యమలోకములోని చీకటిని, కంపుకు ప్రోగుచేసి, వానిని తగనిపాత్ర నెత్తికిఁ గట్టుకలము కొంతకాలము రంగస్థలమున తెయ్యిమనవచ్చు నేమోకాని, రేపు సంఘమందు అల్లరిని పురికొల్పు వాడికత్తియగుట నిక్కము.

ఎట్టి మహాకష్టములైనను నింగినుండి యాకస్మికముగ నూడిపడవు. సముచిత హేతుసంబంధములు లేని సంఘటనములు సంభవము లనిపించు కొనవు. ఆదర్శనాటకసంప్రదాయమును గమనింపుఁడు. మంటలు చిమ్మె ఐదవయంకమునకు నలసిన నెరసులను ఆదర్శకనాటకకర్తలు తొలినుండియు నిందందు విసరుదురు. మూఁడవయంకమున నగ్నిపర్వతమును జూపుదురు. ఐదవయంకమందలి జ్వాలలందుండి సహజమై ఎగయును ? గిల్లు గిల్లి గుండెరక్తమునకు తూరగొట్టములు నొడ్డువారుందురా ? ఈగొట్టములకు పనియిచ్చునది గునపము. రక్కసిపిల్ల వంటిఫలితము రక్కసివంటి హేతువునకే పుట్టును. అంగాంగసమన్వయము లేని యంశములు ఉద్రేకమును గలిగించు అబద్ధపుతుక్కువలెఁ దోఁచును.

పరోక్షముగ సంఘసంస్కారణమునకుఁ దోడుపడువాఁడు నాటకకర్తకదా! దురంతదృశ్యములు తోఁచుపట్ల వానికి కళాయిపూఁత పూసియో, మేలిముసుఁగులు దగిల్చియో తనకర్తవ్యమునకు మచ్చఁ దెచ్చుకొని, ఇతఁడు పిఱికిపంద యనిపించుకొనరాదు. ఘోర విభీషికలై గోచరించు దుర్దాంతదురాచారములకు రంగుదుస్తులు కట్టక, మనోమోహనరూపు లియ్యక వానినీతఁడు రంగవాటికయందు నిలిపెనేని, ప్రజలకనుపారలు చించినవాఁడగును. లేని దురంతములను రంగస్థలిపైఁ జూపెనేని సంఘమున భయదసంక్షోభమును బుట్టించి, యితఁడు సంస్కారణోద్దేశముపై నిప్పులు పోయును. తానేమియు

విమర్శింపక, ఎట్టియుపన్యాసమునకుఁ గడంగక, సత్యమును కను లెదుట నిలుపుట ఈతని కర్తవ్యము. సత్యమునారాధించు రచయిత తక్కిన పరమాశయములను ప్రత్యక్షజ్యోతులు చేసికొనఁడా? ఈతని కతన మహితాశయములు సంఘరంగస్థలిపైఁ గాంతిలవా? నాట్యకళా మహత్త్వముకతన సంఘసముద్ధరణము అద్భుతప్రభాకలితమై చూపట్టదా ?

ఆత్మసంస్కరణమునందినవ్యక్తి పరసంస్కరణమునకు ఆచార్యుఁ డగును. నాట్యకళకుసంబంధించినవ్యక్తులు నేఁడు సముచితసంస్కర ణము నందిరేని, భావిభారతిజాతి సంస్కరణమునకు మిగులఁ దోడు పడఁగలరు.



# 13. నాటకరచనమున మేలుబంతి



నాటకరచనమున నాంధ్రులింకను వెనుకఁబడియున్నారు. సంస్కృతనాటకములనే ఆదరించుచు, కొందఱు తమపని నెఱవేఱినదని సంతసించుచున్నారు. కొంద ఱేయొరవడినిఁ గైకొనక, తోఁచినరీతిగ నేమేమో వ్రాసి, రచ్చపై నెక్కించుచున్నారు. నాటకరచనమున పాటింపవలయు నంశములన్నింటిని, పిసికిటఁబట్టఁగలిగిన అనుభవశాలు లీవఱలో మననేలయందు తలసూపలేదేమో! స్వీయదేశసాహిత్యసంప్రదాయములను గమనించుచు, అవసరమగుపట్ల, నన్యసాహితీ నవ్యవిధానముల నాదరించి, కాలస్రవంతి ననుసరించుట తమకర్జమని మన గ్రంథకర్తలింకను గుర్తింపలేదు. దేశభక్తియందును, మాతృభాషానురక్తియందును, సహజశక్తియందును, ఇతరులకుఁ దీసిపోని వంగీయులు, విజ్ఞానమునకు స్వదేశవిదేశ ప్రభేదములుండరాదని గ్రహించి, అన్యదేశ ఆదర్శగ్రంథకర్తలను కొండొకవడి తమ యాచార్యులఁ గావించికొనిరి. వీరి దృష్టాంతము నాంధ్రులనుకరించుట యనుచితము కాదని యెంచి, సుప్రసిద్ధవంగనాటకరచయిత ద్విజేంద్రుని ప్రధాన నాటకముల నాంధ్రీకరించి, సుమారు పదేండ్లకుమున్నే వాని నాంధ్రుల చేతులఁ బెట్టితిని. కొంతకాలము మన కీయుశస్త్రిలకుఁడు మేలుబంతి కాఁదగునని తలపోసి, అతని రచనావిధాన మిట్టిదని విమర్శనాభిలాషులకుఁ దెలుప సాహసించుచున్నాను.

ప్రపంచప్రఖ్యాతి నందిన వంగభాషావ్రతులు ఆంగ్లసాహిత్యోపాసకుల అడుగుజాడలఁబట్టి చాలదూరము నడచినారు. వంగభాషలో నడఁగిన మహత్త్వమును వ్యక్తీకరించుటకు నిమిత్తమైనది ఆంగ్లభాషయని ఋజువుచేయుటకు ఎన్నేనిదృష్టాంతము లున్నవి. ఆంగ్లవంగ

కవుల వ్రాఁతలను పుంఖానుపుంఖముగ పరిశీలించి, ఆంధ్రభాషోన్నతికి ఆంగ్లసారస్వతాభిజ్ఞానము విశేషసాహాయ్యము సలుపునని పదంపడి రూఢిచేయుదును. నాటకరచనమున సూర్యచంద్రులట్లు వంగదేశమున తేజరిల్లిన ఇరువురు మహాపురుషులలో నొక్కండైన ద్విజకవి ఈ నడుమ నాంధ్రులకు పరిచితుఁడైనాఁడు. పల్వురాంధ్రులు గిరీశుని పేరు వినియుండరు.

ఆంగ్లసాహితీదుర్గమునుండి ఎగయు విజయకేతనముపై కన్ను నిలిపి, ద్విజేంద్రుఁడు కలమును పట్టినాఁడు. ప్రతీచీఖండమున చదువులు పడయ నరుగుతఱి, ఓడయందీతఁడు చేపట్టినవి షెల్లీ, కీట్స్, బైరన్, బ్రౌనింగ్, కార్లైల్, షేక్స్పియరుల గ్రంథములు. స్ట్రెట్ఫర్డ్ ఆన్ ఏవన్ జూడ నరిగి, భావభరితమైన తనహృదయమును ఆంగ్లకవిసార్వభౌముని కని, పెంచిన మట్టిపైఁ గుమ్మరించినాఁడు.* ఆంగ్లసాహితీ పరిజ్ఞానమును తన యంతరంగమందలి అపరంజిని దొలుచు త్రవ్వుగోలఁ గావించుకొనినాఁడు. ఆ బంగారుతో చక్కని నగలు చేసి, వంగమాతృక కప్పన మొనరించినాఁడు. "అమార్ దేశ్", "అమార్ జన్మభూమి", "భారత అమార్," "మేవార్ పహాడ్", "జననీ భారతవర్ష" మున్నగు ద్విజకవి పద్దెములు మాతృదేశము నుద్దేశించియే

* షేక్స్పియరును సంబోధించుచు ద్విజేంద్రుఁ డిట్లనినాఁడు: "Sleeping Poet! wherever English is spoken your name is familiar. From the other side of the Atlantic your name will be sung; in the south seas your name will resound, the whole of Europe, oblivious of race-prejudice, will join in your praise. And far away on the banks of Ganges, the sons of Aryavarta will adore you and pay you their hearts' homage as the chosen of the Muses, the brother of Kalidas and the favourite poet of the world."

సంబోధింపఁబడినను,—వీనియందలి భావతరంగములు భారతసీమ లోనివేయయ్యె, ఈ వీచికల నుపొంగించినది ప్రతీచీసారస్వతవాతూలమని భాషాసేవకు లెఱుఁగకపోరు. ఈతని "హాషీర్ గాన్"లో ఆంగ్లసౌరభమున్నది. ప్రపంచమునెడల విశేష అసహ్యాభావమును వ్యక్తీకరించుచు, తీవ్రవిషయములందు కొంతహాస్యమును కలుపుచు, బైరన్ చూపుచువచ్చిన రచనాపద్ధతిని ద్విజేంద్రుఁడు తన "మంద్ర" యందుఁ జూపినాఁడు. ఈతని మానసి పాడిన పాటకును, షెల్లీ పలుకులకును ఎంతపోలిక యున్నదో పరికింపుఁడు.

ప్రేమదానంబు ప్రేమకు వృద్ధిఁజేయు;
ప్రేమచే వీచుఁ బవనుండు పృథివియందు;
ప్రేమచేఁ బూవులెల్లఁబరీమళించు;
ప్రేమతోఁగౌఁగలించు వార్ధిని నభంబు;
ప్రేమచేఁ గాంతినిచ్చు నీరేజసఖుఁడు;
ప్రేమచే శిలయును మంచురీతిఁ గరఁగు;
ప్రేమచే స్వర్గమర్త్యముల్ వెలయు నొకట;
ప్రేమకాంతిని విశ్వంబు వెలుఁగుచుండు;
ప్రేమవిజయముఁ గీర్తించు విహగతతులు;
ప్రేమగానంబుచే నభోవీధి మ్రోఁగు.

(నే నాంధ్రీకరించిన "మివారుపతనము" లోనిది.)

"The fountains mingle with the river
And the rivers with the ocean,
The winds of heaven mix for ever
With a sweet emotion;

Nothing in the world is single,
All things by a law divine
In one another's being mingle"
...  ...  ...  ...
" See the mountains kiss high heaven
And the waves clasp one another;
No sister-flower would be forgiven
If it disdain'd its brother:
And the sunlight clasps the earth,
And the moonbeams kiss the sea—"

"Love's Philosophy'

" నీవే గ్రహింపఁగలవు. స్వర్గరాజ్యమునుండి పతితవై నీ విపుడు నరకకూపమందుఁ బొరలాడుచుంటివి. నీ కృత్రిమకుత్సితములు నీ చిత్తమును వేధించుచునేయున్నవి. అంతరాత్మ నడంచివైచుట నీ తరముగాదు " అని నూర్జహాను నుద్దేశించి ఆమెతనయ లయలా పలికిన నుడువులు భావగర్భితములు మనుష్యమానసమున బుడుంగుమని పాత్రగ్రథనమందలి లోఁతును కనుఁగొని, పృథ్వికి తెలుపుట గ్రంథకర్త కర్తవ్యము. ద్విజకవినుడువులకు సరివచ్చు పంక్తు లెన్ని ఆంగ్ల సాహితియందున్నవో పరికింపుఁడు.

" Better be with the dead
Than in the torture of the mind to lie,
....  ....  ....  ....  ....
Oh! full of scorpions is my mind dear wife"

—Shakespeare's "Macbeth".

" O coward conscience how dost thou afflict me!
Cold fearful drops stand on my trembling flesh.
What do I fear? myself?—

—Shakespeare's "Richard III".

" He that hides a dark soul and foul thoughts
Benighted walks under the mid-day sun ;
Himself is his own dungeon—"

—Milton's "Comus".

" A guilty conscience who can bear?"

—Shakespeare.

St. Paul says, " the Gentiles have the law of God written in their hearts; their conscience also bearing witness and their thoughts the meanwhile accusing or else excusing one another. "

Milton puts these words in Satan's mouth:

" Which way I move is hell, myself am hell "

" He started like a guilty thing."

—Shakespeare's "Hamlet".

" Oh ! it is monstrous! monstrous !! Methought...."

—Shakespeare's "Tempest".

నాటకరచనమున ద్విజేంద్రుఁడు షేక్స్పియరును అనుకరింప వలెనని విశేషయత్నము సలిపినాఁడు. తన యత్నమున నీతఁడు కొంతదనుక కృతకృత్యుఁడైనాఁడని చెప్పవచ్చును. షేక్స్పియరు పదములట్లు ద్విజకవిపదములును భావగర్భితములై యుండును. షేక్స్పియరు పాత్రలవలె నీతనిపాత్రలు సత్యములు. వర్ణనమందుఁ గూడ వీరిరువురిలోను కొంతపోలిక యున్నది. మానసి అజయసింహుల ప్రణయము ("మీవారుపతనము" చూడుఁడు) హేమ్లేట్, వొఫీలియా, ఒథెల్లో డెస్డిమోనాల ప్రేమను దలపించును. ఈతని యారంగజేబ్ అయాగోను కాదు కాని షేక్స్పియరుయొక్క గ్లస్టరును తలఁపునకుఁ దెచ్చును. అయాగో అంతరాత్మనుకూడ పడఁదన్నిన

ప్రబుద్ధుఁడు. గ్లస్టరట్టివాఁడు కాఁడు. ఔరంగజేబును అట్టివాఁడు కాఁడు. ఔరంగజేబు గ్లస్టరులందు చాలపోలికలు కానగును. తాను చేసిన దారుణకృత్యములకు గ్లస్టరు మానసమున వేదనపడెననియు, నిష్ఠురుఁడై రిఛార్డ్ చంపిన అభాగుల రూపములు అతని కన్నులెదుటఁ దోఁచెననియు షేక్స్పియరుయొక్క "Richard III" లోని, ఐదవ యంకమందలి మూఁడవరంగమును చదివినపుడు తెల్లమగును. రిఛార్డ్ వలెనే సన్నిహితబంధువులను, సోదరులను జంపి సింహాసనారూఢుఁడైన ఔరంగజే బెట్టిమానసిక వేదనమునకు గుఱియైనాఁడో వీక్షింపుఁడు.

"......ఆహా! ఏమి ఈ గాఢాంధకారము!—ఈ కార్యములకు కర్త ఎవరు?—నేనే! ఇది న్యాయాధికారుల విచారణ కాదా?—ఆహా! ఏమి భీషణశబ్దము! అవును!—అది వాయుశబ్దము!—ఇదేమి!—ఎట్లయిన నీచింతను చిత్తమునుండి దూర మొనరింపఁజాలకుంటిని. కన్నులు మూతలుపడుచుండుట లేదు. (దీర్ఘనిశ్వాసము) ఓః! ఏమి ఈ నిశ్శబ్దము! ఇంత నిశ్శబ్దమేల! (పచారి చేయుచు, చివాలున నిలువంబడును) అదేమి! అదేమి!! అది దారాఛిన్నమస్తకము కాదా? అవునదియే! అదిగో! సుజారక్తాక్తశరీర మెంత భీషణమైయున్నదో! ఏమి! అది మురాదుకబంధమా! హాఁ!—ఇందేల వచ్చితిరి?—నేను విశ్వసింపను. అదిగో! వారు నన్నుఁ బిలుచుచున్నారు!—సమీపించిరి! నన్ను చుట్టివైచి నృత్యము చేయుచున్నారు! మీరెవరు?—జ్యోతిర్మయములగు ధూమశిఖ మాడ్కి జాగ్రత్స్వప్నావస్థలయం దరుదెంచి, నాకు వెఱపుఁగలుగఁ జేయుచుంటి రేల? హాఁ! అదిగో! మురాదు మొండెము చేసన్న చేయుచున్నది!—దారామొండెము నాపైఁ దీక్ష్ణదృక్కులఁ, బఱపుచున్నది!—సుజా! నవ్వుచుంటివా?—ఏమేమి? ఓః! (కన్నులుమూసి

కాని) పోనిమ్ము!—జరిగిపోయెను! ఆహా! నాశరీరమున రక్తస్రోత మతివేగముగఁ బ్రవహించుచున్నది! శిరంబుపై నేమి ఈ మహాశైల భారము!!"

(నే నాంధ్రీకరించిన "షాజహాన్" పంచమాంకము-
పంచమదృశ్యమునుండి)

"సయ స్తఖాను:—ఏమి ప్రభూ!

ఔరంగ:—ఏమిపని చేసితినోయి!

సయ స్త:—దేవర యుక్తముగనే యాచరించితిరి! బుద్ధి మంతునివలెనే కావించితిరి!!

ఔరంగ—కాని, పోనిమ్ము!! (మెల్లమెల్లగ వెడలిపోవును)

సయ స్త:—ఔరంగజేబూ! అట్లయిన నీకుఁగూడ నంతరాత్మ యున్నదా?

(నిష్క్రమించును.)"

("షాజహాన్" నాల్గవయంకము, ఆఱవరంగము.)

ద్విజేంద్రుని సుజాముౠదులు షేక్స్పియరు గానరిల్ రీగాన్ లను, ఆతని జాహనారా ఈతని కార్డీలియాను, ఈతని లియర్ ఆతని షాజహానును పోలియుందురు. ముఖ్యపాత్రలుమాత్రమేకాక, మిగుల సామాన్యమైన వీరిపాత్రలు ప్రాముఖ్యముఁ గలిగినవి. హేమ్లెట్ లోని రోజెన్క్రేంజ్, గిల్డెన్స్టెర్న్ లవలె "మీావారుపతన" మందలి షాజహాను, అబ్దుల్లా మున్నగువారు పాఠకుల లక్ష్యమును దాఁటిపోరు. ద్విజేంద్రుని "చంద్రగుప్త"యందు తోలుకాడు మాతృప్రేమ, షేక్స్పియరు "కొరియోలేనస్" లోని మాతృప్రణయమును దల పించును. ఆదిగ్రంథకర్తల (Classical Writers) ననుకరించిన

బెన్ జాన్సన్, బ్యూమంట్, ఫ్లెచర్ లట్లుకాక స్థలకాలాదినియమము లను పాటింపకయు, ట్రేజెడీలం దచ్చటచ్చట కామెడీదృశ్యములను జూపియు షేక్స్పియరు అవలంబించిన పద్ధతిని ద్విజకవి అనుకరించి నాఁడు. గభీరచింతా ప్రాముఖ్యముఁగల (Reflective Characters) పాత్రలిరువురు కవిశేఖరుల ఆదరము నందెను. తక్కుంగల భారత రచయితలవలె కేవలము పౌరాణికవిషయములనే సానఁబెట్టక, ద్విజేంద్రుఁడు చరిత్రవిషయకనాటకముల వ్రాసినాఁడు. నే నాంధ్రీకరించిన ద్విజకవినాటకములనుండి కొలఁదిభాగము లెత్తి చదువరుల కను లెదుటఁ బెట్టెదను. షేక్స్పియరురచనల కవి ప్రతిబింబములై యున్నట్లు వారు గ్రహింతురుగాక. కారాబద్ధుఁడై, ఉన్మత్తప్రాయుఁడైన షాజహాను వాక్కులు పరికింపుఁడు :

"షాజహాన్ :—జనకులారా! మీరు క్షుధార్తులైన పుత్రులకుఁ గూడుపెట్టకుఁడు. మీ తనయులను రొమ్ములపైఁ బరుండ బెట్టుకొని జోకొట్టకుఁడు! కొడుకుల చిఱునవ్వును చూడఁ బ్రణయమందహాసము సలుపకుఁడు! నందనులు కృతఘ్నులని విశ్వసింపుఁడు! కృతఘ్నతాంకురములు వారిహృదయములందు మొలకలెత్తెను! తనూజులు శిశుభూతములని నమ్ముఁడు! వారల నర్ధాశనబాధచేఁ గుందఁ జేసి పెంపుఁడు! ప్రభాతసాయంసమయములందు కరాఘాతదండతాడనములచే వారలఁ బీడింపుఁడు! సర్వదా దండించుచు, క్రోధానలప్రజ్వలితనేత్రములఁ జూపుచు, వారిని వడకింపుఁడు! ఆజ్ఞాబద్ధులఁ గావింపుఁడు. అట్లొనరించిన, వార లీ మహమ్మదువంటి పితృభక్తులు కాఁగలుగుదురు. వారి కిట్టి కఠినదండన మొసఁగుతఱి మీ హృదయములందు దుస్సహవ్యథ యుద్భవించుచో, మీ రాగుండెలను బ్రద్దలు గొట్టుఁడు! కన్నులనుండి బాష్పకణము లొలుకుచో, మీ కన్నుల

నూడఁ బెరికివేయుఁడు! కంఠములనుండి యార్తనాదము వెలువడుచో, నిజకంఠముల నులిమివేసికొనుఁడు—సోః—"

("షాజహాన్" మొదటియంకము, ఏడవదృశ్యము)

ఉన్మాదియైన లియర్ మాటలు గమనింపుఁడు:

" Ingratitude, thou marble-hearted fiend!
More hideous when thou show'st thee in a child
Than the sea-monster!

.... .... .... ....

Is it not as this mouth should tear this hand
For lifting food to't?

.... .... .... ....

Here I disclaim all my paternal care,
Propinquity and property of blood,
And as a stranger to my heart and me
Hold thee from this for ever.

... ... ... ....

Hear Nature! hear, dear goddess, hear!
Suspend thy purpose, if thou didst intend
To make this creature fruitful!
Into her womb convey sterility!
Dry up in her the organs of increase!
And from her derogate body never spring
A babe to honour her! If she must teem,
Create her child of spleen; that it may live,
And be a thwart disnatured torment to her!
Let it stamp wrinkles in her brow of youth;
With cadent tears fret channels in her cheeks;
Turn all her mother's pains and benefits
To laughter and contempt; that she may feel

How sharper than a serpent's tooth it is
To have a thankless child !"

"జహానారా :—(జనకుని గట్టిగఁ బట్టుకొని) జనకా! ఉన్మత్తులుగాకుఁడు.

షాజహాన్—అవునవును !—ఏమి ! నే నున్మాదుఁడ నై పోవుచుంటినా ? సత్యమే!—ఎల?—లేదు! లేదు! లేదు! అట్లుకాదు! ఈశ్వరా! నే నున్మత్తుఁడనుగాను! అట్లు కాఁగోరను! భగవాన్!—భగవాన్!—ఈ శీర్ణదుర్బలజరాజీర్ణ ఆశారహిత అసహాయషాజహానును వీక్షింపుము!—నీకు జాలి కలుగుట లేదా? జాలికలుగుట లేదా? ఆహాహా!...ఏపుత్రుఁ డొకప్పుడు పితృభయంబునఁ గంపించువాఁడో, అతఁడే నేఁడు జనకుని బంధించివైచెను!—ఇట్టి యవిచారమా! ఇట్టి యత్యాచారమా! ఇట్టి యస్వాభావికకృత్యమా! ఈశ్వరా! ఇట్టి దాష్ట్యము, నిట్టి దురంతము, నిట్టి దౌర్జన్యమును సహించి యూరకుంటివా! నీనియమ మంతకఠినమైనదా? ఇట్లు! ఇట్లు!!—నా యాత్మజుఁడే, నాతనూభవుఁడే నన్నిట్లు—సర్వేశా! నేనట్టిపాప మేమి గావించితిని?—హో!—"

("షాజహాన్" నాలుగవయంకము, ఐదవరంగము)

"......భీషణజంఝూమారుతమా! రమ్ము!—అదిగో!—ప్రచండధ్వానము సల్పుచు జంఝూనిల ముత్పన్నమగుచున్నది! ఘోరాశనీ! నభంబునుండి గుభాలునఁ బృథ్విపైఁబడుము!—అదిగో! అదిగో!! భీషణనిర్ఘోషము సల్పుచు, మహానిర్ఘాతము జగంబుపైఁ బడుచున్నది! మేఘములారా! గర్జింపుఁడు!—అదిగో! ఘోరరక రాశిసహస్రరవసన్నిభములై జలధరగర్జనలు వినఁబడుచున్నవి! (మేఘగర్జనము)"

("షాజహాన్" ఐదవయంకము, మూఁడవదృశ్యము).

"జహారత్ - ఓః! - ఏమి యీభయంకరఘోషము! ఏమి యీ భయంకర మేఘగర్జితము! వెలుపలఁ బంచభూతములు భీషణ సంగ్రామము సల్పుచున్నవి! ఈభవనాంతరాళమున— ఈ యర్థోన్మత్తపితామహుని హృదయకుహరాంతరాళమునఁ దాదృశసమీకమే జరుగుచున్నది ఓ! భీషణము! భీషణము!!" (మేఘగర్జనము)

("షాజహాన్" ఐదవయంకము, మూఁడవరంగము)

"You see me here, you gods, a poor old man,
As full of grief as age ; wreched in both........
....    ....    ....    ....
O Heavens !
If you do love old men, if your sweet sway
Allow obedience, if yourselves are old,
Make it your cause" etc. etc. etc.,
...    ...    ...    ...
...    ...    ...    ...

"Rumble thy bellyful ! Spit fire !
Nor rain, wind, thunder, fire are my daughters:
I tax not you, you elements with unkindness
I never gave you Kingdom, call'd you children,
You owe me no subscription ! then let fall
Your horrible pleasure; here I stand, your slave,
A poor, infirm, weak, and despis'd old man!—
But yet I call you servile ministers,
That will with two pernicious daughters join
Your high engender'd battles 'gainst a head
So old and white as this O! O! 'tis foul !"

(King Lear ; Act III ; Scene II.)

"షాజహాన్ అమ్మా! ---ఈ భయంకరఝంఝానిలాంధకార వర్షములఁజొచ్చి యొకమాఱు ముందుకుఁ బర్వెడ వాంఛించుచుంటిని. ఈ శ్వేతశిరోజములు లాగివైచి వాని నావాయుతరంగములం దెగుర వైచి, వృష్టిసలిలమునందుఁ బొరలింప వాంఛించుచుంటిని. తమ భయానకనినదంబుచే మానవుల నడలఁగొట్టుచు, నల్వంకల వృక్షంబులఁ బెకలించివేయుచు, మాడ్చివేయుచు, నెడతెగక రాలు పిడుగుల యెదుట నాగుండెలను నిలుప వాంఛించుచుంటిని. నాయెడందయందలి ఆత్మను వెలుపలి కూడఁబెఱికి, దాని నీశ్వరునకుఁ జూప వాంఛించుచుంటిని! ఇవిగో! - మరల గర్జనలు వినంబడుచున్నవి! మేఘములారా! ఏల నిష్ఫలముగ గర్జించుచుంటిరి? మీ యాఘాత పరంపరలచే నీవసుమతీకాంతవక్షమును దుత్తునియలు గావించి వేయుఁడు!—జీమూతపటలమా! ఏల ఘనీభవించుచుంటివి? వియత్తలమున సంచరించు చంద్రతారార్కులను దిగమ్రింగి నీ గభీరోదరాభ్యంతరమునఁ బడవేసికొనుము!--ఏమి! ఈ యాభీలనిర్ఘోషము!- ఏమి ఈ—హాహా! హెహా!! హెహా!!!" (జలధరగర్జనము)

("షాజహాన్" ఐదవయంకము, మూఁడవదృశ్యము).

"Oh heavens!
Rumble thy bellyful! spit fire! spout rain!
You nimble lightnings dart your blinding flames
Into her scornful eyes!
In-fect her beauty
You fen-suck'd fogs drawn by the powerful sun,
To fall and blast her pride!
.... ... .... .... ....
... .... .... .... ....
"And thou, all shaking thunder,
Smite flat the thick rotundity O' the world!

Crack nature's moulds, all germens spill at once,
That makes ingrateful man!" (*King Lear*)

"Each thing meets
In mere Oppugnancy: the bounded waters
Should lift their bosoms higher than the shores
And make a sop of all this solid globe."
(*Troilus and Cressida*)

"........the great globe itself
Yea, all which it inherit shall dissolve
And, like this insubstantial pageant faded,
Leave not a rack behind." (*The Tempest*)

దౌష్ట్యమును ("Gross evil in the monster") చూచి, ఆగ్రహావేశుఁడై ప్రాస్పెరో పృథ్వియంతయు వినాశము కావలె నన్నాఁడు. మనుజునిపట్లను, జీవనముపట్లను ఉగ్రుఁడై టైమన్ శాపవర్షముఁ గురిపించినాఁడు. కృతఘ్నులైన తనయులపై లియర్ రాజు కఠినవాక్కులు ప్రయోగించినాఁడు. ద్విజేంద్రుని షాజహాన్ ఈ మూవురకుటుంబములోనివాఁడే.

"Hamlet" లోని షేక్స్పియర్ వాక్కును

"...whose brains still beating puts him thus
From fashion of himself."

మనసునం దుంచుకొని, లియర్ రాజును దృష్టికెదుట నిలిపి, ద్విజకవి తన షాజహాన్ పాత్రను సృష్టించినాఁడు. ఉన్మాదుఁడై నెఱసిన వెండ్రుకల నూడ పెఱుకుకొను షాజహాన్ నకును, ఉన్మాదుఁడై గుడ్డలు చింపుకొనిన లియర్ ("Shifts himself into a mad man's rags to assume a semblance that very dogs disdained") నకును వ్యత్యాస మేమున్నది?

అంతరంగస్థితికి బాహ్యజగతిని పొందుసేయుట ఆదర్శరచయితల అభ్యాసము. ద్విజకవి వీరిపంథ ననుసరించినాఁడు.

పాత్రసృష్టియందేకాక, భావప్రకాశమందుకూడ ద్విజేంద్రుఁడు షేక్స్పియర్, మెటర్లింక్ మున్నగు ప్రసిద్ధరచయితల మార్గమును బట్టి నడచినాఁడు. చూడుఁడు:

“దారా:—నిద్రా! సర్వసంతాపహారిణీ! ప్రత్యహము నీవు మానవుల చింతల నన్నిఁటిని కొంతసేపు విస్మృతిగర్భమున ముంచి యుంచెదవు. జననీ! ఇపుడు నా చిన్నితనయుని వంతల నన్నిఁటిని మఱపింపుము.” (“షాజహాన్” నాలుగవఅంకము, ఏఁడవదృశ్యము.)

“ ........the innocent sleep,
Sleep that knits up the ravell'd sleave of care,
The death of each day's life, sore labour's bath,
Balm of hurt minds, great nature's second course,
Chief nourisher in life's feast ” (*Macbeth*)

“ O Sleep! O gentle Sleep!
Nature's soft nurse ... .... ....
.... ... ... .... ....
And steep my senses in forgetfulness ”—(*Henry IV*)

His body couched in a curious bed,
.... .... ... ... ...
His wonted sleep under a fresh tree's shade,
All which secure and sweetly he enjoys ” etc. etc.,
(*Henry VI*)

“ Sleep so soundly as the wretched slave,
Who gets him to rest,....cramm'd with distressful bread;
He, like a lackey from the rise to set,
Sweats in the eye of Phaebus, and all night
Sleeps in Elysium ” .... ... (*Henry V*)

"ఐశ్వర్యము స్తకమునఁ బదాఘాత మొనరింపఁగల శక్తిని విద్య యింకను కోల్పోవలేదు."

("షాజహాన్" ఐదవయంకము, ఐదవరంగము).

" Wisdom and fortune combating together
If that the former dare but what it can,
No chance may shake it " (*Antony and Cleopatra*)

"జరిగిపోయినదానిని మఱచిపోఁగలరా? వర్తమానమునుండి బలంబుగ దానిని విచ్ఛిన్నముఁ గావింపఁగలరా?........"

("షాజహాన్" నాలుగవఅంకము, నాలుగవరంగము.)

"The past belongs to us quite as much as the present and is far more malleable than the future Like the present, and to a much greater extent than the future its existence is all in our thoughts and our hand controls it...... it is true above all of our moral past and of what we consider to be most irreparable there." (Vide : Maurice Maeterlinck's " The past.")

చరిత్రశిల్పము నాటకరచనమునకు ప్రాణప్రతిష్ఠ చేయును. నలువది నాటకములు వ్రాసిన షేక్స్పియర్ మహాకవి ఈ కళయందు అద్వితీయుఁ డనిపించుకొనినాఁడు. ద్విజేంద్రుఁ డాతని ననుకరించి, భారతసాహిత్యము నిలుచునందాక భారతీయులదృష్టినుండి దాఁటిపోని వ్యక్తిచారిత్రములను నిర్మించినాఁడు. రాణాప్రతాపశక్తసింహులును, గోవిందసింహ భీమసింహులును, దుర్గాదాసు దిలీర్ఖానులును, షాజహాన్ ఔరంగజేబ్‌లును, నూర్జహాన్ మహాబత్ ఖాన్‌లును, చంద్రగుప్త చాణక్యులును, కల్యాణి, సత్యవతి, మానసి, మహామాయ, ముర, ఛాయ, హెలెన్‌లును ద్విజేంద్రునినాఁటనుండి భారతీయుల కనులెదుట అపూర్వరూపమునఁ దోఁచు మహావ్యక్తులైరి.

పద్యరచనమందుఁగూడ ద్విజకవి ఆంగ్లమందలి శోకరసపై కన్నుంచినాఁడు. రవీంద్ర బంకించంద్రులఁబోలు తోడుమహారచయితలవలె నీతఁడు ఆంగ్లకవుల నారాధించి అనువాద, అనుకరణ, అనుసరణములకు విశేషప్రాముఖ్యము నిచ్చినను, వెఱ్ఱిబానిసవలె మసలక వారివలెనే నిజదేశసంప్రదాయమును పాటించి, కొంతస్వాతంత్ర్యమును వ్యక్తపఱచినాఁడు. తాను భారతీయుఁడనను విషయ మీతఁడు మఱువలేదు. తనసీమయొక్క నికృష్టస్థితి కీతఁడు తనపాత్రలను నిమిత్తములు చేసికొని, కన్నుల నీరునించినాఁడు. తనకాలమందలి జాతీయసంచలనమున పెక్కుమున్కలు వేసి, అద్భుతభావములను తనలేఖినినుండి వెలారించినాఁడు. భారతసీమ భాస్వంతాశయములకు నాలవాలమని ఎఱిఁగి, తనపాత్రలందు వాని మహత్త్వమును తేటపఱచినాఁడు. మహితాదర్శములకు పండిన చేనైన రాజస్థానమునుండి ఈతఁడు ఐదు మహానాటకములందలి పాత్రలను గైకొనినాఁడు. ఈ నాటకము లద్భుతావేశముతోఁ దొలుకాడుచున్నవి. ఆంధ్రమహాశయులు వీని నింకను ఆదరింపకుండుట శోచనీయము. శతాబ్దులకుమున్ను జరిగిన చంద్రగుప్తుని చరిత్రకథను నేఁటికథనమట్లు ప్రత్యక్షము చేసి, గతమును కనులెదుటఁ బెట్టుట కవిలక్షణమని ఋజువు చేసినాఁడు. "కింగ్ లియర్"నాటకము నారాధించినను, ఈతఁడు తన "షాజహాన్"ను విషాదాంతము చేయక, నిజదేశసంప్రదాయమును మన్నించినాఁడు. క్షమాగుణమందలి మహత్త్వమును చూపఁగల మహనీయులు తన సీమయం దున్నారని ఆతఁడు నిరూపించినాఁడు. నిష్ఠురాచరణమునకు గుఱియైన షాజహాన్‌లో నీతఁడు అద్భుతక్షమాగుణమును జూపి, విషాదాంతము కావలయు "షాజహాన్"తుద సూర్యరశ్మినిఁ దళుక్కొత్తించినాఁడు. ప్రేక్షకుల మనసు లుడుకుచుండునని గ్రహించి, అగ్నికణములు

షెల్లీ వాక్కులను జవాహరత్ నోటనుండి కురిపించి సౌందర్యశుద్ధికి వలసిన రసమును ప్రసమ్మరించినాఁడు. బ్రౌనింగ్ వలె ప్రకృతియం దీతఁడు అద్భుతాశయ ప్రభలను, ఆశాపూరమును, ఆనందవీచికలను గాంచి, మనుష్యజన్మయందలి గొప్పందనమును ఉగ్గడించినాఁడు. వంగసాహిత్యమునకు అమరత్వ మొసఁగు ప్రభాకలితభావములను, తనరచనలందు బహుళముగ వెదఁజల్లినాఁడు. తన నాటకములను విశేషముగ గద్యలోనే రచించి, స్వీయసీమసాహితికి అపూర్వశోభ నొసంగినాఁడు.

నాటకరచనాభిలాషులకు ద్విజేంద్రుని రచనము చక్కని మేలుబంతి యగుననుట సాహసోక్తి కాదు.



